విద్యానగర చరిత్ర నవలామాలిక :

# రాజ్యక్రాంతి

మూలము :

కొరటి శ్రీనివాసరావు

అనువాదము :

శ్రీనివాసపురం సోదరులు

—: పబ్లిషర్సు :—

జనతా ప్రచురణాలయము

విజయవాడ-2.

# I. సామ్రాజ్యోదయ ఘట్టము

[క్రీ. శ. 1224 మొ॥ 1336 వరకు]

1 దేవగిరి దుర్గము

2 దేవగిరి పతనము

3 కంపిల రాయలు

4 కుమార రాముడు

5 రాజ్యోదయము

## II. సామ్రాజ్య వైభవ ఘట్టము

## [క్రీ. శ 1336 మొ॥ 1528 వరకు]

6 రాయ పరాభవము

7 గజవేటకాడు (సమ్రాట్ ప్రౌఢ దేవరాయలు)

8 రాజ్యక్రాంతి

9 తౌళవేశ్వరుడు

10 నాగలా దేవి

11 జగన్మోహిని

12 శాంతివాది

# IIII. సామ్రాజ్య దురంత ఘట్టము
## [క్రీ. శ. 1528 మొ॥ 1565 వరకు]

13 రాజద్రోహి

14 అమాత్యరత్న

15 పిచ్చి ప్రభువు

16 రాక్షసి-తంగడి (తాళికోట యుద్ధము)

## IV· సామ్రాజ్య పతన ఘట్టము

## (క్రీ. శ 1565 మొ॥ 1656 వరకు)

# రాజ్యక్రాంతి

## 1. శివసాయుజ్యము

యువరాజు మల్లికార్జునుడు శిరముపై హస్తములూని కూర్చొని యున్నాడు. అతడుపవిష్టుడైయున్న భంగిమను దిలకించినచో చింతయే మూర్తిదాల్చినట్లు దోచుచున్నది. ఒక పర్యాయము భారముగా నిట్టూర్చుచూ, మరొకపరి ఉలిక్కిపడి బిగ్గరగా అరచుచూ, మరుక్షణమే తనకు తానే సమాధానపడుచూ, మరల నాందోళన జెందుచూ ఈ విధముగా కల్లోల మానసముతో అతడు ఆశ - నిరాశలనడుమ చిక్కి జర్జరితుడు కాసాగినాడు.

'రుగ్ణశయ్య నలంకరించియున్న సామ్రాట్ ప్రౌఢదేవరాయ లీపర్యాయము స్వస్థుడు కానిచో గతి?' ఆ ఊహను, దాని పరిణామమును తలచుకొనుటకు నయితమతడు భీతిల్లసాగినాడు.

కాని, యీ యాలోచనల చింతనాస్మృతి లేక సామ్రాట్ ప్రౌఢదేవరాయలు రుగ్ణశయ్యపై పడుకొనియున్నాడు. అతని ప్రాణము చావు బ్రతుకుల పోరాటములో నున్నది. అతనిని రక్షించుటకై రాజవైద్యులు చేసిన ప్రయత్నములన్నియునూ విఫలము లైనవి. సామ్రాట్టులను కాపాడుటకై భగవంతునిపై భారమువేసి ఆ భిషగ్వరులు తమ చివరి ప్రయత్నమును జేసినారు.

ఆ చివరి ప్రయత్నమువలనకూడ ఏ ప్రయోజనమూ కనబడలేదు. గడచిన రెండు రోజులనుండి సార్వభౌమునిస్థితి చాల విషమించినది. అతడు దీర్ఘనిద్రకు - శాశ్వతనిద్రకు - సిద్ధమగుచున్న వ్యక్తివలె, జాగ్రత్సుషుప్త్యవస్థలనడుమ ఆ రెండు రోజులను గడపినాడు. ఇప్పుడతనికి పూర్వమువలె తన బంధు - మిత్రులు స్మృతిపథములో

మెదలుటకూడ లేదు. భార్య బిడ్డల మాటకూడ మరచిపోయినాడు. ఈ పర్యాయ మీ యస్వస్థతను గడచి తమ ప్రభువు గట్టెక్కుటలేదని తెలిసియీ వారు నిద్రాహారములను మాని సార్వభౌమునికి సేవలు చేయుచున్నారు. కాని, ఎంత జేసిననూ ఆరోగ్యము చక్కబడుటకు మారుగా దినదినమునకూ అస్వస్థత హెచ్చుకాసాగినది.

ఇంత త్వరలో పరిస్థితి యీ విధముగా విషమించగలదని మహారాణి పొన్నలాదేవికాని. రాజకుమారుడు మల్లికార్జునుడుకాని నిరీక్షించలేదు. సుమారు మూడు సంవత్సరములకు పూర్వమిదే విధముగా సార్వభౌముడొక యాపదనుండి తప్పించుకొని స్వస్థతగాంచినాడు. సాళ్వ గోపరాజు ప్రకరణములో ఆనాడు మృత్యు గహ్వరమునుండి సార్వభౌముడెట్లో తప్పించుకొన్నాడు. అది ఆతని యదృష్ట ఫలమనవలయును.

సాళ్వగోపరాజు సార్వభౌముని మేనల్లుడైననూ, ద్రోహియగు సింగరాజు మాటలాలించి, సార్వభౌమునికి ద్రోహము దలపెట్టినాడు. సార్వభౌముని సోదరుడగు శ్రీగిరి ప్రతాపరాయలతో గలసి అతనిని హత్యజేయుటకు కుట్రపన్నినాడు. కాని, యదృష్టవశమున - అరివీరులపై జైత్రయాత్ర వెళ్ళియుండిన - లక్కనామాత్యుడు సకాలములో రాజధానికివచ్చి, సార్వభౌముని గండమునుండి కాపాడినాడు. విద్రోహుల హస్తములలో పట్టుబడక, సామ్రాజ్యలక్ష్మి నిలచినది. సంగమవంశ ప్రభువులను మూలకుద్రోసి, విజయనగర సింహాసనమును తామే ఆక్రమించుకొనుటకై సాళువగోపరాజు. ప్రతాపరాయలు చేసిన ప్రయత్నములు విఫలములైనవి.

సామ్రాట్ ప్రౌఢదేవరాయ లీ గండమునుండి తప్పించుకొని బయట పడిననూ, గోపరాజు కైజారువలన కలిగిన గాయము మాసిపోవుటకు చాలకాలము పట్టినది. ఈ సమయముననే సామ్రాట్టు తన జీవితములో మహదాశయ సాధనమని భావించిన హిందూ - ముస్లిం మైత్రి యను ఆశాసౌధ గోపురముకూడ అతని కనుల యెదుటనే కూలిపోవు

సంతతి సంఘటన సంభవించినది. సార్వభౌముని పాలిటికదియొక భరింపరాని గాయమైనది.

ప్రౌఢదేవరాయలు తనజీవితములో నెక్కుడుకాలమును బహమనీ సుల్తానులతో మైత్రికై, భద్రపునాదివేయుటకై గడపినాడు. అతడు గర్వితుడై తనమీదికి యుద్ధమునకు వచ్చిన అల్లావుద్దీనును శాంతిభిక్ష నర్థించునట్లుగా చేసినాడు.

హిందూ - ముస్లిములలో నిజమైన మైత్రికి పునాది యేర్పడిన కాని, ఉభయరాష్ట్రముల కళ్యాణము సాధింపబడదని గ్రహించిన సామ్రాట్ ప్రౌఢదేవరాయలు తనరాజ్యములో ముసల్మానుల కాశ్రయమిచ్చి. రాజధానిలో వారికొరక మసీదును కట్టించినాడు. తన సైన్యమందుననూ, ఆస్థాన మందుననూ అనేకమంది యవనులను ఉన్నతోద్యోగులను, విశ్వసనీయులగు ప్రభుత్వాధికారులుగను నియమించినాడు. ఈ యధికారులకొరకై ఆస్థానములో నొక ఉన్నతాసనముపై పవిత్రమగు కురానునుంచి వారి మతధర్మమును గౌరవించినాడు. కాని, ఈ ప్రయత్నములన్నియుకూడ ఏ ప్రయోజనమును కలిగించలేకపోయినవి. ఆతడు కోరిన హిందూ-ముస్లిం సఖ్యము, సహజీవనముల స్వప్నము నీటిబుడగవలె ఆరిపోయినది.

రాజధానిలో చేరిన మహమ్మదీయుల కాశ్రయమొసగుట పాముకు పాలుపోసినట్లయినది. కొందరు ద్రోహులగు ముసల్మానులు సామ్రాట్ ప్రౌఢదేవరాయలు గాయపడి, మంచముపట్టి యున్నాడనియూ, ఈ సమయములో దండెత్తివచ్చినచో విజయనగరము వశముకాగలదనియూ అల్లాయుద్దీనునకు తెలియజేసినారు. స్వజాతీయులంపిన వార్తలచే ప్రేరితుడైన బహమనీ సుల్తాను అల్లాయుద్దీను తాను విజయనగరరాజులతో చేసుకొనియున్న సంధిషరతుల నతిక్రమించి, సంపద్భరితమైన విజయనగరమును కబళించుటకై హఠాత్తుగా దండెత్తివచ్చినాడు. గోపరాజు గావించిన హత్యాప్రకరణములో సార్వభౌముని సంరక్షకులందరూ మరణించియుండగలరనియూ, ఈ సమయములో తాను విజయనగరము మీద దండెత్తివెళ్ళిన సులభముగా దానిని వశపరచుకొనవచ్చుననియూ

ఆశించి, శైవసన్యాసుల చర్యలవలన అది అరాచకత్వముగా నున్నదని భావించి, యుద్ధమును ఘోషించి అతడు దండెత్తి వచ్చినాడు.

అల్లాయుద్దీనుడు తనపై హఠాత్తుగా దండెత్తిరాగలడని ప్రౌఢ దేవరాయలు స్వప్నమునసైతము భావించియుండలేదు. ప్రత్యర్థి నెదుర్కొనుటకై యుద్ధప్రయత్నము లొనరించుకొనుటకుకూడ సమయము లేదు. ఇటువంటి పరిస్థితిలో బహమనీసుల్తాను తనకు ఏడులక్షల వరహాలు కానుకగా సమర్పించునట్లయినచో తాను వెనుదిరిగి వెళ్ళగలనని రాయబారము పంపినాడు. అవమానకరమగు నీ సంధికి సార్వభౌముడు సమ్మతించలేదు తాను తల్పముపట్టియున్ననూ, రాష్ట్రమునకేర్పడిన అవమానమును తుడిచివేయుటకై సంకల్పించి, తానే స్వయముగా దండెత్తివెళ్ళ నిశ్చయించినాడు.

అమాత్యుడగు తిమ్మనదండనాయకుడు సామ్రాట్టుల నీ కార్యము నుండి అడ్డుకొన సమర్థుడు కాలేకపోయినాడు.

లక్కనామాత్య - జక్కనాచార్యులు శైవసన్యాసులుగా తమ జీవిత శేషములను గడుప నిశ్చయించి, అధికార నివృత్తుడైన తరువాత తిమ్మనదండనాయకుడు అమాత్యపదవి నలంకరించినాడు.

తిమ్మయామాత్యుడు శ్రీవైష్ణవుడైననూ, ధర్మాత్ముడగు ప్రభు సేవా పరాయణుడుగనూ, దక్షతగల పరిపాలకుడుగనూ గణుతికెక్కినాడు. అతడు ధర్మాత్ముడూ, భగవద్భక్తుడూనై సామ్రాజ్యమందలి సకల వర్ణములవారి ప్రీత్యాదరములకు పాత్రుడైనాడు. అతనిపై నందరికీ అతిశయమైన గౌరవము కలదు.

అతడు శ్రీయదుగిరి (మేలుకోట) చలువనారాయణస్వామి భక్తులగు సింగన - సీతాంబా పుణ్యదంపతుల పుత్రుడు. జక్కనాచార్యుని కాలములో నెలమంగల రాజ్యమునకు పాలకుడుగా నుండెను. అతని పత్ని రంగమాంబ. ఆమెకూడ పతివలె ధర్మపరాయణురాలు. ఆ దంపతులు మేలుకోట శ్రీయదుగిరి నారాయణస్వామికి మంటపమునూ, పుష్కరణిని, నవరత్నఖచితమైన పల్లకిని చేయించి యిచ్చుటయేగాక,

శ్రీరామానుజులను యతివరేణ్యులచే ఆ వైష్ణవక్షేత్రముయొక్క జీర్ణోద్ధరణ కార్యమును చేయూని పూర్తిగావించినారు.

వైష్ణవుడగు తిమ్మయామాత్యుడు అధికారమునకు వచ్చుటందరికీ సంతోషమైనది. అతడు లక్కనామాత్యుని అభిమానమునకుకూడ పాత్రుడైనాడు. అతని వజ్రముష్టిలో సామ్రాజ్య భవిష్యత్తు సుభద్రముగా నున్నది. ఇది తెలియక అల్లాయుద్దీనుడు తన ముస్లిం బాంధవుల మాటలకు చెవియొగ్గి. సార్వభౌమునిపై దండెత్తి వచ్చినాడు.

ఈ పర్యాయము బహామనీసుల్తానుకు తగినబుద్ధిజెప్ప నిశ్చయించి, సార్వభౌముడు తానే స్వయముగా సైన్యములతో బయలుదేరినాడు. అతని యంగరక్షకుడుగా తిమ్మయామాత్యుడు నిలచినాడు.

ఉభయ సైన్యములకు బంకాపురమువద్ద ఘోరయుద్ధము జరిగినది. బంకాపురము విజయనగరమువారి వశమైనది' రాయచూరు ఇక తమవశము కాబోవుచున్నంతలో, ఎవరో వైరులు విడచిన యొక బాణముచే గాయపడి సార్వభౌముడు నేలగూలినాడు.

తిమ్మయామాత్యుడు వెంటనే సామ్రాట్టుని శిబిరమునకుసాగించి, రాజవైద్యులచే శస్త్రచికిత్స చేయించినాడు. సార్వభౌమునకు ప్రాణాపాయము కలుగకపోయిననూ, అతడు వెంటనే రాజధానికి వెనుదిరుగుట యనివార్యమైనది. ఈ విధముగా సార్వభౌముడు రాయచూరును గెల్చు కార్యమును తిమ్మయామాత్యుని కప్పగించి, తన కిష్టము లేక పోయిననూ రాజధానికి తిరిగివచ్చినాడు. వచ్చి రుగ్ణశయ్యమీద నలంకరించినవాడు మరల లేవలేదు.

ఈ విపత్తునుండి యీ పర్యాయము సార్వభౌముడు కోలుకొను స్థితిలోలేడు. మొదలే దుర్బలముగా నుండిన దేహమునకు బాణాహతిచే గలిగిన గాయమునుండి యేర్పడిన రక్తస్రావము మరింత దుర్బలతను కలిగించినది. సార్వభౌముడీ దైహిక చింతకంటెనూ మానసిక యాతనచే నెక్కుడు కృశించసాగినాడు.

ఇంతటి స్థితిలో సైతమతడు సామ్రాజ్యక్షేమ చింతనమునే చేయసాగినాడు. తనను చూచుటకెవరు వచ్చిననూ "అమాత్యులు

వచ్చిరా? రాయచూరు మనవశమైనదా?" యని వారినడుగువాడు. కాని, తిమ్మయామాత్యునినుండి ఏ వార్తయునూ రాలేదు. అందుచే సార్వభౌముని మనస్సు చింతాజనకము కాసాగినది. ఆ చింత నూతనిని కృశింపజేసినది.

కొంతయాలస్యమైననూ సార్వభౌముడు నిరీక్షించిన సంతోషకర వార్తనే తిమ్మయామాత్యులు తెచ్చినాడు. అతడు బహమనీసుల్తాను నోడించి, రాయచూరును గెల్చి వశపరచుకొన్నాడు. అల్లాయుద్దీనుడు పరాజితుడై వెనుకకు పారిపోయినాడు. తిమ్మయామాత్యుడు రాయచూరు రక్షణకు తగినవ్యవస్థగావించి, సార్వభౌముని చూచుటకై ఆత్రుతగా రాజధానికి వచ్చినాడు. అతడు వచ్చునప్పటికి సార్వభౌముడు పరలోక యాత్రను సిద్ధముగానున్నాడు.

తిమ్మయామాత్యుడు ప్రౌఢదేవరాయల తల్పమువద్దకు వెళ్ళి, అతని పాదములంటి నమస్కరించి, అతని హస్తమును వదనముపై నిడుకొని కన్నీరు కార్చినాడు.

"ప్రభూ, ప్రభూ!...." అని పసిపిల్లవానివలె రోదించినాడు.

తనహస్తము చల్లనగుటచే సార్వభౌముడు కనులువిప్పి చూచి నాడు. కాని, తిమ్మయామాత్యుడు వెంటనే గుర్తుకురాలేకపోయినాడు.

"ఎవరు, తిమ్మనామాత్యులా?...." మెల్లగా స్వగతము పలుకు కొనుచున్నవానివలె యడిగినాడు,

"అవును ప్రభూ! ఆపాపియే యితడు...." అశ్రుపూరితములైన నయనములను ఒత్తుకొనుచూ తిమ్మనామాత్యు లనినాడు.

"అమాత్యులూ, ఎందులకేడ్చుచున్నారు? నాకేమియూ కాలేదు.... నీవు వెళ్ళినపని ఏమైనది? సుల్తానుపై మనకు జయము లభించినదా? రాయచూరు మన వశమైనదా?"

"పంపాపతి దయవలన మనకు జయములభించినది ప్రభూ! రాయచూరు మన వశమైనది. ఆ ద్రోహియగు సుల్తానుడోడి పలాయన మును చిత్తగించినాడు!"

ఈ వార్తవిని సార్వభౌముని కనులు నిప్పులవలె ప్రజ్వలించినవి ముఖములో చిరునవ్వు తేలియాడినది. ఒక విధమైన ఆత్మతృప్తి మనశ్శాంతి అప్పుడ ఆవాసమేర్పరచుకొన్నవి.

సామ్రాట్ ప్రౌఢదేవరాయలు కుమారుడగు మల్లికార్జునునీ, పత్నియగు పొన్నలాదేవినీ సముఖమునకు రప్పించుకొనినాడు. వారి సంరక్షణా భారమును తిమ్మయామాత్యుల కప్పగించుచూ—

"అమాత్యులా! ఈ బిడ్డని చూచుకొనుభారము, ఈపవిత్ర సింహాసమన్యులపాలుకాకుండా దీనిని రక్షించు బాధ్యతను మీకప్పగించి నేను నిశ్చింతగా కనులు మూసుకొనవలయునని యున్నాను........"అన్నాడు.

"ప్రభూ! తమరంతటి పలుకులాడకుడు...."

"ఆడుటకాదు అమాత్యులా! నా పరిస్థితి ఏ విధముగానున్నదో నాకు బాగుగా అర్థమైనది. నా జీవన్నాటకమందలి చివరియంకమిది. వీరునివలె మరణించవలయునని నేననుకొన్నాను. కాని, నా కోరికకు వ్యతిరేకముగా యిప్పుడు తల్పముపై ప్రాణములను వదలుచున్నాను. అందులకై నాకు చాలవ్యథగానున్నది !"

"లేదు ప్రభూ! * శరణులైన తమకు మరణముకూడ ఒక మహానవమి!"

"ఆ విషయమును నేనెరుగుదును అమాత్యులా! కనుకనే నేను సంతోషముగా శివసాన్నిధ్యమునకు వెళ్ళుచున్నాను. హిందూ-ముస్లిం సఖ్యమను మహామందిరమునకు నేను భద్రమైన పునాది వేయవలయునని యనుకొన్నాను. కాని, ఎందులకో నా యీ కోర్కె ఆ పంపాపతి చిత్తమునకు రాలేదు. ఈ ఒక్కవిషయములో నేను భగ్నమనోరథుడైనాను. ఈనాడు మనచే పరాభూతుడై పారిపోయిన బహమనీసుల్తాను ఈ యవమాన - పరాజయములను మనసున నిడుకొని మరల మనమీదకు దండెత్తివచ్చుట నిశ్చయము. ఆ బహమనీసుల్తానుల బారినుండి సామ్రాజ్యమును రక్షించుభారము మీయది. భగవంతుడు మీకాశక్తి ననుగ్రహించుగాక!యని ప్రాంజలి ఘటించుచున్నాను."

*శరణులనగా శైవసన్యాసులు.

"ప్రభూ! తిమ్మయామాత్యుడు జీవించియున్నంతవరకూ సామ్రాజ్యమునకే యపాయమునూ రాదు. యువరాజకుమారుల సిగపూవుకూడ వాడదు. తాము నిశ్చింతగా నుండుడు!" అని తిమ్మయామాత్యుడు ధైర్యమును చెప్పినాడు.

అ మాటలకు సామ్రాట్ ప్రౌఢదేవరాయలు తృప్తిసూచకమైన ఒక దరహాసమును జవాబుగా వెలిబుచ్చి కనులు మూసుకొనినాడు. ముకుళితములైన ఆనయన సరోజములు మరల వికసితములు కాలేదు. అతడు శైవసన్యాసివలె జీవించి, మిత్రునివలె మృత్యువు నాహ్వానించినాడు. అతని పాలిటికి నిజముగా మరణము మహోనవమియేయైనది.

# 2. సహగమనము

సామ్రాట్ ప్రౌఢదేవరాయల మరణము యువరాజుమల్లికార్జునునకు అకాశమువచ్చిమీదపడినట్టుగా అయినది. తండ్రి తనను అనాథునిగాజేసి యింతత్వరలో విడిచివెళ్ళగలడని అతడనుకొనలేదు. తండ్రికాలములో అతడుయువరాజుగానుండిసామ్రాజ్యపాలనా భారములో భాగము వహించిననూ, అతడింకనూ రాజ్యపాలనా విషయములో దక్షతను గలిగియుండలేదు. విశాలమైన సామ్రాజ్యమును పరిపాలించు ధైర్యముగాని, శక్తి-సామర్థ్యములుగాని యతనిలో లేవు. తల్లి ప్రభావములో పెరిగిన బాలుడగుటచేతనో లేక లక్కనామాత్య - జక్కనాచార్య మొదలగు విరక్తుల సహవాసములలో పెరుగుటచేతనో, తండ్రియొక్క ధార్మికజీవన వర్చస్సువలనో, కాని మొత్తముపై నతని మనస్సు ఐహిక భోగముల కంటెనూ, పరమార్థ విచారములనే ఎక్కుడుగా చింతించసాగినది. అతడు చాల సూక్ష్మమతియు, పాపభీరువునైన బాలుడుగా నేర్పడినాడు. తనతండ్రి విడచివెళ్ళిన సామ్రాజ్యభారమును తానొక్కడే ఎట్లు మోయుటను సమస్య అతనినిప్పుడుపట్టి బాధించసాగినది. పరిస్థితిని ధైర్యముగా నెదుర్కొనగలశక్తిగాని, మనస్థయిర్యముగాని అతనిలో లేదు.

తండ్రి మరణించు నప్పటి కతనికి యిరువదేండ్లప్రాయము. వివాహవయస్కుడైననూ, అతనికాచింతయేలేదు. పెండ్లివిషయమును తల్లిదండ్రులు ప్రస్తావించినచో అతడు సిగ్గు జెందెడివాడు. వివాహము చేసుకొమ్మని వత్తిడిచేసినచో అచటినుండి పారిపోయెడివాడు.

ఒక పర్యాయము పొన్నలాదేవి కుమారుని ఎదట ఎవరో రాజకుమారి విషయమును ప్రస్తావించినది. తల్లియాజ్ఞకుకట్టుపడి మల్లికార్జును డపటనే కూర్చొన వలసి వచ్చినది. ఆమె వివాహ విషయము నెత్తగా,

"అమ్మా, నేనింకనూ చిన్నవాడను. జీవనవిద్యార్థిని. నాకింత త్వరలో వివాహమా?" అని నవ్వుటకు ప్రయత్నించినాడు.

"మనమెల్లరమూ జీవన విద్యార్థులమే నాయనా! కాని జీవితము నేర్పు పాఠమొకదినములో ముగియదు. ఆ మరణ పర్యంతమూ మనము అది నేర్పెడి పాఠమును నేర్చుకొనవలయును. జీవితముకన్ననూ వేరు గురువులేడు. ఆ విషయము నాకు తెలియును. కాని, జీవనమనిన సంసారబంధమునుండి దూరముతొలగుటకాదు. అది భీరుత్వమునకు చిహ్నము. వచ్చినదానిని ధైర్యముగా నెదుర్కొని, జీవితము ప్రసాదించిన ఫలమును సంతోషముగా భోగించుటయే బ్రతుకుయొక్క రహస్యము! నీవు వివాహమును తిరస్కరించి, జీవితమును తృణీకరించెదవా!" అని పొన్నలాదేవి ప్రశ్నించినది.

ఈ మాటలకు యువరాజు మల్లికార్జునుడు జవాబివ్వక తల్లి ముఖములోనికి చూచినాడు.

"నాయనా! మనమందరమునూ జీవనపథములో పయనించుచున్న యాత్రికులము. ఈ యాత్రలో ఒకరు ముందు పయనించినచో, వేరొకరు వెనుక వచ్చెదరు. కాని, అందరునూ ఒకే గమ్యమును చేరుటకై బయలుదేరిన సహయాత్రికులు. మన యీ ప్రయాణము సుగమ మగుటకునూ, అర్థగర్భితమగుటకునూ జీవితము నేర్పిన శత పాఠానుభవములను మనవిగా చేసుకొనవలయును. వివాహమనగా

బంధనముగాదు - ధర్మార్థకామమోక్షములలో సాయపడగల సహధర్మ చారిణిని అగ్నిసాక్షిగా బడయుటయని అర్థము. తమ వంశోద్ధారకుని-సత్పుత్రునిగాంచి పితరుల ఋణమును దీర్చుటయని అర్థము. ఇది నీ పురుషధర్మముమాత్రమేగాక నీ కులధర్మముకూడనై యున్నది. ఈ పవిత్రకర్తవ్యమునుండి నీవు వెనుకాడుట శ్రేయస్కరముకాదు"

తల్లి యీ విధముగా చెప్పినపిమ్మట గత్యంతరములేక మల్లికార్జునుడు తాను మెచ్చగల కన్య లభించినచో వివాహమాడగలనని తల్లికి వాగ్దానమిచ్చి అచ్చటినుండి బయటపడినాడు.

మల్లికార్జునుడు వివాహమునకు సమ్మతించిననూ, అతని పరిణయముమాత్రము జరుగలేదు. తన కనులఎదుటనే కుమారుని పెండ్లి జరుగుటచూచి, సంతోషముగా మరణింపవలయుననుకొనిన సామ్రాట్ ప్రౌఢదేవరాయల కోర్కె నెరవేరలేదు.

ప్రౌఢదేవరాయలు శత్రువులతో నిండిన సామ్రాజ్యమును అతనికి వదలి మరణించినాడు. ప్రౌఢదేవరాయల సుదీర్ఘమైన పాలనలో సామ్రాజ్యమందెల్లడలా శాశ్వతమైన శాంతి - సుభిక్షములు విలసిల్లిననూ, అతని అంత్యదశలోమాత్రము అశాంతి ప్రబలినది. అతడూహించిన హిందూ - ముస్లిం సఖ్యపు భవ్యభవన మతని కనుల ఎదుటనే కూలిపోయినది. మిత్రుడగు బహమనీసుల్తాను సామ్రాజ్యముమీద పగదీర్చుకొనుటకై జూచినాడు. ఈ విషయము తెలిసి యింతవరకూ విజయనగరము జోలికి రాకయుండిన ఉత్కళగజపతిగూడ, తన రాజ్యదాహము దీర్చుకొనుటకై, సైన్యములను సమాయత్తపరచ సాగినాడు.

ఇటువంటి పరిస్థితిలో సామ్రాట్ ప్రౌఢదేవరాయలు హఠాత్తుగా మరణించి, సామ్రాజ్యమునూ, మల్లికార్జునునీ అనాథలనుగా జేసి పైచినాడు——

ఇక ముందేమిగతి? యని శిరముపై హస్తములూని కూర్చుని యున్న, కర్తవ్యతా విమూఢుడగు మల్లికార్జునునకిప్పుడంతకంటెనూ

ఘోరమగు వార్తయొకటి తెలిసినది. ఒకభటుడు ప్రవేశించి భయంకర మైన విషయము నొకదానిని తెలిపినాడు.

"ప్రభూ! మహారాణి పొన్నలాదేవిగారు సార్వభౌములతోబాటు సహగమనము చేయుటకై నిశ్చయించుకొని. మీ యనుమతి కోరుటకై వచ్చియున్నారు."

ఈ మాటలాలించి మల్లికార్జునుడు దిగ్భ్రాంతుడైనాడు. అతనికి తలపై పిడుగుపడినట్లయినది. ఇప్పుడిక తనకు తల్లియేదిక్కని భావించిన అతనికి, ఆ యాశకూడలేక తాను నిలబడిన ప్రదేశమే తనను పాతాళములోనికి తీసుకొనివెళ్ళుచున్నట్టుగా తోచినది. అతడు సత్వరమే వచ్చి తల్లిని అంతఃపురమునకు తీసుకొనివెళ్ళినాడు.

పొన్నలాదేవి పతివియోగభరముచే జర్ఝరితురాలైనది. ఆమెవదనము కళావిహీనమైననూ, హృదయములో నిశ్చలత ఆవాసమేర్పరచుకొనియున్నది. ఏడ్చి - ఏడ్చి ఆమె కనులెఱ్ఱవారినవి. తల్లి నిస్తేజ వదనమ్మును చూడగనే మల్లికార్జునుడు ఆందోళన జెందినాడు. బాలునివలె తల్లియొడిలో తలనుంచి ఏడువసాగినాడు,

"అమ్మా! అప్పాజీవలె నీవుకూడ నన్నునాథునుగాజేసి వెళ్ళిపోయెదవా?" అని నిట్టూర్చినాడు.

"కుమారా! నీ పూజ్య పితరులు నాకొరకై స్వర్గములో వేచియున్నారు. వారిని చేరుకొనుటకు నాకు అనుమతినిమ్ము. వారు వియోగముతో బాధపడుచున్నారు. బ్రతికియున్నపుడు క్షణకాలమువారు నన్ను విడచియుండినవారు కారు. ఇపుడు మరణముతో నన్ను మోసగించినారు. వారితో సహగమనము చేయుటకు నా కనుమతి దయచేయుము. నే నాలస్యమొనరించినచో వారి యాత్మకు బాధకలుగగలదు, అందువలన సంతోషముగా నా సహగమనమునకు అమమతి నివ్వుము" అని దైన్యముగా ప్రార్థించినది.

కర్ణకఠోరమైన యామాటలాలించి మల్లికార్జునుడు స్తంభీభూతుడైనాడు. పసిపిల్లవానివలె రోదించినాడు.

"అమ్మా! నీవుకూడ నన్ను నాధునిగా జేసి వెళ్ళెదవా? నీవు-నాయనగారు లేని తరువాత యిక నేనుమాత్రమెందులకిచ్చట నుండవలయును? నన్నుకూడ మీవెంట తీసుకొని వెళ్ళుడు. నాకీజీవితము హేయముగా నున్నది. ఈదుఃఖభాజనమగు బ్రతుకు కంటెనూ చావు సుఖకరమని తోచుచున్నది. మీవియోగమును నేను భరించరేను, మీరులేని యీలోకమే నాకు శూన్యము!" అని మల్లికార్జునుడు పిచ్చివానివలె యనినాడు.

కుమారుని మాటలు విని పొన్నలాదేవి విహ్వలురాలైనది. ఇంతటి మాటలు తనకుమారు డాడగలడని ఆమె నిరీక్షించలేదు.

"నాయనా! ఏమి, నీమాటలు? నావలనే నీవుకూడా సహగమనము చేసెదవా? కూడదు తండ్రీ,కూడదు. ఇటువంటివాక్కులు నీనోటివెంట రాకూడదు. నీవు ధైర్యమవలంబించవలయును. ఇచ్చటి నీకర్తవ్యమును నీవు పాలించనిచో, పూజ్యులగు మీతండ్రిగారికి నీవుఅపచారము దలచినట్టు కాగలదు. వారు నీపైనుంచిన విశ్వాసమును వ్యర్థముచేయుదువా? నిరపరాధులగు సామ్రాజ్య ప్రజలను నీవు శత్రువుల కప్పగించి, భీరువువలె మరణమును కోరుచున్నావా? ఇదినీవంటి వీరపురుషుడాడ వలసిన మాటకాదు - ప్రాణభీతిగల సామాన్య మానవుడాడవలసినమాట! పిరికి పంద యగువాని నోటివెంటరావలసినమాట! నీవుపిరికి పందవైనచో, నీవంటి కుమారునికి జన్మనిచ్చిన మాకు ధిక్కారము. నీపూజ్య పితరుల యాత్మ ఎంతబాధజెందగలదో క్షణకాల మాలోచించుము. పురుష సింహునకు కావలసిన నీనుండి యింతటి మాటలు రాగలవని నేను నిరీక్షించలేదు!"

అని విచారమును వ్యక్తపరచుచూ పొన్నలాదేవి యనినది.

"అయినచో, మిమ్ములనందరినీ పోగొట్టుకొని, నేనేవైభవము కొరకై ఈసామ్రాట్ పదవి నలంకరించుట? పూజనీయులగు తండ్రిగారేమో ఈశ్వరేచ్ఛ ప్రకారము కైలాసమునకు వెళ్ళినారు. కాని, నీవు నిష్కారణముగ నన్ను అనాథునిగాజేసి వెళ్ళెదవా?"

"నాయనా! నేను నిన్ననాథనుగాజేసి వెళ్ళుటలేను. పతిభక్తిగల సతివలె సహగమనమునకు ప్రయత్నించుచున్నాను. నీ కనులముందు నేనే భౌతికకాయముతో కనబడకపోవచ్చును. అయిననేమి? మే మెచ్చటనున్ననూ నీ కళ్యాణమునే కోరగలము. పూజనీయులగు మీ తండ్రిగారు విడచివెళ్ళిన — సామ్రాజ్యమును శత్రువులబారినుండి రక్షించు —కార్యమును నీవు పరిపూర్తి చేయవలయును. ఇది మీ తండ్రి గారి కోరిక! నా యాజ్ఞ!"

"అయినచో నా కోరిక నొకదానిని మీరు నెరవేర్పగలమని మాట యివ్వవలయును."

"ఏమికోర్కె నాయనా?"

"ప్రస్తుతమునకు మీరు సహగమనమను యాలోచనమును వదలుకొనవలయును. నాకుమాత్రమేకాదు, అనాథమైయున్న యీ సామ్రాజ్యమునకే మీరు తల్లిమై నిలువవలయును!"

"ఈ ఒక్క కార్యమునకుమాత్రము నన్ను బలవంతపెట్టకు కుమారా! నా ఇహలోక ఋణము తీరినది. నాస్వామి స్వర్గములో నా కొరకై ప్రతీక్షించుచున్నాడు ........ నేను వెళ్ళకతప్పదు. నన్నడ్డు కొనకుము!"

"అయినచో నేనుకూడ మీ మాటలాలించను! ఈ విషయమై మీరునూ నన్ను ఒత్తిడిచేయకుడు!"

అదేవిధమైన కటుధ్వనిలో మల్లికార్జును డనినాడు.

పొన్నలాదేవి కిప్పుడేమి చేయుటకునూ తోచలేదు.

"కుమారా: నీవు యీ విథముగా హఠముచేయరాదు. నాస్వామి లేనిపిమ్మటనే నిచ్చట జీవించియూ ప్రయోజనములేదు. పతిసాన్నిధ్య వంచితులనై నే నిచట జీవచ్ఛవముగా నుండుటకంటెనూ మరణించుట మేలు! దీనివలన నీకునూ ఏ ప్రయోజనమూ లేదు.... నన్ను నిర్బంధ పెట్టకు తండ్రీ!"

"లేనమ్మా. నీవు జీవించిననే నేనూ జీవించుట. అట్లు కానిచో మీ దారినే యనుసరించెదను. పంపాపతి సాక్షిగా యీమాట సత్యము!"

గత్యంతరములేక పొన్నలాదేవి, తాను సహగమనము చేయుట లేదని కుమారునికి మాటయివ్వవలసి వచ్చినది అయిననూ మల్లికార్జునునకు తల్లి మాటలలో నమ్మకములేదు. అందువలననే యతడు తల్లిని తన అంతఃపురమువిడచి వెలుపలికి వెళ్ళుటకు సమ్మతించక, అచ్చటనే వుంచుకొనినాడు.

ఈ విషయము విని తిమ్మయామాత్యుడు సమాధానముగా ఒక నిట్టూర్పు విడచినాడు. మహారాణి పొన్నలాదేవి సహగమనమును గురించిన అతనిచింత తొలగిపోయినది. యువరాజు మల్లికార్జుననకు దిక్కెవరు? అతని నీ దుఃఖభారమునుండి సమాధానపరచగల వారెవరు? జీవితముపై యాశగొల్పువారెవరు? అని దిగ్భ్రాంతుడైయుండిన అమాత్యుని కిపుడెంతయో సంతసమైనది--

"తల్లీ! నీవు మాచేయి విడువకుము. రాజ్యాధిష్ఠానదేవతవలె నిలచి, అపాయమను సుడిగుండములో చిక్కుకొనియున్న యీ సామ్రాజ్య నౌకను తిన్నగా తీరమునకు జేర్చుము. తమరు దక్కనెవ్వరునూ దుఃఖాక్రాంతులై యున్న కుమారులకు, యిపుడు ధైర్యము చెప్పలేరు. వారు ధైర్యమును వహించనిచో సామ్రాజ్యమును కాపాడు వారెవరు? గనుక, సామ్రాజ్యక్షేమచింతనదృష్ట్యా తాము తప్పక జీవించియే యుండవలయు."

అని శోకమూర్తియై కూర్చొనియున్న పొన్నలాదేవిని తిమ్మయామాత్యుడు సమాధానపరచి, సార్వభౌముని దేహమునకు అంత్యక్రియలు జరుపుటకై దృష్టిమరల్చినాడు.

ఈవార్తవిని మహారాణి భీమలాదేవి, పొన్నలాదేవివద్దకు వచ్చి—

"అక్కా నీవు నాకు తోబుట్టువుకంటెనూ ఎక్కుడుగానుండి, తల్లివలె కాపాడుచూ, సామ్రాట్టులసేవ కవకాశమును కల్పించినావు.

ఇపుడుకూడ అదేవిధముగ స్వర్గములో వారి పాదసేవచేయుట కవకాశమును నా కనుగ్రహించు కృపజూపవలయును" అని దైన్యముగా ప్రార్థించినది.

ఈ మాటలువిని పొన్నలాదేవి చకితురాలైనది.

"చెల్లీ! ఏమి నీ మాటలు? సార్వభౌములతోబాటు నీవు సహగమనము చేయవలయునని యున్నావా?"

"అవును, అక్కయ్యా"

"వీలుకాదు, చెల్లీ! వీలుకాదు! మనము వారు బ్రతికియుండగా నెట్లుంటిమో అదేవిధముగా యిప్పుడునూ, వారియుద్దేశ సాధనకై అక్కచెల్లెండ్ర మై నిలచి, కార్యము సాధించవలసియున్నది. అట్లు చేయుటచే సామ్రాట్టుల ఆత్మకు శాంతి లభించగలదు. ఇదియే మనము వారికి చెల్లించు శ్రద్ధాంజలి. ఇది సహగమనముకంటెనూ ఎక్కువైన యజ్ఞము! బ్రతికియుండి, మరణించిన వారి జ్ఞాపకార్థమై చేయు యజ్ఞము ఆత్మయజ్ఞము! వారి కర్తవ్యమును నెరవేర్చు యీ జీవితము ఏ యజ్ఞము నకూ తీసిపోదు! నీవా సహగమన ప్రచారమును మాని, నాతో సహకరించుము. కుమారునికి తల్లివై నిలబడి, ధైర్యముచెప్పి రాజ్యపాలనములో సాయపడుము! ఇదే యిప్పుడు మనపాలిటి సహగమనము:" అనినది.

కాని, భీమలాదేవి తనపట్టు వదలలేదు. ఆమె తన పతితో సహగమనము చేయుటకు హఠము పట్టినది. చివరకు విధిలేక పొన్నలాదేవి ఆమె సహగమనమునకు సమ్మతించవలసి వచ్చినది, ఆమెకు అనుమతి నొసగునపుడు.

"చెల్లీ! నీవు నాకంటెనూ యదృష్టవంతురాలవు, స్వర్గములో నున్న నాస్వామిసేవచేయు భాగ్యము నీకు లభించినది." అని చెప్పి యామెకు వీడ్కోలిచ్చినది.

తనకు సహగమనమునకు అనుమతి లభించినదే తడవుగా భీమలాదేవి, పతిగృహమునకేగు సతివలె, పరలోకవాసుడగు సార్వ

భౌముని చేరుకొనుటకై సంబరముతో బయలుదేరినది. అనంతర మామె సుమంగళులకు దానధర్మములు, వాయినలుయిచ్చి హరిద్రా కుంకుమలు లేపనముజేసికొని, చిరునవ్వును చిందించుచునే పతి చితి నెక్కి, ఇహలోకమును వీడినది.

ఇటు పొన్నలాదేవికూడ జీవనయజ్ఞమును నిర్వహించుటకు సంసిద్ధురాలైనది. ఆమె యీ యగ్నిపరీక్షను ధైర్యముగనే ఎదుర్కొనినది. సామ్రాజ్యమును శత్రువులబారినుండి రక్షించి, దాని నొకదారికి తెచ్చి విడచుటకై భర్తపేరుతో ప్రతిజ్ఞ స్వీకరించి, నూతన విధానమగు యీ సహగమన వ్రతమును చేబూనినది.

# 3. శత్రుత్రయము

మహారాణి పొన్నలాదేవి మల్లికార్జునకు పట్టముగట్టి, రాజ్యపాలనములో అతడు దక్షత గడించునంతవరకూ తానే కుమారునిపేర రాజ్యపాలనము చేయుటకు నిశ్చయించినది. ఇది పెక్కండ్రు సామంతులకు సరిపడలేదు. సామ్రాట్ ప్రౌఢదేవరాయల మరణానంతరము స్వతంత్ర రాజులుగా ప్రకటించుకొనదలచిన కొంతమంది ద్రోహులకిదియొక పెద్ద సమస్యయైనది. అటువంటువారిలో ఘనగిరిరాజ్యపు ప్రతాపరాయల కుమారుడగు ముమ్మడి విరూపాక్షరాయలు ప్రథముడు-ప్రముఖుడు.

ఈ విరూపాక్షరాయలు ప్రౌఢదేవరాయల సోదరుడునూ, పెనుగొండ (ఘన్నగిరి) రాజ్యపు మండలేశ్వరుడునూ నైన శ్రీగిరి ప్రతాపరాయ - సిద్ధలాదేవి దంపతుల పుత్రుడు. అతనికి తనతండ్రి సింహాసనముపై కన్నువేసి, సాళ్వగోపరాజు - సింగరాజుల సాయములో దానిని హస్తగతముచేసుకొన ప్రయత్నించి, ఎట్లు విఫలుడైనదీ తెలియును ప్రౌఢదేవరాయలు లక్కనామాత్యుని సలహామేరకు ప్రతాప

రాయల విద్రోహమును క్షమించి, అతనికి ప్రాణదానముచేసిననూ, అది అతని పాలిటికి చావుకన్ననూ హేయమైన జీవితమైనది. ఈ చింతతో అతడు ఎక్కువరోజులు జీవించలేదు. తన తండ్రి అకాలమరణమునకు సామ్రాట్ ప్రౌఢదేవరాయలే కారకుడని విరూపాక్షరాయలు అంతరంగములో అతనిపై కత్తినూరసాగినాడు.

అతని యదృష్టమువనట్లుగా ప్రౌఢదేవరాయలుకూడ హఠాత్తుగా మరణించినాడు. అనుభవహీనుడైన మల్లికార్జునుడు సార్వభౌముడుగా నుండగా అతనిచేతినుండి విజయనగర సామ్రాజ్యము నపహరించి, సింహాసనమును తనవశము చేసుకొనుటకై అతడు తలపెట్టియున్నాడు. మల్లికార్జునుని దౌర్బల్యమును గ్రహించిన పొన్నలాదేవి అధికార సూత్రములను తానే చేబట్టి, సామ్రాజ్యాధికారిణియై నిలబడి, విరూపాక్షరాయల దురాలోచనములకు గొడ్డలి దెబ్బయైనది.

అయిననూ, ఏ విధముగానైనను అధికారమును స్వాధీనపరచుకొనవలయునని దలచిన విరూపాక్షరాయలు మల్లికార్జునుని పట్టాభిషేక సందర్భమున అతని పక్షమువారి బలాబలములను తెలుసుకొనుటకై రాజధానికి వచ్చినాడు.

విధినికాయు సర్పమువలె, సామ్రాజ్యలక్ష్మిని కాపాడుచున్న తిమ్మరయామాత్యునిజూచి విరూపాక్షరాయలకు ద్వేషము జనించినది. అమాత్యుడు జీవించియున్నంతవరకూ విజయనగర సింహాసనము తన వశము చేసుకొనుటకు సాధ్యముకాదని తెలుసుకొనుట కతని కెక్కువ కాలము పట్టలేదు. అమాత్యుని సలహాలేనిదే ఏ కార్యమునకూ గడంగని మల్లికార్జునరాయల ప్రవర్తననుజూచి తన పన్నుగడ ఫలించుట కష్టమని గ్రహించినాడు. అయిననూ మహారాణి హృదయాంతరాళ భావనలను తెలుసుకొనుటకై ఒకనాడు ఏదో సందర్భమున ప్రసక్తాను ప్రసక్తముగ నీ ప్రస్తావన తెచ్చినాడు.

"మహారాణిగారూ! నా మాటలను తమ రన్యథా భావించరాదు. సామ్రాట్ ప్రౌఢదేవరాయలు మా కందరికీ తండ్రివలె నుండెడి.

వారింత త్వరలో మన్ముల నూ, సామ్రాజ్యమునూ విడచి వెళ్ళగలరని నే ననుకోలేదు. శత్రువులు సామ్రాజ్యముపై పగ దీర్చుకొనుటకై నిలచియున్నారు. శైవసన్యాసుల చర్యలవలననూ, గోపరాజు పితూరీ వలననూ సామ్రాజ్యస్థితి తారుమారైనది. ఇటువంటి సమయములో యీ ధర్మసామ్రాజ్యమును - పవిత్రమైన రత్నసింహాసనమును - శత్రువుల బారినుండి రక్షించుకొనుట సామ్రాజ్య సేవకులమైన మా యందరి కర్తవ్యమూ నై యున్నది. తమ రంగీకరించునట్లయినచో కుమార మల్లికార్జన రాయలు రాజ్యపాలనానుభవము గడించు నంత వరకూ నా సేవను తాము స్వీకరించవచ్చును."

ఈ మాటలు పొన్నలాదేవి కాశ్చర్యములను కలిగించినవి.

"చాలా సంతోషము, విరూపాక్షరాయలూ! తమవంటి స్వామి భక్తి పరాయణు లుండగా సామ్రాజ్యమున కే భీతియునూ లేదు. తమ రక్షణ యను వజ్ర కవచములో సామ్రాజ్యలక్ష్మి సుభద్రముగా నున్నది" అని చిరునవ్వు నవ్వినది.

కాని, విరూపాక్షరాయలు మాత్రము నవ్వలేదు.

"మహారాణిగారూ! తమరన్యథా భావించనియెడల నే నొక సలహా చెప్పగలను" అన్నాడు.

"చెప్పుము!"

"కుమారులు రాజ్యభారమును మోయుటకు సమర్థులగునంత వరకూ నేను రాజప్రతినిధినై, సామ్రాజ్యమునకు నా వలన కాగల సేవ చెల్లించుట కవకాశము నివ్వవలయును. ఆమూలకముగానైననూ గతించిన ప్రభువులకు నా శ్రద్ధాంజలి సర్పింప వలయునని యున్నాను. తప్పక తమరిందులకు సమ్మతించగలరని నమ్ముచున్నాను!"

"కానిమ్ము, ఈ విషయమును అమాత్యులతో చర్చించిన తరువాత తెలియజేసెదను" అనినది పొన్నలాదేవి.

ఆమె మాటలు విరూపాక్షరాయలకవమానములుగా తోచినవి. అతడు లోకత్రొక్కిన త్రాచువలె బుసగొట్టుచూ, పొన్నలాదేవిని చుర

చురచూచినాడు. ఆమె యంతరంగమును భేదించునట్లు తీక్షణముగా నవలోకించినాడు.

ఆ దృష్టిని. అతని వాలకమును జూచి పొన్నలాదేవి భీతిల్లినది.

"విరూపాక్షరాయలూ! ఇది యాలోచించి నిర్ణయింపవలసిన విషయము. ఈ విషయముపట్ల కుమారుని యభిప్రాయ మేమియో ఎవరికి తెలియును?"

"ఇందులో ఆలోచింపవలసిన దేమియునూ లేదు మహారాణిగారూ! ఇది కేవలము విశ్వాసముపై నాధారపడిన విషయము. మీకు నాపై అంత నమ్మిక లేనిచో, అది సాధ్యము కాదని స్పష్టముగా చెప్పివేయుడు. నేను మిమ్ముల నేమియూ నిర్బంధించుటలేదు" అని అసహనముతో విరూపాక్షరాయ లనినాడు.

ఈ విషయము హఠాత్తుగా యింత బృహద్రూపమును దాల్చడము జూచి, మహారాణి పొన్నలాదేవి విషయమును మార్చుటకు చూచినది. కాని, ఈ విషయమై ఏదియో ఒక తీర్మానమునకు రావలయునని విరూపాక్షరాయలు నిశ్చయించుకొనినాడు.

"మహారాణిగారూ! మీరు మీ యభిప్రాయమును స్పష్టముగా చెలుపుడు. కుమారుల, లేదా అమాత్యుల అభిప్రాయములను నేను విచారించుకొందును."

"విరూపాక్షరాయలూ! ఈ విషయములో మీ రెందుల కింత యాతురత కనబరచు చున్నారో తెలియకున్నది. ఇది నా యొక్కయు - మీ యొక్కయు విషయము కాదు; సామ్రాజ్యముయొక్క పతనము - మనుగడలను గురించిన విషయము. దీనిపై మంత్రి పరిషత్తు యొక్కయు. కుమారుని యొక్కయు అభిప్రాయమును తెలియనిదే నేను ఏ తీర్మానమునకునూ రాలేను" అని పొన్నలాదేవి ఖచ్చితముగా జెప్పినది.

"అయినచో, మీకు నాపై అంత నమ్మిక లేదని తెలిసినది. నా చేతి కధికారము నప్పగించినచో ఎట్లో - ఏమోనని భావించుచుండవల

యును, కనుకనే నన్ను మీ యంతరంగమునకు చేర్చుకొనుటకు వెనుకాడుచున్నారు...."

"లేదు, విరూపాక్షరాయలూ, లేదు! మీ విషయములో మాకు సందేహమే లేదు - మీ రెంతటి ప్రభుభక్తి పరాయణులనునది మాకు తెలియును...."

"అయినచో మీరు నన్ను రాజప్రతినిధిగా స్వీకరించుటకు వెనుకాడుచున్నా రెందులకు ?"

"ఇది కేవలము నాకు మాత్రమే సంబంధించిన విషయము కాదు - సామ్రాజ్యపు మంచి - చెడులను గురించిన సంగతి. "

"మీ రిటువంటి నయగారపు మాటలలో నన్ను మోసగించలేరు మహారాణిగారూ! మీ హృదయంగతమైన భావనలను అర్థము చేసుకొనలేనంతటి యవివేకిని కాను. నాకు అధికారము నప్పగించినచో నే నెచ్చట సింహాసనము నాక్రమించు కొందునో యను భీతి మీకు గలదు. వాస్తవమునకు తిమ్మయామాత్యునిపై గల నమ్మకము మీకు నాయందు లేదు. నన్ను విశ్వసించని మిమ్ములను నేను నిష్ఠతో సేవింపవలయునా ?"

"విరూపాక్షరాయలూ! ఏమి మీ మాటలు ? మే మెన్నడూ మీ నిష్ఠలో లోపమును గణించినవారము కాము. వృథాగా ఎందులకు మనస్సును పాడుచేసు కొనెదరు ?"

"లేదు, మహారాణిగారూ! ఈ విషయ మిప్పుడు స్పష్టముగా తేలిపోవలయును. మీకు నాపై నమ్మక మున్నచో, నాకు రాజప్రతినిధి పదవి నిచ్చి సామ్రాజ్య నిష్ఠను పరీక్షించుడు. లేదా నన్ను రాజద్రోహి యని చాటించి బహిష్కరించుడు !"

"విరూపాక్షరాయలూ! నా మాటలను మీ రోపికతో వినవలయును. మీరు నాకు కుమారులు కావలయును. మా మల్లికార్జునివలెనే మీరుకూడ నా కుమారులని భావించి యున్నాను. అందువలననే నేను మీ ముందు హృదయము విప్పి మాటలాడు చున్నాను. ఇప్పుడు రాజ

ప్రతినిధి పదవియొక్క యావశ్యకత ఏమి గలదు? మల్లికార్జనుడు ప్రాప్తవయస్కుడైనాడు. ప్రస్తుతము రాజ్యపాలనానుభవము లేనివాడు కావచ్చును. మున్ముందు అతడు మీవంటి స్వామిభక్తిగల అధికారుల సాయముచే దక్షతగల పరిపాలనానుభవము గడించగలడు. ఒకవేళ సామ్రాజ్య భారమును మోయుట కతడశక్తుడైనచో అతనికి సాయపడుటకై నే నున్నాను. తిమ్మయామాత్యు డున్నాడు. మీ రున్నారు. మీవంటి స్వామి నిష్ఠాగరిష్ఠులు వెయ్యారుమంది గలరు. మీరీ విషయమును గురించి యాలోచించక నిశ్చింతులుగా నుండుడు."

"అయినచో, మీకు నాపై అంతటి నమ్మిక లేదని తేలినది?" విరూపాక్షరాయలు నిట్టూర్చినాడు.

"ఇది విశ్వాసమును గురించిన విషయము కాదు, విరూపాక్ష రాయలూ! సామ్రాజ్యపాలనమును గురించిన విషయము. ఇందులకు మీ సేవ ఆవశ్యకమైనప్పుడు, తప్పక స్వీకరించెదము!"

"మహారాణిగారూ! మీ మనసులోని భావము నాకు బాగుగా అర్థమైనది. మా తండ్రిగారివలెనే నేనూ సింహాసనమునకై ద్రోహము తలపెట్టగలనేమోయని సందేహించుచున్నట్టుగా తోచుచున్నది...."

"మీపై అటువంటి సంశయ మేదియునూ లేదు.... నా మాటను నమ్ముడు" అని నిరుద్వేగముతో పొన్నలాదేవి అనినది.

విరూపాక్షరాయ లీ మాట విని—

"కానిండు మహారాణిగారూ! మీ రింత ఖచ్చితముగా చెప్పునపుడు మిమ్ములను నే ననుమానించుట లేదు. పూజ్యపాదులైన సామ్రాట్ ప్రౌఢదేవరాయలు మా కందరకునూ తండ్రివలె నుండిరి. వారి ఋణము నీ విధముగా నైననూ తీర్చవచ్చునని యీ యవకాశమును కోరితి నంతియే! ఇందున నా స్వార్థ మేమియునూ లేదు. ఈ మాటలను తాము విశ్వసించినచో నేను నిశ్చింతతో మా పట్టణమునకు మరలుచున్నాను" అని మహారాణి పొన్నలాదేవి, మల్లికార్జునరాయల వద్ద వీడ్కోలు పడసి పెనుగొండకు ప్రయాణమైనాడు.

ఈ వార్తల నన్నింటినీ పొన్నలాదేవి తిమ్మయామాత్యునకు తెలుపగా నతడు భీతిల్లినాడు.

"తల్లీ! మన మాద్రోహియగు విరూపాక్షరాయల విద్రోహమును ఇప్పుడే గ్రహించుట మంచిదైనది. కీర్తిశేషులైన సామ్రాట్టులు కూడ అతని విషయములో జాగ్రత్తగా నుండవలయునని హెచ్చరిక చేయుచు నుండిరి. చివరకు విరూపాక్షరాయలు మన ఉప్పుదిని మనకే ద్రోహము తలపెట్టునట్టయినది. ఇప్పుడు మనము సర్పమును వల్మీకమునుండి వెలుపలికి రప్పించినాము. ఇక దానిపట్ల కొంత జాగ్రత్త వహించి యుండడము మంచిది. ఎందువల్లననగా సామ్రాజ్య దిగంతములో యుద్ధమేఘము లావరించి యున్నవి. ఇటు బహమనీ సుల్తానులు, అటు ఉత్కళ గజపతులూ మనమీద నిష్కారణముగా ద్వేషము సాధించుచున్నారు. మనము వేయి కనులతో సామ్రాజ్యలక్ష్మిని రక్షించవలసి యున్నది!" అని చెప్పి దీర్ఘముగా నిట్టూర్పు విడచినాడు.

కొంత కాలము క్రిందట తిమ్మయామాత్యునిచేత దెబ్బతిని వెనుకకు పారిపోయిన బహమనీ సుల్తాను అల్లావుద్దీనుడు విజయనగరముమీద వైరమును సాధించుచునే యున్నాడు. అనుభవము లేనివాడునూ, యువకుడునూ నగు మల్లికార్జునుడు విజయనగర సామ్రాట్టుగా నుండుట విని తన పగ దీర్చుకొనుట కిది సుసమయమని భావించి, మరల నతడు యుద్ధప్రయత్నములు చేసుకొన సాగినాడు. ఈ సందర్భముననే ఉత్కళము యొక్క కపిలేశ్వర గజపతికూడ తన సామ్రాజ్యమును విస్తరించుకొనుటకు తగిన యవకాశ మేర్పడినదని, విజయనగరముమీద దండెత్తి వచ్చుటకు సమర సన్నాహములు చేసుకొన సాగినాడు. ఇటువంటి పరిస్థితిలో తమ బంధువర్గములోని వాడగు విరూపాక్షరాయడే ద్రోహమును తలపెట్టినాడు.

ఇప్పుడీ ముగ్గురు శత్రువులనుండి సామ్రాజ్యమును రక్షించవలసి యున్నది. ఇది సులభ కార్యము కాదు. కాని, పొన్నలాదేవి అధైర్యపడలేదు. తిమ్మయామాత్యుడు ప్రాణములతో నుండునంతవరకూ సామ్రాజ్యమున కే అపాయమునూ సంభవించదని పొన్నలాదేవి

భావించినది. అతని వజ్రకవచములో తాను నిర్భయుడని భావించి, మల్లికార్జునుడు కూడ ఈ విషయమై నిశ్చింతుడైనాడు.

అదృష్టవశమున సామ్రాజ్యముపై నావరించి యుండిన యుద్ధ మేఘములు హఠాత్తుగా విడిపోయినవి.

బహమనీ సుల్తాను అల్లాయుద్దీను విజయనగరముపై యుద్ధము ఘోషించవలెనని యనుకొనుచూ యుండగనే అతని సింహాసనమే అతని చేయివదలి పోవునంతటి పరిస్థితి సంభవించినది. మరల బహమనీ సింహాసనమునకై యాదవ కలహ మారంభమైనది. అల్లాయుద్దీనుని కనుల యెదుటనే అతని కుమారుడు హుమాయూన్ మరియూ అతని సహోదరుడగు మహమద్ ఖానుల నడుమ పోరు జరుగ సాగినది. తన అస్తిత్వమునకు భంగము వాటిల్లుట జూచి, అల్లాయుద్దీనుడు విజయనగర దండయాత్రను కొంతకాలము ముందుకు వాయిదా వేసి, తన గృహ కలహములవైపు దృష్టిని మరల్చినాడు. దీనివలన ఉత్కళ కపిలేశ్వర గజపతికి కలిగిన నిరాశ చెప్పతరము కానిది,

కపిలేశ్వర గజపతి బహమని సుల్తానులో చేయికొని విజయనగర సింహాసనమును కబళించవయునని ఆశించినాడు. క్రొత్తగా ఆరంభమైన ఈ హిందూ సామ్రాజ్యోన్నతి అతనికి సహింపరానిదైనది. దానిని నాశనమొనర్చి తాను 'దక్షిణ సముద్రాధిపతి' యను బిరుదుకు పాత్రుడు కావలయునని కొన్నాడు. కాని, బహమని సుల్తానుడు యుద్ధకార్యమును వాయిదా వేసినతరువాత యిక యిప్పుడు గజపతి తానొక్కడే విజయనగరముపై దండెత్తి పోవలసిన పరిస్థితి ఏర్పడినది. ఈ విషయమై గాఢముగా నాలోచించి, నిర్ణయించుకొను నట్టయినది.

అయినను విజయనగర సింహాసనములో మల్లికార్జునివంటి యనుభవ హీనుడుండు. దుర్బలుడును నగు సార్వభౌము డున్నంతవరకు తన మహత్త్వాకాంక్ష నతడు మరువలేడు. విజయనగరముపై దండెత్తి వెళ్ళుటకు తగిన సమయముకొరకై అత డెదురుచూచుచూ కూర్చున్నాడు.

# 4. అభయప్రదానము

ఆ నాడు మహారాణి పొన్నలాదేవి తిమ్మయామాత్యులతో రాజకీయమునకు సంబంధించిన ఏదియో ఒక విషయమునుగురించి చర్చించుచున్నది. సామ్రాట్ మల్లికార్జునరాయలు అన్యమనస్కుముగా, ఏదియో నాలోచించుకొనుచూ భావసమాధిగతుడై యున్నాడు. అటువంటి సమయములో ఒక భటుడు ప్రవేశించి:

"తల్లీ! ప్రభువులను జూడగోరి ఆదిత్యవర్మయను నొక వ్యక్తి తమ యాజ్ఞకై ఎదురు చూచుచున్నాడు," అని విన్నవించినాడు.

పొన్నలాదేవి వెంటనే ఆ బ్రాహ్మణుని మర్యాదతో లోనికి దోడ్కొని రావలసినదని యాజ్ఞాపించినది.

దూత వెళ్ళి ఆదిత్యవర్మను తోడ్కొని వచ్చి, మహారాణిముందు నిలువబెట్టినాడు.

"రండు, స్వామీ! తమ పాదధూళిచే అంతఃపురము పావనమైనది." అని మహారాణి పొన్నలాదేవి అతనిని గౌరవముతో ఆహ్వానించి, కూర్చొనుటకు ఆసనమును చూపినది.

ఆదిత్యవర్మ భీతిల్లుచునే వచ్చి ఆసనములో కూర్చున్నాడు. అతని ముఖము నిస్తేజముగా నున్నది. దుస్తులు మలినముగా నున్నవి. అతడేదియో మహత్తర విషయమును తెలియజేయుటకై వచ్చినవాని వలె తోచుచున్నది. అతని కళావిహీన వదనమును చూచి పొన్నలాదేవి,

"స్వామి, తమరు వచ్చిన కార్యమును ఆనతిండు. తమను చూచిన చాలా బాధపడినవారివలె తోచుచున్నారు. తమరు మా వలన ఏ కార్యము కావలయునో నిస్సంకోచముగా సెలవిండు" అని ప్రశ్నించినది.

"తల్లీ! మిమ్ములను సందర్శించిన తరువాత నా సమస్త కష్టములు పరిహారమైనట్టు భావించుచున్నాను. తమరు రాష్ట్రమునకు తల్లి

వలె నున్నారు. ప్రజలను తమ కన్న బిడ్డలవలె పోషించుచున్నారు. తమవద్ద నా దారుణోదంతమును తెలుపుటకు దావరిక మెందులకు ? తమరు నా పాలిటి భాగ్యదేవతలవలె యవతరించినారు. తమరూ, ప్రభువులూ నా దారుణ చరిత్రను వినవలయును నాకు తమ సామంతుల వలన జరిగిన యన్యాయమును చక్కబరుప వేడికోలు" అని వినమ్రుడై విన్నవించుకొన్నాడు.

"స్వామీ, తమ మాటలు నాకు కుతూహలమును కలిగించుచున్నవి. తమ రెవరు ? తమ కే మండలేశ్వరులవలన అన్యాయము జరిగినది ? తమకు జరిగిన యన్యాయ మెయ్యది ? అన్నియునూ సవిస్తరముగా తెలిపినచో, మా వలన సాధ్యమైన పరిహారమును చెల్లింపగలము. మీరు అన్నియునూ వివరముగా తెలుపుడు" అనినది.

"తల్లీ ! నే నొక దురదృష్టవంతుడగు బ్రాహ్మణుడను. నాకు తమ దగ్గర రాజబంధువులగు ఒకరివలన చాల అన్యాయము జరిగినది, వారిచే నా సర్వస్వమూ కొల్లగొట్టబడినది. దానిని వారినుండి నాకు మరల యిప్పింపవలయును. నాకు జరిగిన అన్యాయమునకై వారిని శిక్షింపవలయును" అని గద్గదకంఠుడై యనినాడు.

"ఖండితముగా శిక్షించగలము. అపరాధు లెవరైననూ న్యాయదేవత సన్నిధిని అపరాధులుగనే పరిగణింప బడుదురు. వారు మా దగ్గర రాజబంధువులైన నేమి ? సామ్రాజ్యమందలి పెద్ద సామంతులైన నేమి ? అపరాధు లపరాధులే ! వా రెవరైననూ శిక్షను తప్పించుకొనలేరు ! మీరు నిర్భయముగా జరిగిన విషయమును వివరించుడు" అని అభయ మిచ్చినది.

తల్లీ ! తమ అభయవాక్కుపై నేను జీవించుచున్నాను. నాకు జరిగిన అన్యాయమును తమతో విన్నవించుకొని అనంతరం మీ హేయ జీవితమును పరిపూర్తి చేసుకొనవలయునని నిశ్చయించుకొని యున్నాను. తమ దర్శనమైన విమ్మట నాకు న్యాయము చేయగలరను ఆశ జనించుచున్నది ... తాము సామ్రాజ్యమునకు తల్లివంటి

వారు. రాజ ప్రతినిధులు. రాజ పూతలు. నా దారుణ చరిత్రను వినుడు" అని ఏవియో ఆలోచించుచూ కూర్చున్నాడు,

"ఎందులకు స్వామీ, సంకోచము? జరిగిన విషయమును ధైర్యముగా చెప్పుము. ఇచ్చట మీ కే భయమునూ లేదు. యథార్థము నెరిగింపుడు."

— అని సామ్రాట్ మల్లికార్జునరాయ లడిగినాడు.

"ప్రభూ! నా కన్యాయ మొనరించినవారు మరెవరో కాదు. మీ జ్ఞాతులే!...."

"ఎవరు, విరూపాక్షరాయలా?" అని మహారాణి అడిగినది.

"ఔను, మీ విరూపాక్షరాయలవలన యింతటి హేయకార్యము జరిగినదా యని మీ కాశ్చర్యము కలుగవచ్చును. అయిననూ యీ సంగతి సత్యము. వారు నా సర్వస్వమునూ అపహరించి, నన్నీ దరిద్రావస్థకు తెచ్చినారు."

"మీ కొనరించిన యపరాధ మేమి?"

"అదే నా కిప్పటికినీ తెలియుటలేదు. నా సంపద నంతయునూ ఆ ద్రోహి పట్టాభిషేక కానుక యను నెపముతో కొల్లగొట్టి నన్ను నిర్గతికునిగా జేసినాడు!"

"పట్టాభిషేక కానుక! - అందులకై మిమ్ములను కొల్లగొట్టుటయా?" ఆశ్చర్యముతో మల్లికార్జున రాయ లడిగినాడు.

"ఔను. ప్రభూ! తమ పట్టాభిషేక సందర్భమున రాజ్యమందలి ప్రతి యొక్క శ్రీమంతుడునూ తన యోగ్యతకు తగిన కానుకను సమర్పించవలయునని తమరు శాసనము చేసియున్నారట. ఈ నెపముతో విరూపాక్షరాయలు స్వార్జితమునూ-పిత్రార్జితమునూ నగు నా యాస్తి నంతయునూ అపహరించి, నన్ను రిక్తహస్తుని తెచ్చినారు. నే నొనరించిన ఏ యపరాధమునకు నాకీ శిక్ష?"

"పట్టాభిషేక నిమిత్తముగా అంతటి శాసన మేదియునూ మేము వెలువరించిన జ్ఞాపకము లేదు-ఇందులో ఏదో మోసము జరిగినట్లు

న్నది. ఉండనిమ్ము. మీ నుండి విరూపాక్షరాయ లెంత ధనము నపహ రించుకొని యున్నారు. ?"

"నా సంపద నంతయునూ దోచుకొన్నారు. వారు నా ప్రాణముల నపహరించక వదలినది హెచ్చు! అందులకై నేను సంతోషించు చున్నాను!"

"మీ కథ విచిత్రముగా నున్నది!" మల్లికార్జునరాయలు ఆశ్చర్య మును ప్రకటించినారు.

"ఇది కథ కాదు ప్రభూ ! జరిగిన యదార్థములను తమ కెరుక పరచుకొనుచున్నాను ! తమరు పరామర్శించవలయును !" అని చెప్పి జరిగిన సంగతిని సవివరముగా తెలియజేసినాడు —

ఆదిత్యవర్మ తండ్రి మార్తాండవర్మ ఉత్తమ నిష్ఠావంత శ్రోతియ వంశమున జనించినాడు. తాము సూర్యవంశ క్షత్రియ బ్రాహ్మణులని వారు చెప్పుకొనువారు. వారి వంశములో పెద్దలు కొందరు చాళుక్య సామ్రాట్టుల ఆశ్రయములో అమాత్యులుగనూ, దండనాయకులుగనూ పదవులు నిర్వహించి కీర్తి పొందినారు.

కాని, మార్తాండవర్మ కాలమునకు వారు రాజకీయ జీవితమునూ, వీర జీవనమునూ విడచి, వైదిక వృత్తిని చేబూనినారు. తమ కాశ్రయ మిచ్చిన ప్రభువుల అభిమానములకు పాత్రులై వారు దొరలనుండి అనేక మాన్యములను పొంది, సుఖవసతి జేసుకొన్నారు.

ఆదిత్యవర్మ కాలమునకు పూర్వీకుల వైభవ జీవన మంతయూ మంట గలిసిననూ, అతడు కొండవీడు రెడ్డిరాజుల ఆశ్రయములోనుండి అనేక సద్గ్రంథములను రచించి, పండిత పామరులచే ప్రశంస లందు కొని, రాజపూజితుడై, నెమ్మదిగా జీవితమును సాగించుకొనుచూ పోవుచుండెను.

అతని కావ్యములను పఠించిన ముత్యాలశెట్టి యను వర్తకుడు అతని పాండిత్య ప్రతిభను చూచి, తనవద్ద అతని కాశ్రయ మిచ్చినాడు. అతని మిత్రుడుగా, అతని సాంగత్యములో నుండిన ఆదిత్యవర్మ అతి త్వరలో రత్నపరీక్షలో కూడ మంచి యనుభవము గడించినాడు. తను

యీ రత్న వ్యాపార మారంభించినచో ముత్యాల శెట్టివలె ధనికుడు కావచ్చునని యాశించి, అతడు శెట్టి సాయములో ఒక కొట్టును తెరచినాడు.

అచిరకాలములో ఆదిత్యవర్మ కీర్తి సంపద లభివృద్ధిజెందినవి. అతని రత్నపరీక్షకీర్తి దిగంత వ్యాప్తమైనది. ఇది జూచి అసూయజెందిన ముత్యాలశెట్టి, నీచవిధానములో ఆదిత్యవర్మను నాశ మొనరించుట కాలోచించినాడు. అతని ప్రేరణచే ఒకరోజు దొంగలు ఆదిత్యవర్మ కొట్టులో ప్రవేశించి, సమస్త సంపదనూ కొల్లగొట్టినారు.

ఆదిత్యవర్మ మరల బీదవాడైనాడు. అతడు మిగిలిన యాస్తి నంతయునూ విక్రయించి, ఋణబాధను తీర్చుకొని, హిత శత్రువుల కాలవాలమైన కొండవీడును విడచి, తన దూరపు చుట్టములు గల పెనుగొండకు వచ్చి చేరినాడు.

పెనుగొండ కూడ విజయనగర సామ్రాజ్య మందొక ముఖ్య నగరముగ పేరు గాంచినది, అది శ్రీమంతుల నిలయము.

అప్పటికి వచ్చి చేరిన ఆదిత్యవర్మ అతి త్వరలో మరల రత్న పరీక్షా కౌశలములో శ్రీమంతుడైనాడు. అతని పలుకుబడి హెచ్చినది. కొన్ని సంవత్సరములలోనే అతడు నగరమందలి ప్రముఖులగు వణిగ్వరులలో నొకడుగా పరిగణింపబడినాడు. అతని రత్నవ్యాపారము కేవలము శ్రీమంతులగు వారిలోనే పరిమితము కాక - రాజులు, చక్రవర్తులు కూడ అతనిద్వారా ముత్యములను రత్నములను తెప్పించుకొనుచుండెడివారు. అతని పలుకు, ప్రవర్తన, రసికత్వము, తనవద్దకు వచ్చినవారిని వశపరచుకొను కళ యిత్యాదులలో ఆదిత్యవర్మ, ఆదిత్య శ్రేష్ఠియను గౌరవ బిరుదమును దాల్చునంతవరకూ అతడు జనప్రియ వ్యక్తియైనారు. అతడు యౌదార్యమునకూ, దాన ధర్మములకూ పేరు గాంచినారు. ప్రజ లతనిని 'పట్టణ శెట్టి' యని పిలచి గౌరవించెడివారు.

ఆదిత్యవర్మకు సంసార జీవితముకూడ సుఖమయముగా నున్నది. అతడు సూర్యోపాసన జేసి, సూర్యునివలె తేజస్వియైన ఒక పుత్రునీ, పుత్రికనూ బడసినాడు. అతడు మండలేశ్వరుడగు ప్రతాప

రాయల మిత్రుడూ, హితాకాంక్షియూనై యుండుటచే, అంతఃపురములో అతనికి మంచి పలుకుబడి గలదు. అతని పరిచయము లేనివారు పెనుగొండలో నుండరనిననూ అతిశయోక్తి కానేరదు. తండ్రి యనంతరము పెనుగొండ మండలమున కధిపతియైన ముమ్మడి విరూపాక్షుడు అతని జీవితములో ధూమకేతువువలె ఉదయించినాడు.

ఆదిత్యవర్మకు చాల అందమగు పుత్రిక గలదు. ఆమె కతడు 'చందల' యని నామకరణము జేసినాడు. అది 'చంద్రముఖి' యను పూర్ణ నామము యొక్క హ్రస్వరూపము. తల్లి దండ్రులు పిలుచు ముద్దు పేరు.

చంద్రముఖి పూర్ణిమా చంద్రునివలె దినదిన ప్రవర్ధమానురాలై యిప్పుడు షోడశవర్ష ప్రాయమైనది. ఆమె రూపము, అవయవముల సొంపు, కళాభిజ్ఞత, మధుర భాషణలు, నమ్రప్రవర్తన ఎంతటి వారినైననూ ఆకర్షించెడివి. తండ్రి యామెకు సంగీత-సాహిత్యములందునూ వీర రమణుల కుచితములగు యుద్ధ విద్యలందునూ శిక్షణ నిప్పించి, ఆమెను రాజపుత్రివలె పెంచినాడు. తండ్రివెంట అంతఃపురమునకు వచ్చి వెళ్ళుచుండిన యామె రూప - యౌవనములు రాజాంతఃపురము నందలి అందరి నోట వినబడసాగినవి.

ఇట్లుండగా ఒకరోజామె విరూపాక్షరాయల కంట బడినది. ఆమె రూప సంపద కతడు వశుడైనాడు. తన కిరువురు పత్నులూ - కొంత మంది భోగ కాంతులూ ఉన్నప్పటికీ అతడా అనాఘ్రాణిత పుష్పమును తన వశము చేసుకొనుటకై ఆతురత జెంద సాగినాడు. కాని, ప్రతాప రాయలు బ్రతికి యున్నంతవరకూ అతని యభీష్టము నెరవేరలేదు. అతడామెను వశపరచుకొనుటకై తగిన సమయముకొరకెదురు చూచుచూ కూర్చున్నాడు.

అతడు నిరీక్షించిన సుసమయము తనకు తానై వచ్చినది. ప్రతాప రాయలు మరణించి, విరూపాక్షరాయలు సింహాసన మధిష్ఠించినాడు. అతడు ప్రభువైన వెంటనే ఆదిత్యవర్మను పిలిపించి, అతని కుమార్తెను తనకు కానుకగా సమర్పింపవలయునని అడిగినాడు.

ఈ మాట వినగనే ఆదిత్యవర్మ శోకసముద్రమున మునిగినవాడయ్యెను. అయిననూ తొందరపడరాదని, అతడేదో నెపముజెప్పి తన దూరపు బంధువుల యింటిలో కుమార్తెను విడచి, ఆ కాముకుని కంట బడకుండునట్లు ఏర్పాటు జేసినాడు.

ఆమె నీ కాముకుని దృష్టినుండి తప్పించుటకై సరియైన వీర పురుషుని కొకని కొసగి వివాహ మొనరించి. ఆమె రక్షణాభార మతని కప్పగించి, తాను నిశ్చింతతో నుండవలయునని భావించినాడు. ఈ యాశతో సతతమై వరాన్వేషణ జేసినాడు. కాని, చంద్రముఖిని చేపట్ట గల యోగ్యుడగు వరుడు లభించలేదు. ఇది ఆదిత్యవర్మకు చింతాజనక మైనది

ఇట్లుండగా ప్రౌఢదేవరాయలు మరణించి, విజయనగర సామ్రాజ్యమునకు మల్లికార్జునరాయలు సార్వభౌముడైనాడు. అతని పట్టాభిషేకమునకు వెళ్ళి వచ్చిన విరూపాక్షరాయలు పెనుగొండకు వెనుదిరిగి రాగానే, సార్వభౌమునికి వ్యతిరేకముగా సైన్యమును సమీకరించుటకై తన కావశ్యకమైన ధనసంచయనము జేయగోరి, సార్వభౌముని పేరుతో ప్రజలనుండి పట్టాభిషేక కానుకను బలవంతముగా వసూలు చేయ సమకట్టినాడు.

పూర్వమునుండియూ అనూచానముగ నూతన సార్వభౌములు సింహాసన మధిష్ఠించినపుడు సామ్రాజ్యమందలి మాండలీకులూ, సామంత ప్రభువులూ తమ తమ యంతస్థుల కనుగుణముగా పట్టాభిషేక కానుకలను సమర్పించెడివారు, ఈ ధనమును వారు తమ రాజ్య ప్రజలనుండి వసూలు చేసెడివారు. విరూపాక్షరాయలు పట్టాభిషేక కానుకలను కారణమును ముందిడుకొని, అందరినీ కొల్లగొట్ట నారంభించినాడు.

దైత్య సదృశులగు నతని భటులొనరించెడి హింసలను సహించ లేక అనేకమంది వణిగ్వరులు, శ్రీమంతులు నగరమును విడచి దేశాంతర గతులైనారు అతనిని ప్రతిఘటించినవారు మరణించినారు.

విరూపాక్షరాయలు మండలేశ్వరుడైన పిమ్మట అతని వక్రదృష్టి

ఆదిత్యవర్మమీద పడుట కెక్కువ రోజులు పట్టలేదు. అతనికి మును పటినుండియూ ఆదిత్యవర్మమీద ద్వేషము గలదు.

అతడు ఆదిత్యవర్మను సముఖమునకు రప్పించుకొని సూచిన సామ్రాట్టులకు పట్టాభిషేక కానుకలు సమర్పించుమని యాజ్ఞాపించినాడు. తన శక్తికొలదిని సమర్పించగలనని ఆదిత్యవర్మ సంతోషముగా సమ్మతిని తెలియజేసినాడు!

కాని, విరూపాక్షరాయలకు కావలసిన దతని సంపద కాదు - అంతకంటెనూ ఎక్కుడగు - తాను చిరకాలముగా వాంఛించుచూ నుండిన - అతని కుమార్తె చంద్రముఖి. ఆమెను తనకు కానుకగా సమర్పించినచో సార్వభౌమునికి చెల్లించవలసిన పట్టపు కానుకను మన్నించునట్లుగా చెప్పినాడు.

ఇప్పుడేమి చేయుటకునూ ఆదిత్యవర్మకు తోచకపోయినది. అతని దురదృష్టమేమో నన్నట్లుగా తల్లిదండ్రులను చూచి చాల కాలమై నందువలన చంద్రముఖి కొన్ని రోజులక్రిందట పుట్టినింటికి వచ్చినది. ఆమె ఆగమన మెంత రహస్యముగా నుంచిననూ, అది ఎట్లో విరూపాక్షరాయలకు తెలిసినది. ఇది తెలిసియే అతడు ఆమెను కానుకగా కోరుట !

ఈ మాటలు వినగానే ఆదిత్యవర్మకు ఒడలు మండినవి. అతడు ఎంతయైననూ సూర్యవంశ క్షత్రియ బ్రాహ్మణుడుకదా ? స్వాభిమాని యైన అతనికి విరూపాక్షరాయల నీచత్వము జూచి ఉగ్రమైన కోపము కలిగినది. కాని, కోపించుకొనినచో కార్యము చెడగలదని, చిరునవ్వును చిందించుచునే అచ్చటనుండి తప్పించుకొన జూచినాడు.

"ప్రభూ ! తమ రెచ్చట ? మే మెచ్చట ? తమతో దేహ సంబంధము జేసికొనునంతటి యర్హత నాకు గలదా ? దీనిని మేము అనుగ్రహమని భావించుచున్నాము, కానిండు, నా భార్యతో చర్చించి తమకు విషయము నెరుకపరచెదను" అని చెప్పి, ఉపాయముగా తప్పించుకొని యింటికి వచ్చినాడు.

ఇప్పుడేమి చేయుటకునూ అతనికి తోచలేదు. భార్యా బిడ్డలతో చాల వరకూ ఆలోచించినాడు. తాను కుమారైతో అచ్చట నుండినచో, తమ ప్రాణమునకూ, సంపదకూ హాని సంభవించుట తథ్యమని భావించి ఉపాయముగా అచ్చటినుండి తప్పించుకొని పోవలయునని నిశ్చయించినాడు. కాని, ఎచ్చటికి వెళ్ళుట ? తమ కాశ్రయ మొసగు వా రెవరు ? అను నదొక పెద్ద సమస్య యైనది, అప్పుడతని భార్య :

"మనము విజయనగరమునకు వెళ్ళి, మహారాణి పొన్నలాదేవి యాశ్రయము నర్థింతము. వారు సామ్రాజ్యమునకు తల్లివంటివారు. మన కరుణ గాథను వినినచో, యీ దుర్మార్గుని బారినుండి మనలను తప్పక కాపాడగలరు !" అని సలహా చెప్పినది.

భార్య చెప్పిన సలహా మేరకు ఆథిత్యవర్మ కుమార్తెను వెంట బెట్టుకొని విజయనగరమునకు వెళ్ళుటయునూ, తమ సమస్త సంపదతో బాటు తల్లిని వెంటబెట్టుకొని కుమారుడు కొంత యాలస్యముగా తమ ననుసరించి రావలసినదనియూ తీర్మానమైనది —

ఆదిత్యవర్మ కుమార్తెతో బయలుదేరి సుఖముగా విజయనగరమును చేరుకొన్నాడు. అచ్చట ఒక గృహమును జూచి దిగి, తన పత్నీ పుత్రుల రాకను నిరీక్షించుచూ కూర్చున్నాడు. కాని, చెప్పిన సమయమునకు వారు రాలేదు. గడువు దాటిననూ వారు రాకపోగా ఆదిత్యవర్మ విషయము నెరింగి వచ్చుటకై భటులను పెనుగొండకు పంపినాడు. భటులు పెనుగొండ వెళ్ళి విచారించగా, అచ్చట వారికి కర్ణకఠోరమైన వార్త తెలిసినది,

ఆదిత్యవర్మ తా మొడ్డిన యురిలలో దగుల్కొనక, తనను మోసగించి, ఉపాయముగా తప్పించుకొనిన విషయమెట్లో విరూపాక్ష రాయల చెవిని పడినది. ఆతడు తన సైన్యముతో వెళ్ళి చంద్రముఖిని పట్టి బంధించి, అంతఃపురమునకు చేర్చుటకై హఠాత్తుగా వారి మందిరమును ముట్టడించినాడు. కాని, మందిరములో చంద్రముఖిగాని, ఆదిత్యవర్మగాని కనబడలేదు. ఎంత విచారించిననూ వారిని గురించి ఏ విషయమూ తెలియకపోయినది. దీనితో విసుగుజెంది అతడు వారిపై పగ

దీర్చుకొనుట, ఆదిత్యవర్మ భార్యను ఘోరముగ హత్య జేసినాడు. అతని కుమారుడు ప్రతిఘటించగా అతనికికూడ అదేగతి సంప్రాప్తమైనది. వారి మందిరమును వశపరచుకొని, సమస్త సంపదనూ కొల్లగొట్టి తన భాండాగారమునకు చేర్చుకొనినాడు.

కాని, అంతటితో అతని దురాగత మాగలేదు. అతడు తనను మోసగించి తప్పించుకొనిన ఆదిత్యవర్మనూ, అతని కుమార్తెనూ ఎట్లయిననూ పట్టి శిక్షింపవలయునని ద్వేషమానసుడై యున్నాడు. అయిననూ అతనికి వారినిగురించి ఏమియునూ తెలియక పోయినది! అతడు వారు దాగియున్న స్థలమును కనుగొనుటకై తన గూఢచారులను నియమించి, వారు తీసుకొని వచ్చు వార్తకై ఎదురు చూడ సాగినాడు.

ఈ దారుణవార్త విజయనగరమున వేషాంతరములోనున్న ఆదిత్యవర్మకు తెలిసినది. ఈ వార్త విని చంద్రముఖి మూర్ఛపోయినది. ఆదిత్యవర్మకు కూడ పిడుగు పడినట్లయినది. అతడు నేరుగా సామ్రాట్ మల్లికార్జున రాయలవద్దకు వచ్చి, తనకు విరూపాక్షరాయలవలన జరిగిన యన్యాయము నెరిగించినాడు—

ఈ కథ నంతయునూ విని మల్లికార్జునరాయ లుగ్రుడైనాడు. 'భళిరా!' యని బొబ్బ గరచినాడు. పొన్నలాదేవి అసహనముతో కృంగిపోయినది. అమాత్య తిమ్మన దండనాయకుడు ప్రక్షుబ్ధమానసుడైనాడు.

నిరపరాధియగు ఆదిత్యవర్మకు జరిగిన అన్యాయమునకు విరూపాక్షరాయలపై అందరికినీ కోపము కలిగినది. అతనికి జరిగిన యన్యాయమును చక్కదిద్దుటకై, వెంటనే క్రమచర్య తీసుకొనుటకు వారు నిశ్చయించినారు.

ఇంతకంటెనూ ఎక్కుడగు మరొక విషయము— విరూపాక్షరాయలు తన పేరుతో పట్టాభిషేక కానుక లనువెపమును ముందిడుకొని నిరపరాధులగు ప్రజలను కొల్లగొట్టి, ఆ ధనమును తనకు వైరముగా

సైన్యమును సమీకరించుటకై ఉపయోగించుచున్న విషయము విని మల్లికార్జునరాయలకు చాల కోపము వచ్చినది. అతడా ద్రోహియగు విరూపాక్షరాయల యీ దుర్నడతలను విని ఏమి చేయుటకునూ తోచక క్షణ కాలము చింతించినాడు. అనంతర తిమ్మయామాత్యుల నుద్దేశించి,

"అమాత్యులూ : మా పేరుతో ఎవరునూ పట్టాభిషేక కానుకలను తీసుకొనరాదని తక్షణమే మండలేశ్వరులకూ, సామంతులకూ అందరికీ ఆజ్ఞాపత్రములను బంపుడు. అట్లే ఆ ద్రోహియగు విరూపాక్షరాయలను సముఖమునకు రావలసినదిగా ఆజ్ఞచేసి, భటులను బంపుడు!" అన్నాడు.

ఈ మాట లాలించి అమాత్యుడు పొన్నలాదేవి ముఖములోనికి చూచినాడు,

"అమాత్యులూ ! మీ రేదియో చెప్పదలచి సంశయించుచున్నట్లున్నారు. సంశయపడక చెప్పుడు !" అనినది పొన్నలాదేవి.

"తల్లీ ! పట్టాభిషేక కానుకను నిలుపుటకు మనము శాసనము చేయవచ్చును. అట్లు చేయుటచే ప్రజాక్షేమము కలుగుటయునూ నిజమే! కాని, పూర్వమునుండి వచ్చిన యీ పద్ధతిని మన మీనాడు ఆపివేసినచో రాజబొక్కసమునకు వచ్చు రాబడి తక్కువ యగుటలేదా ?"

"రాజబొక్కసమునకు రాబడి తగ్గిననూ సరియే, నిరపరాధులగు ప్రజలను పీడించి ఆర్జించెడి ఆ పాపపుసొమ్ము మనకు వలదు !" అని నిష్ఠురముగా మల్లికార్జునరాయ లనినాడు.

ఇది విని మహారాణి ముఖములో మందహాసము తొంగిచూచినది. ఆమె తన కుమారునియొక్క ప్రజావాత్సల్యమునకు మనసులోనే యానందించినది. అమాత్యుడు పొన్నలాదేవి ముఖ మవలోకించినాడు.

"ఔను, అమాత్యులూ ! ప్రజలను పీడించి తెచ్చెడి ఏ కానుకలూ మనకు అవసరములేదు. అందువలన మన కేప్రయోజనమూ లేదు...." అన్నది పొన్నలాదేవి.

రాజమాత వాక్కులకు అమాత్యుడు నిరుత్తరుడైనాడు.

"మనము పట్టాభిషేక కానుకలను నిలుపవచ్చు ప్రభూ ! కాని, సామ్రాజ్యమునందత్యంత బలిష్ఠులైన విరూపాక్షరాయల నీ కారణములో మనము వైరులనుగా జేసికొనుటంత మంచిదికాదు. మనము వారి ద్రోహ చింతమును ఉపాయముగా నిగ్రహించవలయును !" అన్నాడు.

"అయినచో, మీ రిప్పుడననదేమి ? ఈ విషయమై మీ యభిప్రాయ మేమి ?" అని ప్రశ్నించినాడు మల్లికార్జునరాయలు.

"ప్రభూ ! ఆదిత్యవర్మకు జరిగిన యన్యాయమును, వారి పత్నీ, పుత్రుల వియోగమును మనమిప్పుడుతీర్చలేము. కాని వారికి కలిగిన ధన నష్టమును మనము మనభాండాగారమునుండి చెల్లించవచ్చును. మున్ముందు తగిన సమయ మేర్పడినపుడు యీ విషయమై విరూపాక్షరాయలను కూడ శిక్షించవచ్చును."

"ఇది సరియైన సలహాయే గాని, అట్లు చేయుటచే ఆదిత్యవర్మ గారికి జరిగిన అన్యాయమును మనము చక్కబరచినట్టు కానేరదు. వారి కష్టములను దీర్చినట్టు కాదు" అనినది పొన్నలాదేవి.

"ఇందులకు మీ సలహా ఏమి తల్లీ ?"

"అది మీకు సావకాశముగా చెప్పగలను అమాత్యులూ ! ముందు మీరీ ఆదిత్యవర్మగారి వెంటవెళ్ళి, వారి కుమార్తెను మర్యాదతో మా యంతఃపురమునకు తీసుకొని రండు. పాపము ! ఆ చిన్నది తల్లిని పోగొట్టుకొని అనాథయైనది. ఆమెను మనము సమాధాన పరచవలయును," అని అమాత్యుని అర్థగర్భితునిగా చూచినది.

ఆ చూపులోని భావమును గ్రహించి తిమ్మయామాత్యుడు ఆదిత్యవర్మగారి వెంట అతని గృహమునకు వెళ్ళి, మర్యాదతో చంద్రముఖిని అంతఃపురమునకు దోడ్కొని వచ్చినాడు.

చంద్రముఖిని జూచి పొన్నలాదేవి చాల సంతోషపడినది. ఆమె నిరీక్ష వ్యర్థము కాలేదు. అమాత్యుని చెవిలో ఆమె ఏదియో చెప్పినది.

ఆ మాట విని అమాత్యుని ముఖములో ఒక చిరుదరహాసము ప్రతి ఫలించినది. అతడు మల్లికార్జునరాయలను జూచి అర్థగర్భితముగా నవ్వినాడు.

అనంతరము పొన్నలాదేవి ఆ తండ్రీ-కూతుళ్ళను తన అంతః పురమునకు దోడ్కొని వెళ్ళి, చంద్రముఖిని తన కన్న కుమార్తెవలె నతి గారాబముగా చూడసాగినది.

మహారాణి విశ్వాసమును జూచి ఆదిత్యవర్మకు ఏమియునూ బోధపడక దిగ్భ్రమ కలిగినది.

"తల్లీ, తమ విశ్వాసమునకు మేము పాత్రులమా? ఇందులకు మీ సమ్మతి గలదా?" అని దైన్యముగా ప్రశ్నించినాడు.

"ఆదిత్యవర్మగారూ! ఈ చిన్నదింకనూ ప్రపంచమున ఇప్పు డిప్పుడే కనులు తెరచుచున్న పాలుత్రాగెడి పసి కందు. ఈ వయస్సు నకే ఈమె తల్లిలేని పిల్లయైనది. ఈమెను మేము మా స్వాధీనములోనికి తీసుకొని రక్షించవలయునని నిశ్చయించి యున్నాము. ఇందులకు...." అని పొన్నలాదేవి మాట ముగించకమును పే,

"ఎంత మాట తల్లీ? నేను చంద్రముఖిని తమ ఒడిలో వేయ వలయుననియే తోడ్కొని వచ్చినాను. తమ రామెను కుమార్తెయని స్వీకరించినారు. ఇక నాకంటెనూ భాగ్యశాలి గలడా?" అని ఆదిత్యవర్మ సంతోషముగా యనెను.

"అమాత్యులూ! ఆదిత్యవర్మగారికి జరిగిన అన్యాయమునకు తగిన పరిహారమును చెల్లించుటకై నా వైయక్తికపు టాలోచన యొకటి గలదని చెప్పియుంటిని, విరూపాక్షరాయలవలన వారికి జరిగిన యన్యా యమును చక్కబరచుటకై మనము చంద్రముఖిని కోడలుగా స్వీక రించి, వారి కేర్పడిన నష్టమును కూడ పూర్తిచేయవలయునని నిశ్చ యించినాను. ఇందులకు మీరూ, కుమారులూ సమ్మతించగలరని నమ్ము చున్నాను" అన్నది.

"తల్లీ! తమ సలహా సముచితమైనదే. ఆదిత్యవర్మగారు అన్ని విధముల తమతో రక్తసంబంధ మేర్పరచుకొనుటకు తగియున్నారు. వారు సూర్యవంశపు క్షత్రియ కులోత్పన్నులు. తమ గొప్ప బుద్ధిచే ఉన్నతోద్యోగములను జేసి వాసిగాంచినవారు. అటువంటివారి యీ పుత్రిక సామ్రాట్టులను చేబట్టుటకు సర్వవిధముల తగియున్నది. అంతియకాక వారుకూడ యీమెను రాజపుత్రికవలె పెంచినారు. మన సామ్రాట్టులకూ, చంద్రముఖీదేవిగారికీ మంచి వరసామ్యముకూడ నున్నది. భగవంతు డీ శుభకార్యమును నెరవేర్చుగాక" అన్నాడు,

ఈ మాటలు విని ఆదిత్యవర్మ క్షణకాలము తన చెవులను తాను నమ్మలేక పోయినాడు.

అతని వైఖరిని జూచి రాజమాత ప్రశ్నించినది.

"ఎందులకు, స్వామీ! ఈ సంబంధము తమ కిష్టములేదా ?"

"తల్లీ! నా మాటలను తమ రన్యథా భావించకుడు. నేను సామ్రాట్టులకు పుత్రిక నిచ్చునంతటి భాగ్యశాలినా ?"

"ఎందులకు కాగూడదు ?"

"మన అందరియొక్క యాశ ఆ విధముగా నుండవచ్చును. కాని, సార్వభౌముని మనోగత మెట్లున్నదో ?"

ఈ మాటలు వినగనే పొన్నలాదేవి అచ్చటనే యున్న మల్లికార్జున రాయలను జూచి యడిగినది:

"కుమారా! ఆదిత్యవర్మగారి పలుకులను విన్నావు. ఈ విషయములో నీ యభిప్రాయమును వెల్లడించి, మమ్మందరినీ సంతోషపరచుము!"

"అమ్మా, నే నిట్లనుచున్నానని మీ రన్యథా తలపకుడు...."

"ఏమి, నాయనా ?"

"నేను చంద్రముఖిని ఒప్పుకొనుమాట అటుండనిండు, ముందు నన్ను చేబట్టుటకు చంద్రముఖి సమ్మతించు చున్నదేమో కనుగొనకయే

మీ రీ విషయములో తీర్మానమును చేబూనుటంత మంచిదిగా నాకు తోచ లేదు !"

"అంతియేకదా ? నీ వీ విషయమైపై చింతించకుము. కొంత కాలము చంద్రముఖి మన యంతఃపురములో నుండి, ఆమె తన తల్లి వియోగమును మరువనిమ్ము. అటుపై మీ రుభయులూ సమ్మతించిననే ఈ వివాహము !" అని యామె కాబోవు ఆ నూతన వధూవరులను జూచి తృప్తిగా నవ్వినది.

ఆ నవ్వు అచ్చట నున్నవారిపై ప్రతిఫలించకపోలేదు.

## 5. కులశత్రువు

ఘనగిరి రాజ్యపు మహామండలేశ్వరుడగు విరూపాక్షరాయలకు మహారాణి పొన్నలాదేవినుండి సామ్రాట్టుల వివాహ మహోత్స వాహ్వాన పత్రిక వచ్చినది. రాజబంధువైన అతనిని రాజధానికి రావలసినదిగా కోరి ఒక ప్రత్యేక లేఖ కూడ వచ్చినది. సామ్రాట్ మల్లికార్జున రాయలు వివాహ వయస్కుడని విరూపాక్షరాయలకు తెలిసిననూ, అతని వివాహము హఠాత్తుగా నిశ్చయమైన సంగతి అతని కాశ్చర్యమును కలుగజేసినది. ఎవరో అజ్ఞాత కులవధువుతో ఈ వివాహము నిశ్చయమైనట్టుగా అతనికి తోచినది. రాజధానికి వెళ్ళినచో పొన్నలా దేవి - తిమ్మయామాత్యులు తనను మోసగించి బంధించిన నెట్లు ? తనను వంచించుటకై వారీ వివాహమను నాటకమును ఆడియుండరాదా ?

విరూపాక్షరాయల కీ విషయమై ఎంత యాలోచించిననూ సందేహ నివృత్తి కాలేదు. బహుశః తను పట్టాభిషేక కానుకల పేరుతో ప్రజలను పీడించి, ఆ వచ్చిన ధనముతో సైన్యమును సమీకరించుచున్న విషయము సామ్రాట్టుల చెవినికూడ పడియుండవచ్చును. తనను శిక్షించుటకై యిపుడీ వివాహమను నెపముతో రాజధాని కాహ్వానించుచుండవచ్చునా ? సామ్రాట్టుల వివాహము చంద్రముఖీదేవితో నిశ్చయ

మైనదట. ఆమెయే ఆదిత్యవర్మ కుమార్తెయగు 'చందల' యై యుండ వచ్చునేమో ? అయినచో వారు తనవలన జరిగిన యన్యాయమును సార్వభౌములకు తెలిపియుండవలయును. ఈ సమయములో తాను రాజ ధానికి వెళ్ళుట క్షేమము కాదు. అనారోగ్యమను నెపమొడ్డి తప్పించు కొనవలయునని విరూపాక్షరాయ లాలోచించినాడు.

ఈ నిర్ణయమునువిని విరూపాక్షరాయలమంత్రి సింగననాయకుడు

"ప్రభూ ! తామిపుడు రాజధానికి వెళ్ళనిచో సామ్రాట్టులు మన విషయములో ఖండితముగ అనుమాన పడగలరు. మీరు వారికి తెలియని ఏదియో రాజద్రోహ మొనరించి, రాజధానికి వచ్చుటకు భీతిల్లి తలదాచు కొనుచున్నారని యనుకొనుట కవకాశము గలదు. అందువలన తాము విజయనగరమునకు వెళ్ళివచ్చుటయే క్షేమము !"

— అని సలహా చెప్పినాడు.

"నీ మాట నిజమే సింగనా ! కాని, మనలను బంధించుటకై పొన్నలాదేవి - తిమ్మయామాత్యుడు పన్నిన పన్నుగడ యిది ఎందు లకు కాగూడదు ?"

"ప్రభువుల అనుమానమునకు కారణము లేదు. ఇపుడు మనము వెళ్ళుచున్నది సామ్రాట్టుల వివాహమునకు. మనమీద ఏ రాజద్రోహ మునూ లేదు. మీరీ విషయమై చింతింపకుడు !"

"సామ్రాట్టులు వివాహ మాడబోవు చంద్రముఖి మనలను మోస గించి, తప్పించుకొనిన ఆ నీచుడగు ఆదిత్యవర్మ కుమార్తెయగు చంద్ర ముఖియే ఎందులకై యుండరాదు ? వారు సామ్రాట్టుల వద్దకు వెళ్ళి ఆశ్రయమును పొందియుండరాదా ? నా కెందులకో యివన్నియునూ సందేహాస్పదములుగనే యున్నవి !"

"ప్రభూ ! మనము దండార్హమైన ఏ గొప్ప యపరాధమునూ చేసియుండలేదు. మనమేది యపరాధములను ఋజువు చేయనిదే ఎవ డునూ మనలను శిక్షించుటకు సాధ్యపడదు. అంతియకాక ఆదిత్యవర్మ ప్రకరణములో మనకు జోక్యము కలదని నిరూపించుటకు పంపాపతియే రావలయును ! మీరా విషయమై భీతిల్ల పనిలేదు."

"మన విద్రోహకర చర్యలు-సైన్య సంగ్రహణేత్యాదులు-సార్వ భౌముని చెవిని సైతము ఎందులకు పడియుండరాదు ?"

"పడియుండిన నేమి, వీటి యాధారముతో మనమీద నేరము మోపి, శిక్షించ వలనుపడదు."

"సైన్య సంగ్రహణ మెందులకని యడిగినచో ఏమి చెప్పుట?"

"సరిహద్దు రక్షణార్థమని చెప్పిన తీరును. ఇపుడు ఉత్కళ కపిలేశ్వర గజపతియూడ విజయనగరముమీద దండెత్తి వచ్చుటకై యాలోచించు చున్నాడు. కాబట్టి గడిప్రదేశ రక్షణకై సైన్య సంగ్రహణ జరుగుచున్నదని చెప్పవచ్చును. ఇంత స్వల్ప విషయమునకు మనము భీతిల్లుటయా ?" అని సింగననాయకుడు అర్థగర్భితముగా నవ్వినాడు.

ఆ నవ్వులో విరూపాక్షరాయలకు కావలసిన ధైర్యము, ఉత్సాహము లభించినవి.

ఆ నిర్ణయము మేరకు విరూపాక్షరాయలు వధూవరులకు కానుకగా సమర్పించుటకు అమూల్యములైన బహుమానములను తీసుకొని తన కుటుంబ పరివార సమేతముగా, మూడురోజులకు మునుపే విజయనగరమునకు వచ్చి దిగినాడు. అతని అంతస్థుకు తగినట్లుగా అతనిని రాజోచితమైన విడిదిలో నుంచడమైనది. అచ్చట జరుగు చర్యలను కని పెట్టుటకై తిమ్మయామాత్యుడు సేవకుల వేషములో కొందరు గూఢ చారులను నియమించినాడు. ఈ విషయము విరూపాక్షరాయలు పసిగట్టినాడు. అతడు శరీరమంతయూ కనులుగలిగి ప్రవర్తించ సాగినాడు.

విరూపాక్షరాయలు విజయనగరమునకు వచ్చిన పిమ్మట చంద్రముఖీదేవియే తాను తన కామమునకు బలిగావించ దలచిన ఆదిత్యవర్మ కుమార్తెయగు 'చండల' యని తెలిసినది. అప్పుడతనికి కలిగిన సంభ్రమాశ్చర్యములు వర్ణించ నలవికానివి. తొందర పడినచో కార్యము చెడగలదని, విరూపాక్షరాయలు వారు తనకు తెలియని ఆగంతుకులనునట్లు మెలగ సాగినాడు.

శాస్త్రోక్తముగా వివాహ విధులన్నియునూ ముగిసిన పిమ్మట

విరూపాక్షరాయలు పొన్నలాదేవితో ఊరికి మరలు మాటను ప్రస్తావించినాడు. ఇది విని మహారాణికి ఆశ్చర్యము కలిగినది.

"విరూపాక్షరాయలూ! ఇంత త్వరలో వెళ్ళవలయునా? రాజబంధువులైన మీరు మరి కొంతకాలము మా యింటనుండి నెమ్మదిగా వెళ్ళవలయునని మా అందరి యభిమతము ఎందులకింత తొందర పడెదరు?" ఏమియునూ తెలియనిదానివలె పొన్నలాదేవి ప్రశ్నించినది.

"లేదు, మహారాణిగారూ! పెనుగొండకు మేము వెంటనే వెనుదిరగవలసి యున్నది. మా మాతృశ్రీ గారికి అస్వస్థతగా నున్నదని లేఖ వచ్చినది. కాబట్టి. వెంటనే వెళ్ళక తప్పదు. సామ్రాట్టుల వివాహమునకు రాకపోవుట మంచిది కాదని వీలుకలుగజేసుకొని వచ్చితిని." అని కృతకమైన చిరునగవును వదనములో ప్రతిబింబింపజేసినాడు.

"అయినచో మేము మిమ్ములను నిర్బంధ పరచుటలేము. మీరు వెళ్ళిరండు. కాని, మీతో రాజకీయములకు సంబంధించిన కొన్ని విషయము లాలోచించ వలయుననుకొనియుంటిమి. మరొక పర్యాయము అవకాశముకలుగజేసుకొని మీరే యిప్పటికిరండు, లేనిచో మా తిమ్మయామాత్యులను అచ్చటకు పంపెదను."

ఈ మాటలకు విరూపాక్షరాయలు ఆశ్చర్యచకితుడైనాడు.

"మహారాణిగారూ! మీరే విషయమును గురించి చెప్పుచున్నారో నాకు బోధపడుటలేదు. కొంత వివరముగా చెప్పుడు.... పట్టాభిషేక కానుకలు మాచే సరిగా చెల్లింపబడలేదనియా అనుచున్నారు"

"లేదు, ఆ విషయమై సార్వభౌము డొక శాసనమును ప్రకటించి, సామ్రాజ్యమునందలి నలుమూలలనుండి సంగ్రహింపబడుచూనుండిన పట్టాభిషేక కానుకలను ఆపివేసినారు."

"ఆ శాసనముతో కూడిన ఆజ్ఞాపత్రముకూడ నాకు ముట్టినది. కాని, ప్రాజ్ఞులైన తమరింతటి పిచ్చి శాసనమును అమలు పరచుటకు మునుపే నన్నొకమాట అడుగగలరని నిరీక్షించి యుంటిని! కాని,

అటువంటి దేమియునూ జరుగలేదు. సార్వభౌముల కెవరీసలహా చెప్పిరో తెలియదుగాని, వారు సామ్రాజ్యపు ఆర్థిక భద్రతకు గొడ్డలి పెట్టు పెట్టిరనియే నా భావన."

"నేనే, ఈ సలహా చెప్పితిని !"

"మహారాణిగారూ ! మీకీ సలహా నెవరు చెప్పిరో తెలియదు. తమ ఈ కార్యమువలన రాజబొక్కసమునకు వచ్చుచుండిన స్వర్ణప్రవాహమునకు ప్రతిబంధక మేర్పడినదని చెప్పవలసి యున్నది. ఇందులకై నేను విచారించు చున్నాను."

"ఎందులకు, విరూపాక్షరాయలూ! విచారమునకు కారణమేమి?"

"మహారాణిగారూ ! ఒక రాజ్యముయొక్క భద్రత నిలువవలయు ననినచో దాని యార్థిక భద్రత సరిగా నుండవలయును. రాజబొక్కసములో అమితమైన సంపద నిండియుండిన నేమాత్రమది బలిష్టమైన రాష్ట్రము కాగలదు. మీరు ఎవరిమాటనో విని, పూర్వమునుండియు అనూచానముగా వచ్చుచున్న పద్ధతిని, ఆపివేసి బొక్కసమునకు వచ్చుచుండిన ఆదాయము నరికట్టినారు. ఇందువలన సామ్రాజ్యమున కపారమైన నష్ట మేర్పడినదని నా భావన !"

"అది సరియైన భావనకాదు విరూపాక్షరాయలూ ! ఇది ధర్మ సామ్రాజ్యము. ధర్మమను పునాదిరాళ్ళపై యిది నిలబడి యున్నది. ధర్మముయొక్క రక్షకవచ మున్నంతవరకు దీని కే చ్యుతియునూలేదు. కాని, ధర్మక్షయమై, అధర్మము తలజూపిన నాదే దీని నాశము ప్రారంభము కాగలదని పూజ్యులగు విద్యారణ్య మునీంద్రుల భవిష్యద్వాణి గలదు. మన దురదృష్టమేమో, ఈ నడుమ సామ్రాజ్యములో అవినీతి ప్రబలుచున్నది. ప్రజలు ధర్మపాషండు లగుచున్నారు. ఎటు గన్ననూ అన్యాయము, అత్యాచారము, హత్యలు, దోపిడీలే హెచ్చగు చున్నవి. సామ్రాజ్యమునందు ఉన్నతోద్యోగులని ప్రసిద్ధిగాంచినవారే యింతటి దుష్కృత్యములకు పూనికొనిరనగా యిక సామ్రాజ్యమున కే యాపద రానున్నదోనని కళవళమగుచున్నది." అని స్వగతము పలుకు కొనుచున్నదానివలె మహారాణి పొన్నలాదేవి చెప్పి నిట్టూర్చినది.

ఈ మాట విని విరూపాక్షరాయలకు పిడుగుపడినట్లయినది. తను నిలబడిన ప్రదేశము అధఃపాతాళమునకు కృంగిపోవుచున్నట్లుగా భావించి బాధపడినాడు. ఆమె యీ మాట లన్నింటినీ తనను మనసున నిడుకొని అనుట లేదుకదా ?

"మహారాణిగారూ ! మీ మాటలు నా కర్థమగుటలేదు. మీరు పరోక్షముగా ఎవరినో మనసున నిడుకొని యీ మాట లనుచున్నారు. నా వలన తెలియక సన్నిధానమున కేమైననూ అపచారము జరిగి యుండినచో దయయుంచి క్షమించవలయును "

"మేము ఎవరిగాని మనసున నిడుకొని, ఈ మాట లనుచుండ లేదు, విరూపాక్షరాయలూ ! సామ్రాజ్యములో హఠాత్తుగా తలజూపిన యీ యవినీతి మారుతమును జూచి, సహనము కోల్పోయి ఈ మాట లనినాను. ఇందులకై మీ మనసునకు బాధ కలిగియుండినచో, నేనే మియూ చేయజాలను !"

"మహారాణిగారూ ! మీ రెవరిని నుద్దేశించి యీ మాట లనుచున్నారో తెలియనంతటి మూర్ఖుడను గాను నేను. కాని, నేను మీవలె నిరపరాధిని గనుకనే ఉద్రేకపూరితుడను కాలేదు. నా విరోధులెవరో మీకు లేనిపోని చాడీలు చెప్పి, నా విషయములో మీ మనసును విరచినారు. అందులకై నేను విచారించుచున్నాను."

"అయినచో మీ వలన సామ్రాజ్యమునకుగాని, ప్రజలకుగాని ఏ యన్యాయమునూ జరుగలేదందురా ? మీరు పట్టాభిషేక కానుక అను పేరుతో నగరమందలి ప్రముఖ వర్తకులైన ఆదిత్యవర్మ యను వానిని కొల్లగొట్టలేదా ? వారి కుమార్తెను కోరి, వారి భార్యను - కుమారునీ అమానుష రీతిని హత్య చేయించలేదా ? ఈ యారోపణలకు మీ రేమి జవాబు చెప్పగలరు ?" మహారాణి కోపములో ప్రశ్నించినది.

"మీరు వివరించిన యీ విషయము లన్నియునూ సత్యదూరములైనవి, మహారాణిగారూ ! నేను ఆదిత్యవర్మను దోచుకొననూ లేదు. వారి కుమార్తెను కోరనూలేదు. వారి పత్నీ - పుత్రులపై చేయి చేసు

కొననూలేదు.... ఇసంతయునూ అబద్ధము. కల్పించి చెప్పిన మాటలు. తమ రీవిషయమును నమ్మకుడు !" సత్యసంధునివలె విరూపాక్షరాయ లనినాడు.

"ఏది యబద్ధము - ఏది నిజమను విషయము నాకు బాగుగా తెలియును. ఆదిత్యవర్మగారే స్వయముగా నాకు జరిగిన విషయము లన్నియునూ చెప్పినారు. మీరు నయగారపు మాటలతో నన్ను వంచించ లేరు !"

"నే నెవరినీ వంచించుటలేదు. వంచించి బాముకొనున దేమి యునూ లేదు. యధార్థమునే చెప్పుచున్నాను."

"యధార్థము ! కానిమ్ము, అయినచో మీ రిప్పుడనుట యేమి ? ఆదిత్యవర్మగారి పత్నీ పుత్రుల నెందులకు హత్య జేయించినారు? వారి యాస్తి నెందులకు దోచుకొన్నారు ?"

"తల్లీ ! యధార్థము నెరుగక, మీరు వృధాగా నన్ను శంకించు చున్నారు. జరిగిన సంగతి యిది : నేను ఆదిత్యవర్మగారి పుత్రికను జూచి, క్షత్రియోచితమైన కన్యయని, సామ్రాట్టులకు వివాహము చేయు టకై ఆమెను వధువుగా కోరినది నిజమే ! కాని, నా కొరకై ఆమెను కోరలేదు. - ఈ విషయమును రహస్యముగా నుంచి, ఆదిత్యవర్మ గారినీ - మిమ్ములనూ ఆశ్చర్య పరవశులను జేయవలయునని భావించు టయే యింతటి యనర్థమునకు హేతువైనది. ఇందులకై నేను విచా రించు చున్నాను !"

"అయినచో, ఆదిత్యవర్మగా రెందులకు తమ పుత్రికను వెంట బెట్టుకొని మా యాశ్రయమునకు వచ్చినారు ?"

"వారి కెవరో కుత్సితులు నా విషయములో లేని భీతిని కలిగించి యుండవచ్చును. అచ్చట నుండినచో తమ కాపద తప్పదని తలచి వారిచ్చటికి వచ్చి మీ యాశ్రయమును పొందియుండవచ్చును."

"మీది సుహృద్భావ మైనచో, వారి పత్నీ - పుత్రుల నెందు లకు హత్య జేయించినారు ? వారి యాస్థి నెందులకు వశపరచు కొనినారు ?"

"ఇందులో మా ప్రవేశ మేమియునూ లేదు తల్లీ! అందరనూ అడిగినట్లే మేము ఆదిత్యవర్మను కూడ పట్టాభిషేక కానుకలు చెల్లింప వలసినదని యడిగితిమి. కాని, వారు భీతిల్లి తమ పుత్రికతో తప్పించుకొని వచ్చినారు. నేనీ కానుకను వారి పుత్రులనుండి వసూలు చేయ వలసినదని యాజ్ఞాపించితిని. అతడు మూర్ఖత్వముతో, కానుక నడుగుటకై వచ్చినవారిని తిరస్కరించి, వారి మీదపడి, కొందరిని గాయ పరచినందువలన, విధిలేక మా సింగన నాయకు లతనిని బంధించి తీసుకొని రావలసినదని యాజ్ఞాపించినారు. తనను బంధింపవచ్చిన వారిలో ప్రతిఘటించి పోరాడి మరణించినాడు. కుమారుని మరణవార్త విని యతని తల్లికూడ హృదయ చలనమాగి తనువును చాలించినది. వారి యాస్తికి సరియైన వారసుడు లేకపోవుటచే, ఆదిత్యవర్మ వచ్చి దానిని కోరువరకునూ, మా రాజభాండాగారములో భద్రముగా గుప్త పరచి యున్నాము. అంతియకాని వారి యాస్తిని మేము దోచుకొనలేదు. ఆదిత్యవర్మగా రెప్పుడైననూ వచ్చి వారియాస్తిని వారు పొందవచ్చును. అందులకు మా యభ్యంతరము లేదు...."

"అయినచో, ఈ విషయములో మీరు నిరపరాధులా?"

"ఔను, తల్లీ! జరిగిన సంగతిని విన్నవించుకొనినాను. ఇక దానిని విశ్వసించుటయూ, విశ్వసించక పోవుటయూ తమకు సంబంధించినది."

"అయినచో, ఆదిత్యవర్మగారి యమూల్య సంపదను మీరు మోసముతో అపహరించలేదా?"

"మహారాణిగారూ! పంపాపతి దయచే అంతటి బీదరికము మా కింకనూ సంప్రాప్తముకాలేదు. మేము మా రాజ్యమందలి యొక ధనవంతుని సంపద కాశపడి, యతనిని హింసించునంతటి పతితు లింకనూ కాలేదు...." అని వెకిలినవ్వు నవ్వుచూ విరూపాక్షరాయ లనినాడు.

"మీరా ధనములో సైన్య సంగ్రహణము చేయుచున్నారని వార్త తెలిసినది. దాని విషయమేమి?"

"అదియునూ అబద్ధపు వార్తయే తల్లీ!"

"ఇంతటి యబద్ధపు వార్తల నెవరు పుట్టించగలరు? ఇందులో నేదియో సత్యాంశ ముండకపోదు. నిప్పులేనిదే పొగరాదుకదా!"

"ఆదిత్యపద్మగారి కథవలె యిదియునూ అభూతకల్పనము! మా విరోధులెవరో మేము సరిహద్దు రక్షణార్థమై సైన్య సంగ్రహణము జేయుచుండుటను జూచి, సామ్రాట్టులపై కత్తిగట్టుచున్నామని మీకు అబద్ధము చెప్పియున్నారు. తమరిటువంటి వదంతులను విశ్వసించకుడు, తల్లీ!"

"అట్లయినచో, మీ రాజధానిలో జరుగుచున్న సైనిక చర్యల కర్థమేమి?"

"మహారాణిగారూ! మీ వద్ద దాపరిక మెందులకు? ఇది మీకునూ తెలిసిన విషయమే. మనపై దండెత్తి వచ్చుటకు ఆ ఉత్కళ కపిలేశ్వర గజపతి సర్వమునూ సిద్ధపరచుకొనుచున్నాడట. ఒకవేళ అతదెత్తి వచ్చినచో, అటువంటి సమయమున సామ్రాట్టులకు సాయపడుటకై యీ ప్రయత్నమును చేయుచున్నాను. గడి ప్రదేశముల కావలి, సైన్య సంగ్రహణము, యోధ శిక్షణ యివి యన్నియునూ శత్రువులపై జరుపబోవు పోరునకు సమాయత్తములేకాని, తమపై జరుపుచున్న విద్రోహకర కార్యములు కావు! నా మాట సత్యము!!"

"మీ వద్ద ప్రస్తుతమున కెంత సైన్యము సమకూడినది?"

"సుమారైదువేల పదాతిదళము - రెండువేల ఆశ్విక సైన్యము వేయి ఏనుంగులు నుండవచ్చును.... ఈ మాత్రపు సైన్యముతో సామ్రాజ్యపై యుద్ధమొనర్చుట సాధ్యమా? అను విషయమును ప్రాజ్ఞులైన మీ రాలోచించవలయును!"

"అనేక లక్షల సంఖ్యలో మీరు సైన్య సంగ్రహణము చేసినట్టుగా విన్నాము...."

"తమరొక పర్యాయము పెనుగొండకు వచ్చి పరీక్షించవచ్చును. అందులకు నా యభ్యంతర మేమియునూ లేదు. యథార్థమును సన్నిధానమున విన్నవించికొన్నాను. దీనిని నమ్ముటయూ, నమ్మకపోవుటయూ మీ యిష్టము!"

"విరూపాక్షరాయలూ ! నే నెన్నడూ మీ నిష్ఠను శంకించలేను. మీ వద్ద ఒకవేళ ఎక్కువగా సైన్యమున్నచో మంచిదేకదా ! సామ్రాజ్య భద్రతకై అది ఆపత్సమయములో సాయపడగలదని నాకు తెలియును. ఈ దృష్టిలో నేను మిమ్ముల నీ విషయమై ప్రశ్నించితినే కాని, వేరు భావముతో అడుగలేను."

"మహారాణిగారూ ! మా తండ్రిగారు సార్వభౌముల ఉప్పుతిని, వారికి ద్రోహము తలచి మన పవిత్ర వంశమునకు కళంకమాపాదించినారు. దాని నెట్లయిననూ తుడిచివేయవలయునని నేను సంకల్పించినాను. మీరు స్వార్థపరుల మాట లాలించి, నా ప్రయత్నములు విద్రోహాచరణములని భావించునట్టయినచో, నేను దురదృష్టవంతుడ ననుకొనియెదను. ఇందులకై నే నెవరినీ దూషించుటలేను."

"మీరు మా క్షేమమును కోరి యిది యంతయునూ ఆచరించుచున్నట్టయినచో, మేము మీకు కృతజ్ఞులము. మా మాటలకు మీరు విసుగు జెందకుడు. మీకు బాధ కలిగియున్నచో క్షమింపుడు. సామ్రాజ్య క్షేమ దృష్ట్యా తమతో యీ మాట లనవలసి వచ్చినది. ఇపుడు సామ్రాజ్యపు నలుమూలలా శత్రువులు పొంచియున్నారు. ఈ సమయములో మనము మైమరచి నిద్రించరాదు. మన జాగ్రత్తలో మన ముండవలయునని ఆ విధముగా చెప్పవలసి వచ్చినది. ఇపుడు మీ స్పష్టోక్తులను విని, నాకు మీ పైగల సంశయ మంతయూ పటాపంచలైనది. మేము మిమ్ముకలను మా మిత్రులవలె సంతోషముగా వీడ్కొలిచ్చి పంపుచున్నాము" అని మహారాణి పొన్నలాదేవి అర్థగర్భితముగా నవ్వినది.

"మహారాణిగారూ ! తమ సహృదయతకు మా కృతజ్ఞతలు. నా పై సందేహ మేర్పడుట ఎట్టివారికైననూ సహజమే. కాని, తగిలిన కాలే మరల తగులుకుండునట్లు జాగ్రత్త వహించుట మంచిదని రుజువు సెలవిచ్చినారు. ఇందులకు మేము కృతజ్ఞులము. మీవద్ద వీడ్కొలు పుచ్చుకొని వెళ్ళుటకు పూర్వము ఒక మాట చెప్పదలచినాను. స్వార్థపరులెవరో మీ సందేహమును నా మీద కేంద్రీకృతము చేసి, తాము సింహాసనముపై కన్నువేసియున్న విషయము బయట పడనివ్వక,

స్వార్థమును సాధింప బ్రయత్నించుచున్నారు. కనుక మీరీ విషయమై జాగ్రత్త వహించి యుండు టావశ్యకము!"

"మీ మాటలు నా కర్థమగుట లేదు, విరూపాక్షరాయలూ! కొంత స్పష్టముగా వివరింపుము!" మహారాణి యడిగినది.

"ఇది మీకు తెలియనిది కాదు. అయిననూ నా ముఖతఃనే విన గోరుచున్నారు...."

"లేదు, విరూపాక్షరాయలూ! నిజముగా సింహాసనముపై కన్ను వేసియున్న ఆ ద్రోహి ఎవరనునది నాకు తెలియదు. మీరు స్పష్టముగా చెప్పి, పుణ్యము కట్టుకొనుడు."

"సింహాసనముపై కన్ను వేసి యున్నవాడు నేను కాను తల్లీ!- ద్రోహియగు ఆ సాళ్వ నరసింహనాయకుడు. అతడే సామ్రాజ్యపు ప్రథమ శత్రువు! అత డొనరించుచున్న కుట్ర తెలియకుండుటకై మా మీద లేని పోని యారోపణలను మోపి, ప్రజలలో వదంతులను పుట్టింప జేసినాడు. ఎందువల్లననగా, నన్ను తమరు సంశయదృష్టిలో జూచుట సహజమే! కాని, ఈ విరూపాక్షరాయల శరీరములో బొట్టు రక్త మున్నంతవరకూ ఆ సాళ్వ నరసింహుని విద్రోహము కార్య గతము కాజాలదని ప్రతిజ్ఞ జేసి చెప్పుచున్నాను."

"విరూపాక్షరాయలూ! మా కిదివరకూ ఈ విషయము లొక్కటి యునూ తెలియవు. మీరీ మహత్తర విషయములను సకాలములో మా కెరిగించి సామ్రాజ్యమునకు మహోపకార మొనరించినారు."

"ఇది నా కర్తవ్యము మహారాణిగారూ! ఈ విషయమును మీకు తెలిపి వెళ్ళుటకొరకే నేను రాజధానికి వచ్చినాను. మా మాతృశ్రీ గారి యనారోగ్యమును సైతము లెక్కించక, నే నిప్పటికి వచ్చుటకు ముఖ్య ముగా కారణ మిదియే! ఆ సాళ్వ నరసింహుని విద్రోహముపట్ల మిమ్ములను జాగ్రత్తగొలిపి వెళ్ళవలయునని!"

"సాళ్వ నరసింహు డెందులకు మాపై కత్తి గట్టినాడు? మేము చేసిన యపరాధ మేమి?"

"మహారాణిగారు, మా పెదతండ్రిగారగు సామ్రాట్ ప్రౌఢదేవ రాయల కాలములో జరిగిన గోపరాజుయొక్క రాక్షసకృత్యమును మరచి నట్టున్నారు. ఆ గోపరాజూ, ఈ సాళ్వ నరసింహుడూ జ్ఞాతులను విష యమును తమరు మరువరాదు. గోపరాజు తండ్రి తిప్పరాజుయొక్క అన్నగారగు గుండరాజ - మల్లాంబికల ద్వితీయ పుత్రుడే యీ నర సింహ నాయకుడు. అతడు తాను అహోబిల నరసింహస్వామి వర ప్రసాదముచే, విజయనగరము నుద్ధరించుటకై పుట్టియున్నవాడని చెప్పు కొని, ప్రజలలో అబద్ధపు వదంతులను ప్రాకింప జేసినాడు. మమ్మ లనూ, మిమ్ములనూ మోసగించి, సింహాసనమును స్వాధీనపరచు కొను టకీ తంత్రము పన్నినాడు. తమ రికనైననూ జాగ్రత్తగా నుండుట మంచిది!" అని చెప్పి తనపై వాలిన సంశయ విహంగమును సాళ్వ నరసింహనాయకునిపైకి వదలినాడు.

అయిననూ, ఈ మాటలను మహారాణి పొన్నలాదేవి మొదట నమ్మలేదు. నమ్ముటకు సాధ్యము లేదు.

"సాళ్వగోపరాజు కీర్తిశేషులైన సార్వభౌములకు ద్రోహము దలచి, అందులకు తగిన శిక్ష ననుభవించినాడు. ఆ యదుగుజాడలనే యిపుడు గుండరాజు కుమారుడగు నరసింహనాయకు డనుసరించు చున్నాడనిన, నమ్ముట కష్టము!"

"ఔను, తల్లీ. దీనిని నమ్ముట కష్టమే! ఎవరునూ తగిలిన కాలినే మరల తగిలించుకొన నాశించరు. కాని, వీని సహోదరునికి జరి గిన యన్యాయమునకు ప్రతీకారము దీర్చుకొనగోరి నరసింహనాయకుకీ పన్నుగడ పన్నుచున్నాడనునది తమరు మరువరాదు. ఆ సాళువులు తాము పరపంథి సాళువలని చెప్పుకొను మాటను తమ రుపేక్షించరాదు. సాళువము పగబట్టినచో, యితర విహంగములు దాని నేమియునూ చేయలేవు. తమ సాళ్వవంశపు గోపరాజుకు జరిగిన పరాభవమునకై మీ మీద పగ దీర్చుకొననలచి, సాళ్వనరసింహనాయకుడు తన సర్వ శక్తులను కేంద్రీకృత మొనరించు కొనుచున్నా డనినచో, తమ రాశ్చర్య పడవలసిన పని లేదు!"

"అయిననూ, నా కెందులకో యీ విషయమై యింకనూ నమ్మిక కలుగలేదు. మన యనుగ్రహములో, ముళువాయి ప్రాంత్యపు మండలేశ్వర పదవిని పొందిన అతడు, అన్నము పెట్టిన ప్రభువుకు ద్రోహము తలపెట్టగలడా ?"

"అయినచో, సామ్రాట్ మల్లికార్జునరాయలు పట్టాభిషిక్తుడగు సమయమున, అత డెందుల కిచ్చటికి వచ్చి నిష్ఠయను ప్రమాణ వచనమును స్వీకరించలేదు ? సార్వభౌముల వివాహమున కతడు కేవలము కొన్ని కానుకలను పంపినాడేకాని, తానే స్వయముగా ఎందులకు రాలేకపోయినాడు ? దీనివెనుక విశేషార్థము లేదందురా ? ఈ విషయము నెప్పుడైననూ మీ రాలోచించితిరా ?"

"లేదు. ఇందులో ఏ మోసమూ మాకు గోచరించలేదు. అస్వస్థతగా నుండుటచే నతడు రాజధానికి రాలేకపోయినాడని ఆతని మంత్రులు చెప్పిన మాటను మేము నమ్మినాము."

"మిమ్ములను మోసగించుటకై ఆధూర్తుడు యీ కపట నాటక మాడుచున్నాడు. అతడు మిమ్ములను మంచిమాటలతో వంచించినాడు. కాని, అటువంటి నయగారపు మాటలు నాకు రాకపోవుటవలననే మీకు నాపై యనుమానము కలిగినది" అని విరూపాక్షరాయలు అర్థగర్భితముగా నవ్వినాడు—

ముళువాయి మండళపు సాళ్వపరసింహనాయకుడు తమ ఉప్పు తినుచూ తమకే ద్రోహము తలపెట్టియున్న విషయము విని మహారాణి పొన్నలాదేవికి పిడుగుపడి నట్లయినది. ఆమె పూర్తిగా శక్తిని కోల్పోయినదానివలె అట్లే నేలకూలినది. తన భర్తయగు ప్రౌఢదేవరాయల సుదీర్ఘమైన పరిపాలన మింత త్వరలో, సామ్రాజ్యమంత విధమైన విద్రోహ బీజమును ఎత్తవలయునా ? అని హతాశురాలైనది.

ఆమె ఈ విషయమును గురించి తిమ్మయామాత్యుల తోడనూ, మల్లికార్జునరాయల తోడనూ ప్రస్తావించి, సాళ్వవిద్రోహమును అంకురమునందే అణచివేయుటకు తగిన చర్యలు గైకొనుమనట్లుగాచెప్ప, ఈవిష

యమును సకాలములో తెలిపి ఉపకారము చేసిన విరూపాక్షరాయలకు విశ్వాసముతో వీడ్కోలిచ్చి పంపినది. విరూపాక్షరాయలు తాను వచ్చిన కార్యము సఫలమైనదను సంతసములో అచ్చటనుండి వెళ్ళినాడు.

అనంతరము మహారాణి పొన్నలాదేవి తిమ్మయామాత్యులను, మల్లికార్జునరాయలనూ ఆంతరంగికముగా పిలచి, విరూపాక్షరాయల ద్వారా తాను వినిన సంగతులన్నింటినీ సవివరముగా తెలియజేసినది. వారీ విషయములను విని ఆశ్చర్యపోయినారు.

కాని, తిమ్మయామాత్యుడు మాత్రము భీతిల్లక, ధృఢస్వరముతో అనినాడు :

"తల్లీ ! ఇందులో నిగూఢమైన రహస్యమేదియో దాగియున్నట్లు తోచుచున్నది. విరూపాక్షరాయలు సాళ్వనరసింహనాయకుని విద్రోహి యని యారోపించుటయు, అతడితనిని విద్రోహియనుటయు జూచినచో ఆశ్చర్యమగుచున్నది. దీనివలన మన కిదివరకునూ తెలియక యుండిన ఏదియో ఒక రహస్యము - సింహాసనమును తమవశము చేసుకొన వలయునను యాశ - బీజరూపములో పెరుగుచున్నదని సుస్పష్టమైనది. మన మీ విద్రోహాంకురము పెరిగి మహావృక్ష మగుటకు పూర్వమే దానిని నాశనమొనరించవలయును. లేనిచో మనకు అపాయము తప్పదు. ఇప్పుడే మన మీవిషయమై జాగ్రత్త వహించుట క్షేమకరము. ఈసంద ర్భమున మనమెవరినీ నమ్మరాదు. విరూపాక్షరాయలనూ, సాళ్వనర సింహనాయకునీ మిత్రులవలె జూచుచూ, వారి యంతరంగమునుభేదించి అనంతరము విద్రోహులెవరైననూ సరియే, వారికిశిక్షవిధించవలయును. లేనిచో, సింహాసనమునకు ముప్పు తప్పదు !" అని వివరించినాడు.

"ఈ కార్యమునకు సమర్థులు మీరే అమాత్యులూ !" అని మల్లి కార్జున రాయలనినాడు.

"తల్లీ ! నా ఒక్కనిచే యీ కార్యము సాధ్యపడగలదని నేనను కొనలేదు. ఆవశ్యకమైనచో తమరుకూడ పెనుగొండకో, ముళువాయికో వెళ్ళిరావలసి యుండును."

"అంతటి పరిస్థితి వచ్చినచో, అందులకు మేము సిద్ధముగా

నున్నాము" అని మహారాజే పొన్నలాదేవియు, మల్లికార్జునరాయలునూ అనినారు.

అనంతరము తిమ్మయామాత్యుడు ముఖవాయికి చతురులైన గూఢచారులను బంపి, అచటి విషయము తెలిసిరమ్మని చెప్పి, తాను వేషాంతరములో పెనుగొండకు ప్రయాణించినాడు.

# 6. రహస్యభేదనము

సాళ్వ నరసింహ నాయకుడు గోపరాజు యొక్క జ్ఞాతి. గోపరాజు ప్రౌఢదేవరాయలకు వ్యతిరేకముగా జరిపిన కుట్రలో యితడు ముఖ్యపాత్ర ధరించి, దానికి తగిన విలువను తెచ్చినాడు.

సాళ్వ గోపరాజేయుద్దేశసాధనకై ప్రౌఢదేవరాయలను హత్య చేయ ప్రయత్నించినాడో దానిని సాళ్వనరసింహనాయకుడు మరువ లేదు. అవకాశము లభించినపుడు సంగమవంశ ప్రభువులను సింహాసనచ్యుతులనుగా జేసి, సాళ్వవంశమును ప్రతిష్ఠాపన జేయవలయునను యాలోచన గలవాడతడు. సాళ్వగోపరాజుకు జరిగిన యన్యాయమునకీ విధముగా ప్రతీకారము తీర్చుకొన నిశ్చయించినాడు. కాని, అతడు వివేకియూ, దూరదర్శియూ, రాజకీయ తంత్రజ్ఞుడునూ యగుటచే తొందరపడక తన క్రాంతియుత చర్యకు తగిన సమయముకొరకై వేచి చూడసాగినాడు.

సాళ్వల వంశము ప్రాచీన రాజకుటుంబములలో వొకటి. ఈ వంశమునకు మూలపురుషుడైన వంకిదేవుడు సాళువము (డేగ) చే అభ్యుదయము పొందినందువలన ఆ కుటుంబమునకు సాళ్వవంశమను పేరు కలిగినది. ఈ వంశములో ప్రసిద్ధిగాంచిన మంగరసకంపరాజుతో మధురమీద దండెత్తివెళ్ళి, అచ్చటనుండి యవనులను పారద్రోలినాడు.

అతని కుమారుడే గుండరాజు. ఈ గుండరాజు యొక్క మనుమడే నాలవగుండరాజు. అతనికి మల్లాంబిక యందు జన్మించిన ద్వితీయ సంతానమే యీ సాళ్వనరసింహ నాయకుడు.

ప్రౌఢదేవరాయలు తనమీద నిష్కారణముగా కత్తిగట్టిన గోపరాజు వంశముపై పగదీర్చుకొనక ఉదారముగా క్షమించి, వదలి వేసినాడు. తన సహోదరియగు హరియాలదేవి ముఖముజూచి సాళ్వవంశీయులను శిక్షించక వదిలిపెట్టినాడు. అంతియగాక ఆ కుట్రలో తక్కిన సాళ్వుల ప్రవేశము లేదనికూడ అతనికి తెలియును. అందువలననే మునుపాయి రాజ్యమును అతడు గుండరాజు కుమారుడైన సాళ్వనరసింహ నాయకునకు అనుగ్రహించినాడు.

సాళ్వనరసింహుడు ప్రౌఢదేవరాయలు బ్రతికి యున్నంతవరకూ అతనిని నిష్ఠతో సేవించినాడు. కాని, అతడు మరణించగనే దేశములో తలయెత్తిన అరాచకత్వమును జూచి తానుకూడ స్వతంత్ర సామ్రాట్టుగా పేరుగాంచ వలయునని యాశపడినాడు. అందులకు సామ్రాజ్య స్థితి కూడ అనుకూలముగనే యున్నది. సామ్రాట్ ప్రౌఢదేవరాయల ప్రభుత్వపు చివరిరోజులలో దేశమంతటా ధార్మికమైన క్షోభ చెల రేగినది. ఈ సమయముననే సార్వభౌముడు కూడ గాయపడి మంచము పట్టినాడు. ఈ సమయము జూచి బహమనీసుల్తానుడు సామ్రాజ్యముపై దండెత్తి వచ్చినాడు. ఉత్కళ కపిలేశ్వర గజపతికూడ తన సామ్రాజ్య విస్తరణలో నిమగ్నుడై విజయనగరమును కబళించుటకు ప్రయత్నించ సాగినాడు.

ఇటువంటి సమయములో సింహాసనము రాజ్యపాలనానుభవము లేని యువకుడునూ, దుర్బలుడునూ నగు మల్లికార్జున రాయల చేతికి వచ్చినది. మల్లికార్జునరాయలు బాల్యము నుండియూ తల్లి చనువుతో పెరుగుటచేతనూ, రాజ్యపాలనాసక్తికంటెనూ ఆధ్యాత్మ చింతనా పరుడగుట చేతనూ, అతడు పరిపాలనా భారమునంతయునూ తల్లియగు పొన్నలాదేవి కప్పగించి తాను నిశ్చింతుడైనాడు. పొన్నలాదేవి తిమ్మయామాత్యుల సహాయముతో సామ్రాజ్యనౌకను ఒక స్థితికి తీసు

కొని వచ్చు ప్రయత్నమును చేసినది. ఈ ప్రయత్నము ఆమె పాలిటికి చావు బ్రతుకుల పోరాటమైనది. నిధిని కాచియుండు సర్పమువలె ఆమె వేయికనులతో రాజ్యపాలనా భారమును నిర్వహింపసాగినది.

ఇటువంటి పరిస్థితిలో సాళ్వనరసింహుడు సామ్రాజ్యమునకు నిష్ఠతో సేవ చేయదలచిననూ సాధ్యముకాక పోయినది. అటు ఘనగిరి రాజ్యపు ముమ్మడి విరూపాక్షరాయలు ఏ విధముగా నైననూ విజయ నగర సింహాసనమును తన వశము జేసుకొన వలయునని సంకల్పించి రహస్యముగా కుట్రలు జరుపుచున్నాడు. ఇది గూఢచారులవలన నరసింహనాయకునకు తెలియక పోలేదు. కాని, విజయనగర సింహాస నము నీచుడైన విరూపాక్షరాయలకు లభించునట్టి పరిస్థితి యేర్పడినచో, సామ్రాజ్యము నాశనమగుటను తప్పించుటకు అతని చేతినుండి సింహా సనమును తాను లాగుకొనుట ధర్మమని భావించినాడు. ఎటుజూచిననూ బహమనీ సుల్తాను, ఉత్కళ గజపతివంటి ప్రబలశత్రువులు కాలుదువ్వి కదనమునకు సిద్ధపడుచుండగా వారి బారినుండి సామ్రాజ్యమును రక్షించుటకు రాజ్యక్రాంతి జరుపుట తన కర్తవ్యమని భావించినాడు.

కాని, చతురుడైన అతడు గోపరాజుకు జరిగిన పరాభవముతో పాఠము నేర్చుకొన్నాడు — అతనివలె తాను తొందరపడి హింసా కృత్యమునకు పూనికొనినచో తానుద్దేశించిన కార్యము — రాజ్యక్రాంతి — నెరవేరదని గ్రహించినాడు. తనరాజ్యక్రాంతి యశోవంతము కావలయు ననినచో అది ప్రజల కార్యక్రమ మగుటావశ్యకము. ప్రజాబలము లేనిదే తాను సింహాసనమునకై జరుపు పోరాటము విఫలము కాగల దని భావించినాడు. అందువలననే అతడు తొందరపడక, ప్రజలుకూడ దుర్బలుడగు సార్వభౌముని పరిపాలనతో విసిగి, తనవంటి సమర్థుని యీకార్యమునకు ఎన్నుకొనునంతవరకూ తాను ఏ విద్రోహాచరణకునూ పూనుకొనరాదని నిర్ణయించుకొన్నాడు. తన రాజ్యక్రాంతి వ్యర్థమగు పోరాటముగాక సామ్రాజ్య ప్రజకు నవోదయము కావలయునను నదియే అతని యాశయము. అతడు సింహాసనమునకై వ్యర్థముగా

పోటుసల్పి - రక్తపాతమును ప్రవహింపజేయుట కిష్టపడలేదు. తన కనుకూలమగు వాతావరణముకొరకై యతడు నిరీక్షించ సాగినాడు.

అట్లనుటచే నతడు పిరికిపందవలె, నిష్క్రియుడై కూర్చొని యున్నాడని అర్థముకాదు. అతడు ప్రజల ప్రీత్యాదరములను, అభిమానమును చూరగొను కార్యములో నిరతుడైనాడు. ధర్మప్రభువని పేరు గాంచుటకై అత డనేక ప్రజోపయోగ కార్యములను చేయించసాగినాడు. రాజ్యమందలి అనేక దేవాయతనముల జీర్ణోద్ధరణ కార్యమునకు పూనుకొనినాడు. అందుచే యతడొక కారణ పురుషుడనీ, అహోబల శ్రీ నృసింహస్వామి వరప్రసాదముచే జన్మించినవాడనీ, అతనిచే సామ్రాజ్యమునకు మహత్సేవ జరుగగలదనీ ప్రజాసామాన్యులలో కింవదంతి బయలుదేరినది. ఇది అతడు నిరీక్షించిన దానికంటెనూ ఎక్కుడుగా పెరిగి, అతడు కోరిన ఫలము లొసంగుటకై కావలసిన భూమికను సిద్ధపరచినది.

వాస్తవ విషయముకూడ దాని కనుగుణముగనే యున్నది. నరసింహ నాయకుడు గుండరాజ దంపతులకు అహోబల నృశింహస్వామిని దర్శనము చేసుకొనినతరువాత జన్మించినాడు. ఆ దంపతులు అహోబలమునకు యాత్ర వెళ్ళినపుడు, శ్రీ నృశింహస్వామి మల్లాంబికకు స్వప్నములో కనబడి, ఆమె భక్తికి తాను మెచ్చినట్లునూ, తన కృపాప్రసాదముచే పుట్టబోవుబిడ్డకు నరసింహుడని నామకరణము చేయవలసినదనియూ, అతనివలన వారి వంశకీర్తి దిగంత విశ్రాంతము కాగలదనియూ, సెలవిచ్చినాడు. ఆ ప్రకారమే వారికి మగబిడ్డ పుట్టగా అతనికి నరసింహుడని పేరు పెట్టినారు. అతడు బాల్యమునుండియూ అసాధారణ బుద్ధి కుశలతను ప్రదర్శించుచూ వచ్చుటచే మున్ముందు అతడే విజయనగర సామ్రాట్టు కావచ్చునన్న దూరపుటాశ ఆ దంపతులకు కలుగ సాగినది. ఈ విషయము నలుగురినోటపడి, అతడు సార్వభౌముడగుటకై పుట్టిన పిల్లవాడని ప్రజలలో ఒక మూఢ విశ్వాసము వేరూనునట్లయినది.

ఇంత జరుగుచున్ననూ అతడు తన మాటలలో - చేతలలో -

ప్రవర్తనలో దేనియందునూ విద్రోహచ్ఛాయలు పొడగొట్టకుండా చాల జాగ్రత్త వహించినాడు. అందుచే అందరునూ అతనిని స్వామిభక్తి పరాయణులలో ప్రథమగణ్యుడని భావింప సాగినారు. స్వయం సామ్రాట్టులూ, పొన్నలాదేవి కూడ అతని నిదిపరచూ సామ్రాజ్యమండలి మండలేశ్వరులలో చాల సమర్థుడగు, నిష్ఠగల సామ్రాజ్యధురీణుడని భావించి నిశ్చింతగా నుండ సాగినారు. కాని, తనపై వచ్చిన సంశయమును విరూపాక్షరాయలు ఉపాయముగా సాళ్వ నరసింహునిపైకి వదలినాడు. దీనిచే అతడూహించిన పరిణామ మేర్పడినది. పొన్నలాదేవి నరసింహనాయకుని చర్యలను కనిపెట్టి తెలియజేయుటకై గూఢచారులను ముళువాయికి పంపినది.

గూఢచారులు వేషాంతరములో వచ్చి ముళువాయి, లేకల్, కోలారు మొదలగు పట్టణములను ప్రవేశించి తమకు కావలసిన విషయము కొరకై చాల నిగూఢముగా పరిశోధించినారు. కాని ఎవరి నోట కూడ నరసింహనాయకుడు స్వామిద్రోహి యనిగాని, రాష్ట్ర ఘాతకుడని గాని వినబడలేదు. ఎవరి నడిగిననూ అతని సద్గుణముల శ్లాఘనయే వినవచ్చినది. అందరునూ అత డొనరించుచున్న ప్రజాహిత కార్యములనూ, దాన ధర్మములనూ, ప్రజా వాత్సల్యమునూ, దక్షతగల పరిపాలనమునూ, న్యాయ పక్షపాతమునూ కీర్తించువారే. అతడొక మహాపురుషుడనీ, సామ్రాజ్యమును ఆపత్సమయములో కాపాడగల కారణజన్ముడనీ చెప్పసాగినారు.

ఈ పొగడ్తలను విని విసిగెత్తిన గూఢచారులు రాజధానికి వెనుదిరిగి జరిగిన సంగతి నంతయునూ పొన్నలాదేవి - మల్లికార్జునరాయలకు తెలియజేసినారు.

గూఢచారులు తెచ్చిన వార్తలను విని పొన్నలాదేవి చకితురాలైనది. ఆమె విన్న విషయము లన్నిటిలో, సాళ్వనరసింహనాయకుడు మహాపురుషుడను మాటయూ, సామ్రాజ్యమును ఆపత్సమయములో

కాపాడుటకై జన్మించిన కారణపురుషుడను మాటయూ చాల ఆశ్చర్యమును కలుగజేసినది. తాను నిరీక్షించిన విద్రోహకర వార్తకంటెనూ యిది ఎక్కుడు భయంకరమైనదిగా తోచినది !

"నాయనా ! విన్నావా విషయము ? ఈ వార్త నిజమైనచో సాళ్వ నరసింహునిపట్ల మన మెక్కుడు జాగ్రత్త వహించవలయును!" అని పొన్నలాదేవి నిట్టూర్చినది.

"ఎందులకమ్మా ! మనకు సాళ్వనరసింహనాయకు డే ద్రోహమును తలపెట్టినాడు ? ప్రజ లతనిని మహాత్ముడనియూ, అవతార పురుషుడనియూ పొగడుచున్నారు. ఇట్లుండగా అతడు మన శత్రువనినచో యీ మాట నెవరు నమ్మగలరు ?"

"కుమారా ! మన మెల్లరమూ భావించిన విధానములో నరసింహనాయకుడు మనకు ద్రోహము తలపెట్టుచుండుట లేదు. అతడు మహాపురుషుడనీ, సామ్రాజ్యమును ఆపత్సమయములో కాపాడగల కారణ జన్ముడనీ ప్రజ లనుకొనుటను జూచిన, ఈ సామ్రాజ్యమునకు ఒకానొకప్పుడు ఆపద వచ్చుట తప్పదనీ, ఆ సమయములో అతడు దానిని తప్పించి, బహుశః సింహాసనమును తానే ఆక్రమించుకోగలడనీ యర్థమగుటలేదా ?"

"ఔను, ఇది ప్రజా సామాన్య లనుకొను మాటలయొక్క అంతరార్థమైనచో, దీనిని స్మరించుటకు సైతము భీతి కలుగుచున్నది."

ఆందోళనా పూరితమైన కంఠములో మల్లికార్జున రాయలనినాడు.

"ప్రజలతని విషయములో వ్యక్తపరచుచున్న సుహృద్భావమును తిలకించినచో ఆశ్చర్యమగుచున్నది. అతడు సామ్రాజ్యమును కాపాడుటకై ప్రభవించిన రాష్ట్రపురుషుడట. అనగా యీ విజయనగర సింహాసన మతనికి దైవదత్తముగా సంక్రమించగలదట. ప్రజలావిధముగా అనుకొనుచున్నారు. ప్రజాహృదయములో పేరూనిన యింతటి క్రాంతికరమైన విషయములను నిర్మూలించుట ప్రయాసతో కూడినపని.

ఎందువల్ల ననగా అతడు దుష్టుడైనచో ప్రజల నతనినివిరోధులనుగా మార్చవచ్చును. అతడు విద్రోహియైననూ, నీచుడైననూ మనము దండెత్తి వెళ్ళి శిక్షింపవచ్చును. కాని, అతడు మన మిత్రుడునూ, సామ్రాజ్య నిష్ఠాసేవకుడునూనై, ఉత్తముడను కీర్తిని గాంచియున్నాడు. అటువంటివానిని మనము కారణము లేనిదే శిక్షించుటకు వీలు లేదు. అతని ప్రభావ మిట్లతిశయించుటకు మన మవకాశ మిచ్చినచో, ఎప్పుడో ఒకరోజు యీ సింహాసనమున కతనిచే ముప్పు తప్పదు: ఇపుడు మనము అతని విషయములో చాల జాగ్రత్త వహించవలసి యున్నది. లేనిచో ఆత్మనాశము కాగలదు."

"సరియే, కాని నరసింహనాయకుని ధూర్తతనమును ప్రపంచమునకు చాటుటకు మనమేమి చేయవలయును?"

"అతడు దుర్మార్గుడైనచో, మన మా విషయమును బహిరంగ పరచవచ్చును. దుష్టుడైనచో శిక్షించవచ్చును. ద్రోహియైనచో చెరబట్టి తెచ్చి దండింపవచ్చును. కాని, చూపరులకతడు సద్గుణవంతుడుగా గోచరించుటచే అతనికి విరుద్ధముగా మనమిపుడేమి చేయుటకునూ అసమర్థులుగా నున్నాము. ఈ విషయములో ఏనిర్ణయమునకు వచ్చుటకునూ నాకు తోచకున్నది. కానిమ్ము, అమాత్యులు పెనుగొండనుండి ఏ విషయమును సంగ్రహించుకొని వచ్చెదరో చూతము. వారు వచ్చినపిమ్మట మన మతనివిద్రోహము నణచుటకై చేయవలసిన కార్యమును నిర్ణయించుదము!" అని పొన్నలాదేవి కుమారునకు సమాధానము చెప్పి, అప్పటనుండి విరమించినది.

అయిననూ ఆమెను తిమ్మయామాత్యుడు రాజధానికి తిరిగి వచ్చునంతవరకూ ప్రాణములో ప్రాణము లేకపోయినది. ఆమె యతని రాకను నిరీక్షించుచుండగా అతడు కూడ తగిన సమయములో వచ్చి పెనుగొండలో జరిగిన విషయములను కూలంకషముగా వివరించినాడు.

తిమ్మయామాత్యుడు వేషాంతరములో పెనుగొండకు వెళ్ళినాడు. అచట తన రూప మితరులకు తెలియరాదని ఒక తపస్వి వేషమును

ధరించి, పెనుగొండ రాజోద్యోగులు నివసించు పేటలో గల ఒక మంటపములో దిగినాడు. ఆటకు తగిన వేషము. వేషమునకు తగిన భాష. భాషకు తగిన ప్రవర్తన — అన్నియూ నద్భుతముగా నుండుటచే, తిమ్మరియామాత్యులను మహామహిమాన్వితులైన తాపసులని ప్రజలు భావించినారు. దాని కనుగుణముగా అతని శిష్యులు తమ గురువుల మహిమను లోకోత్తర పరచుటకై యనేక విధములగు కథలను ప్రచారముచేసి, పలువిధములైన తంత్రములను పన్నినారు.

అతిత్వరలో ఆ తాపసి యణిమాది అష్టసిద్ధులను బడసిన మహా మహిముడనియూ, త్రికాలజ్ఞుడనియూ ప్రజలలో నొకవదంతి బయలుదేరినది. భావుకులూ, భక్తులూ తండోపతండములుగా వచ్చి వారి దర్శనము చేసుకొని ఉపదేశమును పొంది వెళ్ళసాగినారు.

ఆ తాపసి తన గుట్టు బయట పడకుండుటకై సాధ్యమైనంత వరకూ ఎప్పుడునూ మౌనముధరించి, తపస్సులో కూర్చొనియున్నవారి వలె నటించెడివాడు. తనకు కావలసినవారు వచ్చినపుడు మాత్రమే వారు బహిర్ముఖులయ్యెడివారు. తక్కిన సమయములలో అంతర్ముఖులై సమాధి స్థితిలో నుండెడివారు.

ప్రజలా తాపసియొక్క మహిమలను విని గుంపులు గుంపులుగా వచ్చి ఆయన దర్శనము చేసుకొని వెళ్ళసాగినారు. వారి శిష్యులు తమ గురువులు మహాయోగులనీ, హిమాచలమందు ద్వాదశ వర్షములు నిరాహారులై తపస్సుచేసి, సిద్ధిపొందినవారనీ, భూత భవిష్యద్వర్తమానములు తెలిసినవారనీ, భక్తజనుల నుద్ధరించుటకై యిపుడు క్షేత్ర యాత్ర చేయుచూ యిచ్చటికి వచ్చినారనీ చెప్పసాగినారు. దానికి తగినట్టు శిష్యుల మాటలు పొల్లుపోకుండుటకై దర్శనార్థమై వచ్చిన భక్తులడుగు ప్రశ్నలకు వారు సమంజసమైన సమాధానము లిచ్చెడివారు. ప్రజలు తమ ఇష్టకామ్యములు సిద్ధించునట్టి యాశీర్వాదమును బొంది వెనుదిరిగెడివారు.

అటువంటి వారిలో విరూపాక్షరాయల సంగడికాండ్రుకూడ కొంత మంది ఉన్నారు. వారు రహస్యముగా వచ్చి, తమ ప్రభువును గురించి

అడిగినారు. వారనుకొనిన సమాధానమే తాపసుల నుండి లభించుట జూచి సంతోషించి, వెళ్ళి యీ వార్తను సింగన దండనాయకున కెరిగించినారు. అతని నుండి ఈ విషయము విరూపాక్షరాయల కంద జేయబడినది.

"ప్రభూ! ఇచ్చటగః యొక మంటపములో హిమాలయము నుండి వచ్చిన యొక తాపసిగలడు. అతడు మహామహిమాన్వితుడట. అతనిని సందర్శించుటకై వెళ్ళినపుడు తమ సంగడికాండ్రలో నతడు తమకు సింహాసన యోగమున్నదని చెప్పినారు. ఈ విషయమును తమ కెరిగించి పోదమని వచ్చితిని" అవి యన్నాడు.

విరూపాక్షరాయలీ మాటవిని చకితుడైనాడు, అతడు తనమంత్రిని బంపి, ఆ తాపసి నిజమైన తాపసియో లేక చద్మవేషధారుడో గ్రహించి రమ్మన్నాడు.

ప్రభువాజ్ఞప్రకారము సింగనమంత్రి ఆమౌనీంద్రులున్న మంటపమునకు వెళ్ళి వారిని రహస్యముగా సందర్శించినాడు.

అతడెవరైనదీ తెలిసిన మౌనీంద్రులతని ప్రశ్నలకు పరిణామకారియైన సమాధానములనిచ్చి అతని యభిమానమునకు పాత్రులైనారు. ఆ సమాధానములు వినిన పిమ్మట సింగనమంత్రికి వారు నిజముగా త్రికాలజ్ఞులే యను నమ్మకము కలిగినది. ఆ తాపసి అంజన ప్రయోగములో సిద్ధహస్తులనీ, వారికంటికి భూమిలో దాచిపెట్టబడియుండు గుప్తనిధి అద్దములోవలె కనబడగలదనీ ప్రజలను కొను మాటలను విని వారి నీవిషయములో పరీక్షించ వలయుననుకొన్నాడు.

అతని ముఖమును చూడగనే,

"మీరేదియో మహత్తరమగు నుద్దేశసాధనకై వచ్చియున్నారు. ఏదియో గొప్ప సాహసమునకు పూనుకొనుచున్నారు. ఒక మహత్తర కార్యమునకై మీరు కంకణము కట్టుకొని యున్నారు. అందులకు ప్రారంభమున విఘ్నములేర్పడినమా చివరకు మీ యభీష్టము సిద్ధించ గలదు. ఇందులకు శంకరి మీ నుండి తగిన బలిని కోరుచున్నది" అన్నారు.

ఈ మాటవిని సింగన మంత్రి !

"స్వామీ ! తాము మహా మహిమాన్వితులనియూ, అంజన ప్రయోగములో సిద్ధహస్తులనియు ప్రజ లనుకొనగా విన్నాను. మేము చేబూనిన మహత్కార్యమునకు అమితమైన ధనము కావలసియున్నది. తామనుగ్రహించి, ఒక నిధిని చూపింపుడు" అని దైన్యముగా ప్రార్థించినాడు.

"మీ మనసులో గల విషయము మాకవగత మైనది. మీకు కావలసిన నిధిని మే మిచ్చుటనే చూపగలము. కాని, మీ ప్రభువును దోడ్కొని వచ్చినచో నిధి లభించగలదు !" అని ఆ తాపసి యనినాడు.

వెంటనే సింగనమంత్రి వెళ్ళి విరూపాక్షరాయలను లోడ్కొని వచ్చి యోగులను ఏకాంతములో సందర్శించినాడు.

విరూపాక్షరాయలను చూడగనే తాపసి క్షణకాలము ధ్యాన మగ్నుడై కూర్చొని యుండినట్లు నటించి, తరువాత అనినాడు.

"మీరు సందేహమను వ్యాధితో బాధపడుచున్నారు. మీ యీ వ్యాధి సామాన్యమైనదికాదు. కాని, అందులకొక చికిత్సగలదు. బల మున్నచోట భాగ్యదేవత, బుద్ధిగలచోట సిద్ధి !"

తాపసి వాక్కులకు విరూపాక్షరాయ లాశ్చర్యపోయి చూడ సాగినాడు.

"జీవనమునకు ముఖ్యముగా మంత్రత్రయము కావలయును. అవి జనబలము, ధనబలము, దైవబలము అనునవి. మీకు మొదటి రెండును లభించగలవు. కాని మూడవదియగు దైవబలమునకు సాధన కావలయును. సాధన లేనిదే సిద్ధి లభించదు. మీ బ్రతుకు మీ చేతి యందున్నది. దానిని బంగారముగా మార్చుటయునూ-మట్టిగా మార్చుట యునూ కూడ మీ చేతిలోనే యున్నది !" అని నిగూఢముగా పలికి నాడు.

"స్వామీ ! ఇప్పుడు తమరు సెలవిచ్చినట్లుగా మే మొక మహత్తరమైన కార్యములో మునిగియున్నాము. అందులకు తమ యనుగ్రహము కావలయును."

"పరమేశ్వరుని యనుగ్రహము వలన మీరు తలపెట్టిన కార్యము నెరవేరగలదు. కాని మీరు దైవకృపకు బాత్రులు కావలయును!"

"అట్లనినచో........?"

"మీలో గల సర్వశక్తినీ యీ మహత్కార్య సాధనకై యుపయోగించి, దైవసహాయమును నమ్మి పనిచేయవలయును!"

"తమరు సెలవిచ్చినట్లు, మేము చేబూనిన మహత్కార్యమునకు జనబలము, ధనబలము గలవు. ఇక తమరు మాకు దైవబలమును సమకూర్చవలయును. మీరు మా గురువులు. దైవము మా కనుకూలించునట్లు చేయుడు!"

"అట్లు చేయవలెనన్న అష్టోత్తర శత చండికాయాగము చేయవలసి యుండును. మీ రందులకు సిద్ధముగా నున్నారా?"

"సిద్ధముగా నున్నాము స్వామీ!"

"మీ వద్ద సైన్యము లేసంఖ్యలో నున్నవి?"

"పదివేల పదాతిదళమునూ, ఐదువేల యాశ్విక సైన్యమునూ, నాలుగువందల గజసైన్యమునూ గలదు."

"మీ రాజ భాండాగారములో ధన మెంతగలదు?"

"ప్రస్తుతమున కది ఖాళీగా నున్నది. ఆ ధనమంతయునూ సైన్యమును సంగ్రహించుటకై వెచ్చించినారము. తమరు మాకు నిధిని చూపి, ఉపకారము చేయవలయును!"

"మీ హస్తము నిటు చూపుడు!"

విరూపాక్షరాయలు తన దక్షిణ హస్తమును చూపినాడు.

"మీకు లక్ష్మీ కటాక్షము బాగుగనున్నది. సామ్రాట్టులు కాగల యోగమున్నది. లక్ష్మీదేవిని నిష్ఠగా సేవించినచో మీకు నిధి లభ్యము కాగలదు."

"అయినచో గుప్తనిధి ఎచ్చట నున్నది?" కుతూహలముగా ప్రశ్నించినాడు విరూపాక్షరాయలు

"ఆ నిధి యిచ్చటనే గలదు. ఈ మంటపములోనే గలదు. దాని నేడు శిరముల నాగేంద్రుడు కావలి కాయుచున్నాడు. ఆ నిధిని వశ

పరచుకొనుటకు రక్తబలి కావలయును. క్రమమైన పూజ - హవనము, హోమము లావశ్యకములు."

"అందులకు మేము సిద్ధముగా నున్నాము."

"ఈ కార్యక్రమములో క్రమలోపము జరిగినచో మీకు నిధి లభించదు. బంగారము మట్టి కాగలదు!"

"కానిండు, మీరు నిర్దేశించిన నిధికధిపతియగు దేవతను మేము యుక్తక్రమములో వశపరచుకొనగలము."

"నిధిని పరిశోధించుటెప్పుడు?" సింగనమంత్రి ప్రశ్నించినాడు.

"రేపటి యమావాస్య దినమున అర్ధరాత్రికి సరిగా ఎవరికినీ తెలియక పూజాద్రవ్యములతో మీ రుభయులూ యిచ్చటికి రండు. నిధిని చూపెదను!"

వా రుభయులూ తాపసికి నమస్కరించి అచ్చటినుండి బయట పడినారు.

ఆయన చెప్పిన అమావాస్య దినమునకై ఎదురు చూడ సాగినారు.

అమావాస్య రానే వచ్చినది, ఆనాడు వారు నిధిని వెదకుటకై వలసిన పూజా ద్రవ్యములతో బయలుదేరి తాపసిగల మంటపమునకు వచ్చి చూచినారు. అచ్చట ఆ మౌని లేడు. ఆయనయూ, ఆయన శిష్యులునూ హఠాత్తుగా తప్పించుకొని పారిపోయినారు.

అయిననూ సింగనమంత్రి చేబూనిన కార్యమును విడువలేదు. మంటపమును త్రవ్వించి చూచినాడు. కాని, ఎచ్చటయునూ గుప్తనిధి జాడ గోచరించలేదు అతనికి లభించినది బంగారుకాదు - మట్టి!

తమ పూజలో ఏదియో లోపము జరుగుటచే బంగారము మట్టియైనదని సింగనమంత్రి పశ్చాత్తాప పడినాడు, విరూపాక్షరాయలు తమ విద్రోహపు రహస్యము బయలైనదికదా యని పరితాప పడినాడు.

# 7. కర్తవ్య బోధ

తిమ్మయామాత్యుడు విజయనగరమునకు వెనుదిరిగి మహారాణి పొన్నలాదేవికి, మల్లికార్జునరాయలకు తాను పెనుగొండలో సంగ్రహించుకొని వచ్చిన విషయము లన్నింటినీ విశదముగాతెలియజేసి నాడు. అప్పటి పరిస్థితి తామూహించిన దానికంటెనూ భయంకరముగా నున్నదనునది విని మహారాణి పొన్నలాదేవికి భీతి కలిగినది.

"అయినచో, సామ్రాజ్యములో విద్రోహాంకురము బలముగా వేరూనిన దనుమాట ? ఇప్పుడే దాని నూడదీసి వేయనిచో సామ్రాజ్య మను మహా మందిరమునకు దానివలన అపాయము తప్పదు" అని నిట్టూర్చినది.

"ఈవిద్రోహులను ఎట్లు దారికి తెచ్చుటయో తెలియకున్నది అమాత్యులూ !" అని సామ్రాట్ మల్లికార్జునరాయలు నిట్టూర్చినాడు.

"ఇప్పుడు సామ్రాజ్య మంతటా శత్రువులు నిగూఢముగను, బహిరంగముగనూ సామ్రాజ్య భద్రతకు గండము నేర్పరచుటకై కాచి యున్నారు. బహిశ్శత్రువులు ఏ ఘడియలోనైననూ మనపై దండెత్త వచ్చును. ఇటువంటి సమయములో మన వంశములోనివారగు విరూ పాక్షరాయలు వెన్నుపోటు పొడుచుటకు నిర్ణయించుకొనుట మన దుర దృష్టము !" అని మహారాణి విచారమును వ్యక్తపరచినది.

ఈ మాటలు విని తిమ్మయామాత్యుడు :

"తల్లీ ! మీ రింత స్వల్పవిషయమునకై యధైర్యపడుటయా ? పంపాపతి యింకనూ మా చేయి విడువలేదు. తమరు సామ్రాజ్యాధి ష్ఠాన దేవతలుగా నున్నంతవరకూ, యీ తిమ్మయామాత్యుని శరీరములో బొట్టు రక్త మున్నంతవరకూ రాజ్యమున కే భయమునూ లేదు. మీరు నిశ్చింతులరై యుండవచ్చును" అని సమాధాన పరచినాడు.

"నా చింతకు కారణము వేరు అమాత్యులూ ! కీర్తిశేషులైన సామ్రాట్టుల కాలములో సామ్రాజ్యమొక ఘటమువలె యుండి,

యిప్పుడు మన దురదృష్టమువలన ఎటు జూచిననూ విద్రోహపు టగ్ని రగులుచున్నది. ఇది శుభసూచన కాదు. సామ్రాజ్యమున కేదియో యొక విపత్తు రాగలదనుటకు మున్సూచన. దీనిని తిలకించినచో, ప్రజలకు మనపై విశ్వాసము నశించగలదని తోచుచున్నది...." అని బాధగా అనినది.

"తల్లీ! మీ రెందులకా విధముగా అనుకొనవలయును. ఇప్పుడు ఏమి జరిగినదని మీ రింతగా వగచుచున్నారు?...."

"ఇంకేమి జరుగవలయును అమాత్యులూ? నా కనులఎదుటనే మన ఉప్పు తినిన స్వామినిష్ఠాసేవకులు ద్రోహము దలచుటకు నిశ్చయించియున్నారు. ఒకవైపు కులశత్రువులైన విరూపాక్షరాయలు మనపై కత్తిగట్టియున్నారు. వేరొకవైపు ఆ సాళ్వనరసింహనాయకుడు సింహాసనముపై కన్నువేసియున్నాడు. ఈ ఉభయుల పోరాటములో సామ్రాజ్యపు గతి ఏమి కాగలదోనని భీతిగా నున్నది...."

"ఈ విద్రోహమునకు తమరు భీతిల్లవలసిన పనిలేదు. మనమిపుడే ద్రోహులపై దండెత్తి వెళ్ళి, వారిని శిక్షించి రావలయును. పరిస్థితి మన చేయి జారిపోవచ్చును." అని మల్లికార్జునరాయలనినాడు.

ఈ మాటలు విని తిమ్మరుసుయామాత్యుడు దీర్ఘమైన యాలోచనలో మునిగినాడు.

అతని ముఖమునుజూచి పొన్నలాదేవి:

"ప్రస్తుతపు యీ విషమ పరిస్థితిలో మన మేమిచేయవలయునని మీ సలహా, అమాత్యులూ!" అని ఆతురతలో ప్రశ్నించినది.

"తల్లీ! ద్రోహు లెవరైననూ సరియే, వారిపై శస్త్రమును ప్రయోగించవలయుననుట నిజమే. కాని, బహిశ్శత్రువులు మనపై దండెత్తి వచ్చుచుండగా, మనమంతశ్శత్రువులను విజృంభింపజేయుట వివేకము కాదు. ఉపాయముగా విరూపాక్షరాయల యొక్కయూ, నరసింహనాయకుని యొక్కయూ విద్రోహాంకురమును బీజముగా నున్నపుడే నాశమొనర్చి, వారివలన సామ్రాజ్యమున కే యాపదయునూ కలుగ

కుండునట్లు చేయవలయును. రాజ్యక్షోభ కవకాశ మివ్వక విద్రోహుల శక్తి నణచవలయును" అని తిమ్మయామాత్యు లనినాడు.

"వారి నెదుర్కొనక ఈ పని ఎట్లు సాధ్యమగును ?" పొన్నలా దేవి ఆశ్చర్యముతో ప్రశ్నించినది.

"ఇందులోనే మన ప్రజ్ఞ - రాజతంత్రము లణగియున్నవి. మనము విద్రోహాంకురమును విద్రోహపు ఖడ్గముతోడనే ఛేదింప వలయును."

"తమ మాటలు నా కర్థమగుటలేదు...."

"తల్లీ : ఇపుడు విరూపాక్షరాయలూ, సాళ్వ నరసింహనాయకులూ చేయుచున్న విద్రోహము మనకు తెలియదని వా రనుకొనుచున్నారు. మనమునూ యట్లే ఉపాయాంతరముగా వారిని రాజధానికి ఆహ్వానించి, మోసముతో పట్టి బంధించి చెరలో వేయవలయును."

"వారిని మనము మోసముతో పట్టి చెరసాలలో వేసినంతమాత్రమున వారి విద్రోహము ప్రజల కెరింగించినట్లు కానేరదు. అమాత్యులూ : వారిపై సదభిప్రాయము కలిగియున్న ప్రజలు మనపై తిరుగబడుటకు మనంతట మనమె యవకాశమిచ్చినట్లు కాగలదు. అంతియే ! దీనిచే సామ్రాజ్యపతనము సన్నిహితమగును. అందువలన వారి బలము నణచుటకై మనము వేరొకమార్గ మనుసరించు టుత్తమము." అని మహారాణి పొన్నలాదేవి యనినది.

"అట్లయినచో నా కొక ఉపాయము దోచుచున్నది తల్లీ ! అది కార్యగతమైనయెడల సామ్రాజ్య మీ శత్రుద్వయము బారినుండి సురక్షితముగా తప్పించుకొనగలదు." అనినాడు అమాత్యుడు.

"ఏమది, అమాత్యులూ !"

"విరూపాక్షరాయలు సామ్రాజ్యసేవ చేయుటకై ఒక యవకాశ మిమ్మని యిదివరకే కోరియున్నారు. వారి కోరికను నెరవేర్చుటకై సమ్మతించునట్లు నటించి సామ్రాజ్య రక్షణాభారమును వారిపై మోపినచో, వారు మన యధీనములో నుండగలరు. అట్లు చేయుటచే వారు

తమ విద్రోహాచరణకు పూనుకొనుట కవకాశము లభించదు...."

"ఇది ఉచితమైన సలహాయేకాని, తమ యధికారమును దుర్వినియోగ పరచుకొని వారు మనపై తిరుగుబాటు చేసినచో గతి ?" మహారాణి అనుమానమును వెలిబుచ్చినది.

"మనము వారిని శత్రువులైన బహమనీసుల్తాను మరియూ ఉత్కళ గజపతుల మీదకు బంపుదము. ఇట్లొనరించుటచే వారి జయాపజయములు మన కనుకూలములు కాగలవు."

"ఒకవేళ యీ యుద్ధములో విరూపాక్షరాయలు విజేతలై విజయనగరముమీద దండెత్తి తామే నిజమైన సామ్రాట్టులని చాటించుకొనినచో వారినడ్డు శక్తి మనకు గలదా ?"

మహారాణి మాటలలో సంశయము గోచరించు చుండుటను జూచి, తిమ్మయామాత్యుడనినాడు:

"అటువంటి సమయములో సామ్రాజ్యమునూ, సింహాసనమునూ రక్షించుటకు మన సైన్యములు సర్వదా సిద్ధముగా నుండగలవు! మీరా విషయమై చింతింప బనిలేదు !"

"అమాత్యులూ ! మీ ధైర్యము నాకులేదు. కాని సామ్రాజ్యము యొక్క ప్రస్తుతపు విపన్నావస్థలో ఏ విధముగా చేసిన క్షేమకరమో ఆ యధికారమును మీ కప్పగించుచున్నాను. సామ్రాజ్యము నీ విషమ పరిస్థితినుండి తప్పించెడి బాధ్యత మీయది." అని మహారాణి మల్లికార్జునుని వైపు చూడగా, అతడు చూపులతోనే తన సమ్మతిని తెలియ జేసినాడు.

కొంతసేపు అందరునూ మౌనము ధరించినారు.

"అయినచో విరూపాక్షరాయలను సముఖమునకు రావలసినదని యాజ్ఞాపించెదమా ?" అని మల్లికార్జునరాయ లడిగినాడు.

"తొందరపడకు నాయనా ! మనము వారినిచ్చటికి రావలసినదని లేఖవ్రాసి బంపినంత మాత్రాన కార్యము చక్కబడదు. వారు మనలను సందేహించి, యిచ్చటికి రాకపోవచ్చును. కాబట్టి మనమే వారి వద్దకు

వెళ్ళవచ్చును మంచిది" పొన్నలాదేవి తన యభిప్రాయమును వ్యక్త పరచినది.

"ఏమీ, నేను సామ్రాజ్ఞిగా నుండియూ, ఆ ద్రోహియగు విరూపాక్షరాయల వద్దకు సామ్రాజ్యభిక్ష నర్థించుటకై వెళ్ళవలయునా ?"

"శాంతిభిక్ష నర్థించుటకై మనము పెనుగొండకు వెళ్ళినంత మాత్రమున ఏ యవమానమునూలేదు, నాయనా ! కాని మనము ఉపాయముగా యీ కార్యమును సాధించవలసి యున్నది. తీర్థయాత్రలకై బయలుదేరిన వారివలె నటించి, తిరుపతినుండి పెనుగొండకు వచ్చినట్లుగా చెప్పి, విరూపాక్షరాయల అంతరంగమును భేదించి చూడవలయునని యున్నాను. మన మచ్చట నుండగనే సాళ్వ నరసింహనాయకుని పిలిపించి, అతని శక్తి - సామర్థ్యములను, హృదయాంతరాళపు మోస తలంపులను ప్రత్యక్షముగా గ్రహించి వచ్చుట మంచిది. అందువలన నీ వీ తీర్థయాత్రలో భాగము వహించవలయునని నా సలహా—" అని పొన్నలాదేవి మల్లికార్జునరాయలతో ననినది.

ఇది ఉచితమగు సలహాయేయని తిమ్మయామాత్యుడు చెప్పిన పిమ్మట మల్లికార్జును డందులకు సమ్మతించినాడు. అనంతరము తాను పండితగోష్ఠికి వచ్చునట్లుగా చెప్పినమాటను తలచుకొని అతడు వారి వద్ద సెలవు గైకొని వెళ్ళినాడు.

మల్లికార్జునరాయలు వెళ్ళిపోయిన తరువాత, ఆవైపునే చూచుచూ నుండిన పొన్నలాదేవి నిట్టూర్చినది. అమాత్యునితో అనినది.

"అమాత్యులూ ! నాకు కుమారుని గురించిన చింతయే పట్టి బాధించుచున్నది. ఇంత వయసు వచ్చిననూ అత డింకనూ బాలుడుగనే తోచు చున్నాడు."

"ఎందులకు తల్లీ ?"

"అమాత్యులూ, మీతో దాపరిక మెందులకు ? సార్వభౌముని

విషయములో మీ యభిప్రాయ మేమియో నిస్సంకోచముగా చెప్పుము."

"అనగా ?...."

"అతనికి నిజముగా సామ్రాజ్యము దక్షతతో పరిపాలింపగల శక్తి సామర్థ్యము లీ జన్మలో రాగలవా ? రాజకీయ జటిలతనూ, రాజ్య పాలనమునూ యశోవంతముగా తానే నిర్వహించగలడా ?"

"తల్లీ, తమ రన్యథా భావించనిచో...."

"చెప్పుడు, అమాత్యులా ! మీ మనోగతము నెరుంగవలయు ననియే మీతో యీ ప్రస్తావన తెచ్చినాను."

"తల్లీ, మల్లికార్జునరాయలు పొరబాటున సార్వభౌములుగా జన్మించినారు. వారు పరివ్రాజకులుగా జన్మించవలసినవారు...."

"మీ మాటలు నా కర్థమగుట లేదు. వివరముగా చెప్పుడు."

"వా రెప్పటమైనా రాజాస్థానములో పండితులుగానో, కవులు గానో వుండవలసినవారు. లేదా ఏదియే నొక గురుకులమునకు కుల పతిగా పుట్టవలసినవారు — పొరబాటున సార్వభౌముని గర్భమున జనించి, అధికార సూత్రములను చేబట్టియున్నారు. యిది వారి దుర దృష్టము. అంతియే !"

"ఎందులకు, అతనికి రాజ్యపాలన మందాశక్తి లేదా ?"

"తల్లీ ! వారికి రాజ్యపాలనా భారమొక్కటి విడచి తక్కిన విషయము లన్నిటియందును ఆసక్తిగలదు. కాని, రాజకీయములలో వారింకనూ అనుభవము లేనివారు. తెల్లగా నున్నదంతయునూ పాలని యనుకొను స్వభావము గలవారు. ఏదియునూ దాచుకొనక వివ రించి చెప్పెడి మనస్తత్వము గలవారు. వారు రాజ్యపాలనము చేబట్టి అనేక వర్షములు గడచినవి. కాని, వారికింకనూ యీ రాజకీయ తంత్ర ములు హస్తగతమైనట్లుగా తోచలేదు. రాజకీయములకంటెనూ వారికి కావ్యపఠనము, పండితగోష్ఠి, కోవిదులతోమైత్రి, యిత్యాదుల యందా సక్తి మెండుగా గలదు. ధర్మజిజ్ఞాసలో వారు కీర్తిశేషులైన సార్వభౌము లను మించియున్నారు. ఏమైనా రాజకీయములను జటిల విషయములు

ఏర్పడినపుడు, తలపై చేతులు మోపి కూర్చొనెదరు. ఇటువంటివారీ సామ్రాజ్య భారమును మోయుటకెప్పుడు సిద్ధపడగలరో ఆ సర్వేశ్వరునికే తెలియవలయును!" అని నిట్టూర్పు విడచినాడు.

"అమాత్యులా! రాజకీయములు నేర్పించిన వచ్చెడి విద్యకాదు. కుమారునికి అందులో నాసక్తిలేదు. తెలుసుకొన వలయునను కుతూహలముకూడ లేదు. ఏమైననూ విపత్తు ఎదురైనచో, 'నేను సామాన్య మానవుడనుగ బుట్టియుండిన బాగుండెడిది' అని పరితపించును. ఈ భవసాగరమును దాటు నుపాయ మేదని చింతించును. ఇటువంటి వానిని నమ్మి మనము కీర్తిశేషులైన సామ్రాట్టుల కిచ్చిన వచనమును పాలించవలసి యున్నది" అని పొన్నలాదేవి విషణ్ణురాలై యనినది.

"నాకు కూడ యీ విషయమనేక పర్యాయము లనుభవములోనికి వచ్చినది తల్లీ! కీర్తిశేషులైన సామ్రాట్టులు దక్షులగు పరిపాలకులు గనూ, పరివ్రాజకులుగనూ యుండిరి. కుమారులు కేవలము విరాగులు గనే యున్నారు."

"అమాత్యులా! మన మతనికి మల్లికార్జునుడని పేరుపెట్టుటయే అపరాధమైనదేమోనని నాకు దోచుచున్నది. అతనికి ధర్మగ్రంథముల వ్యాసంగములోగల యాసక్తి రాజ్యపాలనము నందులేదు. ఎప్పుడునూ విరక్తునివలె మాటలాడుచూ నుండును. పరలోక సాధనావిషయ చింతనునై యుండును. అతనికి యైహిక జీవనమున కంటెనూ ఆముష్మిక జీవనమే ఎక్కువ సుఖకరముగా నున్నట్లు దోచుచున్నది."

"తల్లీ! సామ్రాట్టులు మీ రనిన గుణములను గలిగి యుండిరి. కాని వారెన్నడునూ తమ కర్తవ్యమును మరువలేదు. ఐహికజీవనమును తిరస్కార భావముతో చూడలేదు. ఇహపరముల సమన్వయమును వారు తమ జీవనములో వెలయింపజేసినారు. అందువలననే వారు మహా సామ్రాట్టులై ప్రకాశించిరి. వారివలెనే కుమారులునూ కావలయునని, భావించియుండిన నా యాశ కేవలము ఆశగానే మిగిలిపోవునట్లుగా తోచుచున్నది."

"ఇదియేగాక మరొక వదంతికూడ విన్నాను...."

"ఏమి పదంతి తల్లీ ?"

"సార్వభౌములు తల్లిచేతి కీలుబొమ్మ లైనారు. వారికి స్వతంత్ర వ్యక్తిత్వము లేదు— అని అధికారులు గుస గుసలు పోవుచున్నారట. ఈ విషయము గూఢచారులు చెప్పగా విన్నప్పుడు నాకు కలిగిన వ్యథ వర్ణింప దరముకానిది. కాని, కుమారుడు స్వయముగా పరిపాలన నిర్వహించుటకు సమర్థుడు కాకపోవుటచే యింతటి అపవాదమును వినవలసి వచ్చినది అమాత్యులా !" అని మహారాణి బాధగా అనినది.

చాల దినములుగా హృదయములో బాధించుచూ నుండిన యీ విచారమును అమాత్యున కెరిగించగా ఆమె హృదయము తేలిక పడి నట్లు తోచినది. అది ఒక విధముగా ఆమెకు దారుణ యాతనగా కూడ నైనది. ఇటువంటి మాటలు వినుట కామె యిష్టగించలేదు. కాని, ప్రస్తుత పరిస్థితిలో అది సత్యమే యైనది. ఈ యపవాదును నివారించు కొనుటకైననూ కుమారుడు దక్షతగల పరిపాలకుడై, రాజ్యసూత్రము లను చేబూను టనివార్యమైనది.

"తల్లీ ! మీరు యదార్థమునే వివరించుచున్నారు. ఇటువంటి కుమతుల వాక్కులను నేనుకూడ విని చాల బాధపడినాను. కాని, ప్రస్తుత పరిస్థితిలో మనమేమి చేయగలము ? సామ్రాజ్యమును కబ ళించుటకై చుట్టునూ శత్రువులు కాచుకొని చూచ్చొనియుండగా, మనము బలయుతులము కానిచో సామ్రాజ్యము నిలుచు టెట్లు ? మేము సార్వ భౌముల కిచ్చిన మాటను దక్కించుకొనుట కైననూ, అధికారములో నుండవలసి యున్నది...." అని విచారమును వ్యక్తపరచినాడు తిమ్మయామాత్యుడు.

ఇంతలో చెప్ప రప్పించినవానివలె మల్లికార్జునుడే అచ్చటికి వచ్చినాడు.

"అమ్మా ! మీ సమాలోచన మింకనూ పూర్తియైనట్టుగా లేదు. ఈ రాజకీయ గొడవ లెంత మాటలాడిననూ తరుగవురెండు. ఈ సాయంకాలము మన శ్రీ కంఠ శర్మగారు తాము నూతనముగా రచిం చిన వ్యాఖ్యానమును చదివెదరట. వారు ఘన పాఠకులు. 'తార్కిక

సింహు'లని పేరుగాంచినవారు. విద్యారణ్యులవారి 'సర్వదర్శన సంగ్రహము' నకు వ్యాఖ్యానమును రచించినారు. దాని నిపుడు పండితుల సముఖమున పఠింతురట. అమాత్యులూ! మీకు యితరమైన పని ఏమియునూ లేనిచో, మా వెంట మీరునూ రండు. ఈ విద్వత్సభ యొక్క రుచి మీ కింకనూ తెలిసియున్నట్లు లేదు. ఈ రోజు రండు అమాత్యులూ!"

ఈ మాటలకు మహారాణి అమాత్యుని ముఖమవలోకించి నిట్టూర్పు విడచినది.

వా రుభయులూ మ్లానవదనులై కూర్చొని యుండుటను జూచి మల్లికార్జునరాయలు :

"అమ్మా! మీ రీ నా డెందులకో ఒక విధముగా నున్నారు. ఎందులకమ్మా? నా వలన అపరాధ మేమైననూ జరిగినదా?" అని సంశయపడుచూ అడిగినాడు.

"ప్రభూ! మేము మీ విషయమును గురించియే ఆలోచించుచున్నాము. ఇంతలో మీరే వచ్చినారు" అనినాడు అమాత్యుడు.

"అమ్మా, మీరు రాజకీయములను తలలో నింపుకొని చింతించుట మంచిదికాదు. దానికికూడ సమయసందర్భము లక్కరలేదా?..."

"ఔను, నాయనా! నీ వలెనే మేముకూడ రాజకీయములను విడచి సదా సాహిత్యము, సంగీతము, విద్వద్గోష్ఠియని ప్రొద్దుగడుపవలసినది. కాని విధాత మా నుదుట అది వ్రాయలేదు...." మహారాణి మాటలలో వ్యంగ్యము ధ్వనించినది.

తల్లి మాటలకు మల్లికార్జునరాయలు చకితుడైనాడు, తల్లి మాటలలో ధ్వనించిన నిరుత్సాహమును గ్రహించి, విసుగా అతడనినాడు.

"అమ్మా! నే నిట్లను చున్నానని మీ రన్యథా భావింపకుడు. నిజము చెప్పవలయుననినచో నాకీ రాజ్యపాలనమున కంటెనూ, శుష్క రాజకీయములకంటెనూ - సంగీత, సాహిత్యములందునూ, విద్వాంసులతో చర్చలు జరుపుట యందునూ, వేదాంత విచారము లందునూ

నెక్కుడాసక్తి గలదు. కాని. వాటికి నర్పితము చేసుకొని, అందులో లీనమగుటకు నే నంతటి యదృష్టమును పొందిరాలేదు!" అని అతడు కూడ విచారముగ నుడివినాడు.

కుమారుని మాటలకు పొన్నలాదేవియు, తిమ్మయామాత్యుడును విస్మితులై ఒకరి వదనములు మరియొకరు చూచుకొనినారు.

"ఇటువంటి మాటలను మేము నీ నుండి – విజయనగర సార్వభౌములనుండి – నిరీక్షించలేరు నాయనా!" అని క్షణకాలానంతరము పొన్నలాదేవి మరల:

"నీ వనినట్లు మేము సామ్రాజ్య విముఖులమై కూర్చొనినచో, యీ రాజ్యరమ మూడురోజులు జీవించనేరదు!" అని తిరస్కార భావముతో యనినది.

"అది భగవదేచ్ఛయైనచో, ఎవరు మాత్రము తప్పింపగలరు? మీరు తప్పించగలరా?"

"తప్పించుటయూ, తప్పించకపోవుటయూ వేరుసంగతి నాయనా! అన్నియును భగవదేచ్ఛ ప్రకారము జరుగగలవు. కాని మనము పురుష ప్రయత్నము చేయనిదే దైవమునునమ్మి ప్రయోజనమేమి? మన కర్తవ్యమును త్రికరణ పూర్వకముగా నిర్వహించి, తరువాత దైవ శాసనమును నమ్మవలయును. అటువంటివారినే భగవంతుడనుగ్రహించ గలడు కాని, చేతులు ముడుచుకొని కూర్చొనెడి సోమరిపోతుల నను గ్రహించడు!"

"అమ్మా! మీరు చెప్పనలచిన విషయమును స్పష్టముగా జెప్పుడు ఇటువంటి సూటిపోటు మాటలతో నన్ను చంపకుడు:"

ఈ మాటలకు పొన్నలాదేవికి పిడుగుపడినట్లయినది. అయినను ధైర్యమవలంబించినది. సత్యము కటువుగా తోచినను దానిని తెలియజెప్పుటకు నిశ్చయించినది.

"కుమారా! ఇటువంటి దినముకొరకే నే నెదురు చూచుచుంటిని, అది త్వరలోనే వచ్చినది; చాల సంతోషము. నా మాటలను శ్రద్ధగా ఆలింపుము! నీకు వయస్సు అయినది. నీవు బాలుడవేమి కావు, భార్య

వచ్చినది - బిడ్డలు గలిగినారు. అయిననూ నీవు జీవితములో యింకనూ బాలునివలెనే యున్నావు. ఇంతవరకునూ నీవు జీవితములో ఏమైననూ సాధించితివా ?"

"సాధించున దేమున్నది ? అందరివలెనే నేనునూ వివాహము చేసుకొన్నాను. పిల్లలు కలిగినారు. నా జీవితము సుఖ శాంతులలో కూడి యున్నది. నేను జీవన పథమును సద్గ్రంథ పఠనమునుండి గ్రహించినాను. వాటి వ్యాసంగమునూ, విద్వాంసుల సహవాసములునూ నాకు జీవితములో శాంతిని-తృప్తిని కలిగించినవి. సంగీత. సాహిత్యాది లలితకళలు నా జీవితమును, బ్రతుకుయొక్క విలువనూ హెచ్చించినవి. మానసమును సంస్కరించినవి. ఒక్కమాటలో చెప్పవలయు ననినచో నేను సత్యశోధకుడనైనాను. జీవితమందలి శతానేకములైన సుఖ-దుఃఖములనడుమ, ఆశ - నిరాశల మధ్య, సమతలముగా ప్రవర్తించు టెట్లని నేర్చుకొన ప్రయత్నించినాను. ఇంతకంటెనూ గొప్ప సాధనను నేను ఏది సాధించవలయును ? నాపై మీ రుంచియున్న నమ్మకమునూ, నిరీక్షనూ నేను విఫలమొనరించియుండినచో మీరు నన్ను క్షమించవలయును."

మల్లికార్జునరాయలు నెమ్మదిగా అనినాడు. ఆతని ధ్వనిలో ఉద్వేగము లేదు. సత్యమును గ్రహించిన. జీవన యాత్రికుని అనుభవ వాణియొక్క నిరుద్వేగ మా పలుకులలో ధ్వనించినది. ఈ మాటలు విని పొన్నలాదేవికి నిజముగా ఆశ్చర్యమైనది. కుమారునియొక్క యీ హృదయ పరిచయ మీ విధముగా ఆమె కెప్పుడునూ కలిగియుండలేదు. అమాత్యునినూ, ఆమెయూ విస్మితులై చూచుచున్నారు.

"నాయనా ! అది నీ వైయక్తిక జీవితాదర్శము- నీవుపొందిన సిద్ధిని గురించినమాట. సార్వభౌముడుగా నీవు నీ కర్తవ్యములో దేనిని సాధించినా వనునది నా ప్రశ్న ?"

"అమ్మా. నేను సింహాసన మధిష్ఠించి పదునారు సంవత్సరము లైనవి. ఈ దీర్ఘ వ్యవధిలో నేను ప్రజలను కన్నబిడ్డల వలె పోషించినాను."

"నీవు ప్రజాపాలన చేయలేదని చెప్పుటలేదు. కాని, నీవు రాజ్య పాలనము చేయలేదు! నీ పరముగా ఆ కార్యమును అమాత్యులు నిర్వహించినారు. నీవు రాజ్యపాలనమున గలుగు నూరారు జటిల సమస్యలను పరిష్కరించుట కెప్పుడైననూ ప్రయత్నించినావా? దక్షతగల సార్వభౌముడని బిరుదు గాంచుటకై ప్రయత్నపడినావా?"

ఈ మాటలకు మల్లికార్జునరాయలు వెంటనే జవాబు చెప్పలేదు.

"ఇదివరకూ నీ జీవితము వ్యర్థముగా గడచినది. ఇంకనూ ఎన్ని సంవత్సరము లీవిధముగా నిరర్థకముగా గడుపవలయుననియున్నావు?" పొన్నలాదేవి పలుకులలో కటుత్వము ధ్వనించినది.

ఈ సూటి మాటలను విని మల్లికార్జునరాయలు బాధజెంది అనినాడు:

"అమ్మా! నా వలన యపరాధమేమైననూ జరిగియున్నచో చెంపదెబ్బ కొట్టి బుద్ధిజెప్పుడు కాని, ఈ విధమైన వాగ్బాణములతో నన్ను బాధింపకుడు. ఇపుడు నేనేమి చేయవలయునో చెప్పుడు:"

పొన్నలాదేవి అనినది:

"చూడు. నాయనా! దాచిపెట్టి చెప్ప ప్రయోజనములేదు. నీవు సామ్రాట్ పదవి నధిష్ఠించి దీర్ఘకాలమైననూ స్వతంత్రముగా రాజ్యమును పాలించుటను నేర్చుకొనలేదు. అందుచే మా కందరకూ నిరాశగా నున్నది. నీకు సంగీత, సాహిత్య తత్త్వశాస్త్రములపై గల యాసక్తి రాజ్యపాలనమునందు లేదు. రాజ్యపాలనా విషయములో నీ వింకనూ పసివాడవు. నీవు సామ్రాట్ ప్రౌఢదేవరాయల పుణ్య సంతానమను మాటను మరచినట్లున్నావు. నీకు సార్వభౌమ పదవి కావలయును. కాని దాని బాధ్యత మాత్ర మక్కరలేదు. సార్వభౌమ పదవిని నీ విలాస, వైభవములకు గల యవకాశమని భావించియున్నచో, ఆ నీ భావన తప్పు. సింహాసనము పిరికిపందల కొరకై ఏర్పడియుండలేదు - అది [illegible] సింహాసన మధిష్ఠించిన వ్యక్తి వేయి విధములైన చింతల కాలవాలమైన మనుజుడు. అతడు ధరించునది వజ్రకిరీటమేయైననూ అది కంటకములతో కూడినదని

భావించవలయును. అతడు సామ్రాజ్యమున కధికారి మాత్రమే కాడు. సేవకుడు కూడాను. ప్రజలను శత్రుభీతి లేకుండ కాపాడగల ప్రభువను విషయమును నీవు మఱవకుము.

"నే నిపుడు నీకు రాజనీతిని ఉపదేశించుట లేదు. స్వతంత్ర సామ్రాట్టువు కమ్మని యనుచున్నాను. భిక్షుడగు పరిపాలకుడవు కమ్మని యాశీర్వదించుచున్నాను. నీపై కీర్తిశేషులైనసార్వభౌములు, ప్రజలు వుంచిన నమ్మికను వ్యర్థపరచక, ఆదర్శప్రభువగుటకు ప్రయత్నింపుము! నీ వైయక్తికపు ముక్తికంటెనూ, సామ్రాజ్య ప్రజలయొక్క ముక్తివైపు దృష్టి మరల్చి, వారి క్షేమమునే నీ క్షేమమని దలంచుము. మేము ఈనాడున్నాము. రేపు ఉండమో లేదో చెప్పుట కష్టము. మేము గతించిన తర్వాత నీవు అనాథవనుకొనుటకంటెనూ, యిప్పుడే స్వతంత్ర వ్యక్తివై, నీ పాదములపై నీవు నిలబడుటను నేర్చుకొనుము. సామ్రాజ్య కార్య మగాధమై యుండగా నీవు అల్పతృప్తిని వదలి, పెద్దల యాదర్శము నూతగా గొని మహాపురుషుడువుగా జీవించుము. ఇదియే నేను నీకు చెప్పు మాట. ఈ మాటలు నీకు బాధను కలిగించియున్నచో ఉద్దేశపూర్వకముగా అనినవి కాదనియు, నిన్ను నీ కర్తవ్యము వైపునకు నడుపుటకై ఆడిన ఆవేశ భాషణములనియు గ్రహించుము" అని తన మాటలను ముగించినది పొన్నలాదేవి.

మల్లికార్జునరాయలకు తొలిసారిగా తాను నిలచియున్న భూమి లోలోపలికి కృంగిపోవుచున్నట్టుగా తోచినవి. అత డపరాధివలె అమాత్యునీ, మహారాణినీ అవలోకించినాడు. తల్లి వదనములో అతనికి కోపమునకంటెనూ, మాతృప్రేమ యొక్క అభయ చిహ్నము గోచరించినది.

"అమ్మా! నా యపరాధమును క్షమింపుడు." అను మాటలతని నోటివెంట వెలువడినవి. అంతకంటెనూ ఎక్కుడుగా మాటలాడుట కతని కంఠము గాద్గదికమైనది.

# 8. క్షేత్రయాత్ర

మహారాణి పొన్నలాదేవి తమ ప్రయాణోద్దేశమును రహస్యముగా నుంచుటకై, క్షేత్రయాత్రయను నెపముతో పెనుగొండకు వచ్చినది.

పూర్వమునుండియు సంగమ వంశ ప్రభువులు తిరుపతి శ్రీ వెంకటేశ్వర స్వామియొక్క భక్తులు. వారు ఏడుకొండలవానికి అనేక విధములగు యాభరణములను చేయించి యిచ్చి తమ భక్తిని ప్రకటించుకొన్నారు. మడులు-మాన్యములను యిచ్చి స్వామి కైంకర్య మునకు సాయపడినారు. స్వభావతః భగవద్భక్తురాలైన పొన్నలాదేవి సామ్రాట్ మల్లికార్జునరాయలతో క్షేత్రయాత్రకై బయలుదేరుట ఎవరికినీ సందేహాస్పదము కాలేదు.

పొన్నలాదేవి తిరుపతి, కాళహస్తి యీ ఉభయ క్షేత్రములను సందర్శించుకొని రాజధానికి వెనుదిరుగు దారిలో పెనుగొండయందు కొంతకాలము నిలచినది. ప్రయాణ బడలికను దీర్చుకొనుటకై కొన్ని రోజుల విశ్రాంతి ఆవశ్యకమైనది. సామ్రాజ్యమునకు రెండవ రాజ ధానివలె నుండిన పెనుగొండలో సార్వభౌముల విశ్రాంతికి తగిన అను కూలములగలవు. అప్పటినుండి తాము ముఖ్యాయి క్షేత్రమునకు ప్రయా ణించ వలయుననుకొని యున్నట్టూ, తమ నీ ప్రయాణ సందర్భమున వచ్చి కలుసుకొనవలసినదనియూ, సాళ్వ నరసింహనాయకున కొకలేఖ బంపినది —

మహారాణి పొన్నలాదేవి ఏ వార్తయునూ తెలుపక సార్వభౌము నితోబాటు హఠాత్తుగా పెనుగొండకు వచ్చుటను జూచి తొలుత విరూ పాక్ష రాయలకు భీతికలిగినది. తన విద్రోహము సార్వభౌమునికి తెలిసి నదేమోనను సందేహముకూడ పొడసూపినది. కాని మహారాణియే అతని సంశయమును పోగొట్టినది.

"విరూపాక్షరాయలూ ! మా కుమారులకు పుణ్యక్షేత్రములైన తిరుపతి - కాళహస్తిని చూచిరావలయునను కోరిక కలిగినది. అందు

లకై వెళ్ళి ఆ క్షేత్రములను దర్శించి వచ్చినాము. రాజధానికిమరలుచూ మీరు తలంపునను వచ్చుట చేతనూ, మీరపుడపుడూ పెనుగొండకు రావలసినదని మాకు ఆహ్వానములు బంపియుండుటచేతనూ. చూచుకొని వెళ్ళుదమని వచ్చితిమి" అనినది బొన్నలాదేవి.

"తమయొక్కయూ, స్వాములయొక్కయూ పాదధూళిచే పెనుగొండ పావనమైనది" అని యన్నాడు చిరునవ్వును చిందించుచూ విరూపాక్షరాయలు.

"అది గొప్పమాట. మేము మీ విశ్వాసమునకు కట్టువడి వచ్చినారము. ఇందున విశేష మేమియునూ లేదు" అన్నది బొన్నలాదేవి.

"మహారాణిగారూ! తిరుపతి, కాళహస్తివంటి పుణ్యక్షేత్రములను సందర్శించి వచ్చిన తమ పాదధూళిచే మా రాజధాని పావనమైనదనినచో, అతిశయోక్తిలేదు. మిమ్ములను చూచిన మాకు క్షేత్రయాత్ర చేసిన పుణ్యము సులభముగా లభించినది" అని అమాత్యసింగన నాయకుడు నవ్వినాడు.

అంతటి పొగడ్తలకు మేము పాత్రులము కాము. సింగన మంత్రిగారూ!" అని మహారాణి నవ్వినది.

"విరూపాక్షరాయలు రాజా తిథులను వారికి తగిన అంతఃపురములలో విడిది చేయించినాడు. వారి యుపచర్యలకు స్వయముగా తానే నిలచినాడు —

కొన్ని దినములు ఏ విషయ చర్చలునూ అవకాశము లేక విశ్రాంతిగా గడచినవి.

అనంతర మొక రోజు సింగనమంత్రిలో కలసి విరూపాక్షరాయలు మహారాణిగారిని సందర్శించి మాటలాడినాడు.

"మహారాణిగారూ! రాము కేవలము యాత్రార్థమై యిప్పటికి రాలేదని మాకు తెలిసినది. తమరు దాపరికము లేక, యిప్పటికి వచ్చిన యుద్దేశము నెరిగింప ప్రార్థన!" అన్నాడు.

"మీరు మా యుద్దేశము నింత త్వరలో గ్రహించినందులకు

సంతోషము! కాని, మా రహస్యము మీ కెట్లు తెలిసినది?" ఆశ్చర్యముతో ప్రశ్నించినది పొన్నలాదేవి.

"ఆ మాత్రము తెలుసుకొననిచో, మేము మండలేశ్వరులమై యుండి ప్రయోజనమేమి? కారణము లేనిదే తమరు సార్వభౌములతో పాటు యిచ్చటికి వచ్చెడివారు కారని మాకు తెలియదా?"

"అయినచో. యిక మీవద్ద దాపరిక మెందులకు? మేము యిచ్చటికి మీ మిత్రులమై వచ్చినాము. పూర్వ మొకప్పుడు మీరు కష్ట సమయమున సామ్రాజ్యమునకు సాయపడు ఆశయమును వ్యక్తపరచి యుంటిరి. ఇపుడు రాజ్యముపై ఉత్కళ కపిలేశ్వర గజపతి దండెత్తి వచ్చుటకు నిశ్చయించియున్నాడట. అతనికి బహమనీ సుల్తానుడు సాయపడగలనని వాగ్దానము చేసియున్నాడట. వారి బారినుండి సామ్రాజ్యమును కాపాడుటకై మీ సాయ మర్థించి యిచ్చటికి వచ్చినాము."

మహారాణి మాటలు విని విరూపాక్షరాయలు తన చెవులను తానే నమ్మలేక పోయినాడు.

"సామ్రాజ్యాధిష్ఠాన దేవతవలె నున్న తాము యీ యల్ప విషయమునకై నన్ను యాచించుటయా? మీరు-రాజమాతలు-మాకు అజ్ఞాపించవలయునే కాని యాచించరాదు! ఇది మా కర్తవ్యము - సామ్రాజ్యమునకు ఆపత్కాలములో సాయపడుట ప్రతి యొక్క స్వామిభక్తి పరాయణుని ప్రథమ కర్తవ్యము!" అన్నాడు విరూపాక్షరాయలు.

"మీరు మునుపొకపరి సామ్రాజ్యసేవకై యవకాశమును వేడి వచ్చినప్పుడు మేము మిమ్ములను సరిగా గమనించలేదని మా మనసుకు తట్టినది. అందువలననే మిమ్ములను క్షమాపణ కోరుట కింతదూరము రావలసి వచ్చినది" అనినది పొన్నలాదేవి.

"ఇప్పుడైననూ మీకు నా యెడల విశ్వాస మేర్పడినదికదా— సంతోషము! ఇపుడు నా వలన మీ కే సాయము కావలయునో తెలుపుడు. తమ యాజ్ఞను శిరసావహించి నెరవేర్చెదను."

"మీ సామ్రాజ్య నిష్ఠను దృష్టియందుంచుకొనియే మేము ఆశావాదులమై యిచ్చటికి వచ్చినాము."

"ఇపుడు తమకు మా నుండి కావలసిన సాయమేదియో స్పష్టముగా వివరింపుడు"

"బహమనీసుల్తాను అల్లాయుద్దీన్ మరణించి అతని కుమారుడు హుమాయూను ప్రస్తుతము పట్టాభిషిక్తుడైయున్న విషయము మీకు తెలిసియుండును. అతడు మహా క్రూరుడు, నీచుడు, హిందూ మతద్వేషి యని లోకమునకే తెలియును. అటువంటి వానితో గలసి ఉత్కళ గజపతి స్వార్థమును సాధించుకొనుటకై నిశ్చయించియున్నాడు. గూఢచారులు కటకపురిలో జరుగుచున్న సమర సన్నాహములను మాకు తెలియబరచినది మొదలు మనశ్శాంతి నశించినది. ఈ నడుమ అతడు 'గుంటూరు' మండలమును కోరి లేఖ వ్రాసియున్నాడు, దానిని వదలకొననిచో యుద్ధము జరుగుట నిశ్చయము. ఈ సమయములో మీ సాయము కోరి నేను వచ్చినాను. మీరు తక్క అన్యు లీ సమయములో సామ్రాజ్యమును రక్షించుటకు సమర్థులు గారు."

మహారాణి మాటలకు విరూపాక్షరాయలు గర్వముగా నవ్వినాడు.

"మహారాణిగారూ! ఇంత స్వల్ప విషయమునకై భీతిల్లుటయా" అన్నాడు.

"మేము భీతిజెందుచుండుటలేదు విరూపాక్షరాయలూ! ఇప్పటికి వచ్చినపిమ్మట గూఢచారులు భయంకరమైన వార్తను తెచ్చినారు. సుల్తాను సైన్యములు గజపతి సైన్యములతో కూడుకొని, దేవరకొండ మీదుగా బయలుదేరినవట. బహుశః ఈ వేళకు దేవరకొండ వారి వశమై యుండవలయును...."

"మహారాణిగారూ! మీ రిదివరకూ నాకీ విషయమును దెలుపక చాల అన్యాయ మొనరించినారు. శత్రువులను రాజ్యములోనికి యింత దూరము ప్రవేశింపజేయక యుండవలసినది. ఇటువంటి సమయములో మీరింకనూ వూరక కూర్చొని యుండలేదు - మీ ధైర్యమునకు మెచ్చుకొనవలయును."

"మేమేమి చేయగలము? శత్రువులను అడ్డుటకై అటు తిమ్మయామాత్యులను బంపి, మేమిటు వచ్చినాము."

"తల్లీ ! మీ రధైర్య పడకుడు. మంచి సమయములో యిప్పటికి వచ్చినాడు. మీరు సామ్రాజ్యపు మహాదండనాయక పదవిని నా కనుగ్ర హించి. యాజ్ఞాపింపుడు. నేను నేడే శత్రువులపై నెత్తిపోయి. వారిని శిక్షించి వచ్చెదను" వీరావేశములో విరూపాక్ష రాయలనినాడు.

"మన సైన్యములు దుర్బలములుగానున్నవి. వాటిని నమ్మి మీరు యుద్ధమొనరించుటనిన ఆత్మహత్య చేసుకొని నట్లగును. ఇపుడు మీరు మీ శత్రువులపై దండెత్తివెళ్ళి, వారి చేతినుండి దేవరకొండను తప్పించవలయును" అనినది పొన్నలాదేవి.

"మీరేమియునూ భీతిల్లకుడు. మన సైన్యములు ఆ ద్రోహియగు సుల్తానునూ, జగపతినీ శిక్షించుటకు సమర్థములై యున్నవి" అని విరూపాక్షరాయ లుద్ఘోషించినాడు.

"ఈ మధ్య అందిన వార్తనుబట్టి, కపిలేశ్వర గజపతి గూడ సంపద్భరితమైన మన కాంచీ రాజ్యముపై కన్ను వేసియున్నాడట. అతనిని సరిహద్దు ప్రాంతముననే యడ్డుకొనుటకు ముఖ్యవాయి రాజ్యస్థ సాళ్వ నరసింహనాయకుల సాయమును పొందవలయునని యాలో చించుచున్నాను. ఈ విషయములో మీ అభిప్రాయ మేమి ?"

"ఏమీ, సాళ్వ నరసింహుని మీ రింకనూ నమ్ముచున్నారా ! ఆ స్వామిద్రోహిచేతి కీ మహత్తర కార్యభారము నప్పగింపుచున్నారా ?" ఆశ్చర్యముగా ప్రశ్నించినారు విరూపాక్షరాయలు.

"ఎందులకంత యాశ్చర్య పడుచున్నారు ?"

"అతడు సామ్రాజ్యమును కబళించుటకై కాచియున్న స్వామి ద్రోహి. అంతటి వానిని నమ్మి మీరు శత్రువులలో పోరు నప్పుటకు సిద్ధపడినారా ?"

"అత డంతరంగమున మనకు వ్యతిరేకముగా విద్రోహమును వలచు చుండవచ్చును. కాని అతనిని ద్రోహియని శిక్షించుటకే ప్రత్యక్ష ప్రమాణమునూ లేదు. మే మిపుడు మందగనే అతనిని పిలచి. విచా రించి. అతని విషయమై ఒక నిర్ణయమునకు రావలయునని యున్నాను. మీ దనిస్తు లతడొకవేళ ద్రోహియైయున్నచో శిక్షనుతప్పించుకొనలేడు."

"నరసింహనాయకుడు సామాన్యుడు కాడు మహారాణిగారూ! అతనితో నాడు యాట - త్రాచుపాముతో చేయు చెలగాటము. మీ రీ విషయములో చాల హెచ్చరిక వహించి యుండుట మంచిది," అని విరూపాక్షరాయలు తన యభిప్రాయమును వ్యక్తపరచినాడు.

"అటువంటి సమయ మేర్పడినచో, స్వామినిష్ఠా గరిష్ఠులైన తమరుండనే యున్నారుకదా !" అని సంతోషముగనే విరూపాక్షరాయలకు వీడ్కోలిచ్చినది పొన్నలాదేవి.

అతడు వెళ్ళిన పిమ్మట తమ పన్నుగడ ఫలవంతమైనదని పొన్నలాదేవి - మల్లికార్జునరాయలు సంతోషించినారు. ఇటు విరూపాక్షరాయలు కూడ తన రొట్టె విరిగి నేతిలో పడినదని ముదము జెందినాడు. అతనికి తాను మహారాణి వంటి చతురయగు వ్యక్తిని ఉపాయముగా మోసగించితిని కదా యను సంతోషము కలిగినది. తానిపుడు సామ్రాజ్యరక్షకునివలె నటించి, సింహాసనమును సులభముగా తన వశము చేసుకొన వచ్చునని భావించినాడు. నేడు తాను సామ్రాజ్యమునకు మహాదండనాయకుడు ! రేపు సామ్రాట్టు !! అతడు కోరుకొనుచూ నుండిన సదవకాశము తనకు తానై అతనిని వెదకుకొని వచ్చినది. విరూపాక్షరాయల కిపుడు స్వర్గ మరచేత నున్నట్లు తోచినది.

ఇటువైపు సామ్రాట్ మల్లికార్జున రాయల ఆజ్ఞా పత్రముతో కొందరు భటులు ముఖవాయి రాజ్యమునకు రాజధానియగు తేకల్ పట్టణమునకు వెళ్ళి, ఆ లేఖను సాళువ నరసింహనాయకునకు అప్పగించినారు.

ఆ లేఖను జూచి నరసింహనాయకుడు చకితుడైనాడు. దానిని చదువుకొని అమాత్యునివైపు తిరిగి;

"ఈశ్వరామాత్యులూ ! ఈ లేఖ యొక్క అంతరార్థ మేమి ?" అని యడిగినాడు.

ఈశ్వరామాత్యు డా లేఖను చదువుకొని ఎనలోనే నవ్వుకొన్నాడు.

ఆరేఖలో సామ్రాట్ మల్లికార్జునరాయలు, తాను మాతృశ్రీగారితో క్షేత్రయాత్రకని బయలుదేరి ప్రస్తుతము పెనుగొండలో నున్నట్లునూ, సాళ్వనరసింహనాయకులతో రహస్యముగా చర్చించవలసిన విషయము లనేకము లుంటుటచే, వారు వెంటనే బయలుదేరి సముఖమునకు రావలసినదనియూ ఉల్లేఖించినాడు.

"ప్రభూ ! ఇందులో మనకు తొందరకలుగు విషయ మేదియునూ లేదు. తమరు ధైర్యముగా పెనుగొండకు వెళ్ళిరావచ్చును." అని ఈశ్వరామాత్యు లన్నాడు.

"మనలను రాజధానికి రమ్మని యాజ్ఞాపించక పెనుగొండకు రమ్మని సార్వభౌము లాజ్ఞాపించుటకు కారణమేమి ? ఇందులో మనలను మోసగించు ప్రయత్నమేమియునూ లేదుకదా ?"

"మనకేభయమునూ లేదుప్రభూ ! సార్వభౌములు మనల నను మానించుచున్నట్లయితే, ఆ ద్రోహియగు విరూపాక్షుని సముఖములో సందర్శించుటకుకోరరు. ఇది గమనించినచో, సార్వభౌములు మననుండి ఏదియో సహాయమును నిరీక్షించుచున్నట్లు ద్యోతకమగుచున్నది. ఇందుచే సామ్రాట్టులదృష్టిలో మన గౌరవము యినుమడించవచ్చును."

"అయినచో మనము పెనుగొండకు వెళ్ళివచ్చుటయే మంచి దనుచున్నారా ?"

"ఔను, ఆపైన తమచిత్తము !"

సాళ్వనరసింహు డీ సలహాను సమ్మతించి, పెనుగొండకు వెళ్ళు టకు ప్రయాణసన్నాహములు చేసుకొనసాగినాడు.

నిశ్చయించుకొనినమేరకు శీఘ్రముగా ప్రయాణించి, సాళ్వ నరసింహనాయకుడు, ఈశ్వరామాత్యుడు పెనుగొండను చేరినారు.

వారిని విశ్వాసముతో ఆహ్వానించి, మహారాణి పొన్నలాదేవి యనినది :

"సాళ్వనరసింహనాయకులూ ! మావలన మీకు తొందర కలిగి యున్నచో క్షమింపుడు మీతో నొక ముఖ్యవిషయము చర్చించవలసి వచ్చుటచే, సత్వరమే పిలిపింపవలసివచ్చినది."

"మహారాణిగారూ! పాదసేవకులచే ఏ కార్యము కావలయునో నిస్సంకోచముగా దెలుపుడు. తమయాజ్ఞ మాకు శిరోధార్యము!" అన్నాడు నరసింహనాయకుడు.

"నరసింహనాయకులూ! ఇపుడు సామ్రాజ్యమునకు రెండు వైపులనుండియు ఆపద సంభవించినది. ఒకవైపు బహమనీసుల్తాను పరుసయూరు. వేరొకవైపు కపిలేశ్వర గజపతి మనరాజ్యముపైకి దండెత్తి వచ్చియున్నారు. కపిలేశ్వరగజపతి కాంచీరాజ్యమును కబళించుటకై యాలోచించుచున్నాడట. అతని నడ్డుకొను బాధ్యతను మీరు వహించవలయును."

"అంతటిశక్తి మాకులేదని చెప్పలేము, మహారాణిగారూ! కాని, మావద్దగల సైన్యబలముతో యీకార్యము సాధ్యమా? అని యాలోచించుచున్నాను!" అని నరసింహనాయకు డన్నాడు.

"ఏమీ, మీకంతటి ధైర్యములేదా?"

"ఇది వైయక్తికపు ధైర్యసాహసములనుగురించిన మాటకాదు మహారాణిగారూ! బలాఢ్యుడైన శత్రువును తగినరీతి నెదుర్కొని, పరాభూతుని గావింపవలసిన విషయము. మే మీ కార్యములో అపజయము పొందినచో సర్వనాశనము కాగలదని యాలోచించుచున్నాను. ఇది ఆత్రపడవలసిన విషయము కాదు తల్లీ!"

"అయినచో, మీ యభిప్రాయమేమి?"

"మన మిపుడు చేతులుకట్టుకొని కూర్చొనుట మూర్ఖత్వము కాగలదు. మన ప్రయత్నములను మనముచేసుకొని, కపిలేశ్వర గజపతిని సరిహద్దుప్రాంతముననే ఓడించి తరిమివేయవలయును. సామ్రాజ్యములో కాలిడుట కవకాశ మివ్వరాదు. మండలేశ్వరులందరూ సాయపడవలయును. అప్పుడుమాత్రమే మేము గజపతిసైన్యము నడ్డుకొనుటకు సాధ్యమగును" అని నరసింహనాయకు డనినాడు.

"విరూపాక్షరాయలు దేవరకొండమీదికి వెళ్ళవలయునని యున్నారు. మీ సైన్యములతోపాటు మీరు వారికి సాయపడవలయునని మాకోరిక !"

"ఆపనిమాత్రము సాధ్యముకాదు, మహారాణిగారూ ! మేము సామ్రాజ్యమును ఆపదలో వేయుచున్నామని మీరు భావించినను సరియే ! ఈ విరూపాక్షరాయలతో సహకరించి పనిచేయ వీలుపడదు" నరసింహనాయకుడు ఖచ్చితముగా చెప్పినాడు.

"ఎందులకు ?"

"కారణము మీరు తెలిసియుందురు. ఆ ద్రోహితోగలసి నేనునూ సామ్రాజ్యద్రోహిని కాలేను."

"మీమనసులో నున్న విషయమేమైనదీ మాకు తెలియును. ఈ సమయములో విజయనగర సామ్రాజ్యమును యీ గండమునుండి తప్పింపగలశక్తియున్నచో, అది కేవలము మీకు ఒక్కరికే నని నాభావన. మీరు విరూపాక్షరాయలను వెన్నంటియున్నచో వారిద్రోహ చింతనమునుండి సామ్రాజ్యము నెగ్గింపబడగలదని మా నిరీక్ష. మీరు మాకోరికను తిరస్కరించకుడు" అని మహారాణి దైన్యముగా ప్రార్థించినది.

"తల్లీ ! మీరు సామ్రాజ్యాధిష్ఠానదేవతలవలె నున్నారు. తమ కోరికను నిరాకరించునంతటి ధైర్యము నాకులేదు. కాని, విరూపాక్ష రాయలను సందర్శించి, అటుపైన నా నిర్ణయమును మీకెరిగించెదను." అని విశ్వాసముతోడనే మహారాణివద్ద వీడ్కోలుగైకొని వెళ్ళినాడు.

మహారాణి పొన్నలాదేవికిమాత్రము అతని ప్రవర్తనవలన కలుగవలసిన సంతోషము కలుగలేదు.

# 9. దైవనిర్ణయము

సాళ్వ నరసింహుడు తాను విరూపాక్షరాయలతో సహకరించగలనని మాట యిచ్చుటకు పూర్వము అతని నొక పర్యాయము రహస్యముగా సందర్శించి, అతని యధార్థ స్వరూప మెఱుంగవలయునని యపేక్షించినాడు. విరూపాక్షరాయల పట్ల అతనికి గౌరవభావము లేదు. తన సహోదరుడగు గోపరాజుయొక్క నాశనమునకు విరూపాక్షరాయల తండ్రి ప్రతాపరాయల రాజ్యతృష్ణయే కారణమని అతనికి తెలియును. ఈ సంఘటనతో సాళ్వ వంశమునకు మాయని మచ్చ ఏర్పడినది. ఈ కళంకమును తుడిచివేయగల అవకాశ మిప్పుడేర్పడినది. అది తన సామ్రాజ్య నిష్ఠయొక్క అగ్నిపరీక్షయనికూడ చెప్పవలసి యున్నది.

సాళ్వ నరసింహునికి సింహాసనముపై కన్ను వున్ననూ, విజయనగర సామ్రాజ్యపు నాశముమీద తన మహదాశాసౌధమును నిర్మించునంతటి నీచుడు కాలేదు. అతడు దుర్బలుడైన మల్లికార్జునరాయలచే సామ్రాజ్యమును శత్రు హస్తగతము కాకుండా కాపాడుట కష్టసాధ్యమని అతనికి తెలియును. మల్లికార్జునునివలన యీ కార్యము సాధ్యము కానిచో, తాను సామ్రాజ్యమునకు తోడ్పడి దాని వినాశమును తప్పింపవచ్చునని తలచినాడు.

ఇందులో స్వార్థమున కంటెనూ పరార్థమే ఎక్కుడుగ నున్నది. ద్రోహమున కంటెనూ సామ్రాజ్య నిష్ఠయే పైచేయిగా నున్నది. అందువలననే సార్వభౌముని మోసగించి విరూపాక్షరాయలు సింహాసన మెక్కుటతని కిష్టములేదు. ఒక పర్యాయమతనికి సింహాసనము లభించినచో, అది ప్రజాపీడనమునకు దారితీయగలదని భావించినాడు. కుటిల నీతిలో సిద్ధహస్తుడైన విరూపాక్షరాయలను నమ్మి, అతని చేతికి సామ్రాజ్య రక్షణాభార బాధ్యతనప్పగించుట మల్లికార్జునుని ఆత్మ వినాశమునకు దారియని భావించినాడు. ఇటువంటి విషమ సమయములో తాను సామ్రాజ్య భద్రత నెట్లు కాపాడవలయునన్నది అతనికి తోచలేదు.

ఈ విషయమై విరూపాక్షరాయలను సందర్శించి, మాటలాడి అతని ఆంతర్యమును భేదించవలయునని నిశ్చయించుకొని, ఏకాంతముగా అతనిని సందర్శించినాడు.

విరూపాక్షరాయలు తనను చూడగోరి సాళ్వనరసింహుడు రాగలడని అనుకొనలేదు. తన విద్రోహమును, మహత్కాంక్షను బాగుగా నెరిగిన వాడతడొక్కడేనని విరూపాక్షరాయలకు తెలియును. అంతియగాక తన మహదాశయము నెరవేరుట కెవరివల్లనైననూ ప్రతిబంధకమున్నచో ఆ వ్యక్తి నరసింహుడే ననునదికూడ తెలియును. ఏ విధముగా నైననూ అతని ప్రతిబంధకమును తొలగించుకొనవలయునని ప్రయత్నించి అతడు విఫలుడైనాడు. ఇప్పుడతని విషయములో సార్వభౌముని మనసును విరిచి, ఆమూలముగ తాను స్వార్థమును సాధించుటకై అతనిపై విద్రోహారోపణమును మోపినాడు.

ఈ విధముగ తనపట్ల హృదయములో ద్వేషమును వెలిగ్రక్కుచున్న హిత శత్రువగు సాళ్వనరసింహుడు తనను రహస్యముగా ఏకాంతమున సందర్శించుటకై రాగలడని విరూపాక్షరాయ లనుకొనలేదు. అయిననూ తన విస్మయమును వెలిబుచ్చక రాకరాక వచ్చిన సాళ్వనరసింహునికి స్వాగతమిచ్చి, గౌరవ సత్కారములు చేసినాడు.

ప్రస్తావిక మాటలు ముగిసినపిమ్మట విరూపాక్షరాయలే మెల్లగా ప్రారంభించినాడు :

"సాళ్వనరసింహనాయకులూ ! నా మాటను తమ రన్యథా దలపకుడు. ప్రస్తుతము సామ్రాజ్యమునకు శత్రువులవలన యేర్పడిన ఆపదను తప్పించు బాధ్యత మన ఉభయులమీదను పడియున్నది. ఇది సామ్రాట్టునకు, పౌన్నలాదేవికి వేద్యమగుట చాల సంతోషించవలసిన విషయము. వారికి మనశక్తి సామర్థ్యము లిప్పుడైననూ తెలిసినందుకు సంతోషించుచున్నాను. మనము చెప్పినట్లు వినుటకు వారిప్పుడు సిద్ధముగ నున్నారు. ఈ సమయమున మనము చేబూను నిశ్చయముపై మనయొక్కయు, సామ్రాజ్యముయొక్కయు భవిష్యత్తు ఆధారపడియున్నది...." అని చెప్పి నరసింహుని తీక్ష్ణముగ అవలోకించినాడు.

నరసింహనాయకునికీ పలుకుల కేసమాధానమును చెప్పక నవ్వి యూరకుంటినాడు.

"మీనద్ద దాపరిక మెందులకు ? మీ సహోదరులగు గోపరాజులు మా పూజ్య పితరులతో గలసి సామ్రాజ్యమును విరక్తులని చెప్పుకొను స్వార్థపరుల చేతినుండి తప్పించుటలో తమ జీవితములనే బలి యిచ్చినారు. ఇపుడు లక్కనామాత్య, జక్కనాచార్య మొదలగువారు అధికార నివృత్తులై, సామ్రాజ్యమున విరక్తపర్యలు నిలచిపోయిన వనిన ఆ కీర్తి వారిద్దరకు మాత్రమే చెల్లును. వారి బలిదానము వ్యర్థము కాలేదు. అటువంటివారి సోదరుడవు నీవు! మీ నుండి నేను మహత్కార్యములను ఆశించుట నేరమా ?"

"సాళ్వగోపరాజుల కథ ముగిసినదికదా...."

"ముగిసిననేమి ? వారి బలిదానము వ్యర్థము కాలేదు. తలచుకొన్నచో యిప్పుడైననూ మీరు సార్వభౌములపై పగ దీర్చుకొనవచ్చును...."

"అటువంటి అభిలాష ఏదియును నాకు లేదు...."

"నాకునూ లేదు. ఉండినచో ఆ మాట వేరు విధముగా నుండెడిది. నేను తీర్థరూపుల పరాజయమునుండి పాఠము నేర్చుకొంటిని. వారివలె నేను విఫలప్రయత్న మొనరించను. నేను ద్రోహము దలపెట్టిన సింహాసనము నా వశము కావలయును. సింహాసనముకొరకై నేను జరుపు పోరాట మెప్పటికీ నిష్ఫలము కారాదు! అందుకై నేను తొందరపడక తగిన సమయముకొరకు వేచియుచూచుచున్నాను."

"ఏమి, మీరు మల్లికార్జునరాయలపై మీ తండ్రిగారికి జరిగిన పరాభవమునకుగా పగ దీర్చుకొనదలచినారా ? సింహాసనమునకై ద్రోహము తలపెట్టెదరా ?" ఏమియునూ తెలియనివానివలె ప్రశ్నించినాడు సాళ్వనరసింహనాయకుడు.

విరూపాక్షరాయ లీ మాటలకు వ్యంగ్యముగా నవ్వి :

"సాళ్వ నరసింహనాయకులూ! నాకు మీ హృదయములో గల విద్రోహ మేమిటనునది తెలియును. మీరు అపాయమని ముసుగు

ధరించి నన్ను మోసగించలేరు. మన ముభయులమూ యీ విషయములో సమాన భాగస్వాములే యైనాము. మన పెద్దలకు జరిగిన అన్యాయమున కిప్పుడు పగదీర్చుకొనవలసియున్నది. అందులకై మనము నిషగలవారివలె నటించి, హృదయములో సామ్రాట్టులపై ద్వేషమును దాచుకొనియున్నాము. గనుక మనమిపుడు ఒకరి నొకరు వంచించుకొన బనిలేదు. అందువలన ఏ ప్రయోజనమూ లేదు. మన ముభయులమూ అన్నదమ్ములవలె పరస్పరము కలసి-మెలసి కార్యమును సాధించుట శ్రేయస్కరము."

"మీరు చెప్పునదేమి ?"

"మనము సామ్రాట్టుల మిత్రులవలె నటించి, సింహాసనము నుండి వారిని-తొలిగించి, వారి కథను పూర్తిచేయుదము. అనంతరము సామ్రాజ్యమును సమానముగ పంచుకొందము, ఇది మీకు సమ్మతమే కదా!"

ఇప్పుడు తాను తన అంతరంగపు నిజమైన భావములను ప్రకటించినచో సామ్రాజ్యమునకు క్షేమమునకంటె హానియే ఎక్కువని గ్రహించి నరసింహనాయకుడు యీ కుట్ర తనకు సమ్మతమేనను నట్లుగా నటించినాడు.

"మీకు సమ్మతమైనది నాకునూ సమ్మతమే."

ఇద్దరునూ మిత్రులవలె కూర్చుని సార్వభౌముని వంచించి, సింహాసనమును తమదిగా చేసుకొను విషయమును గురించి, సుదీర్ఘముగ నాలోచించి, అనంతరమొక నిర్ణయమునకు వచ్చి తమ తమ నివాసములకు మరలినారు.

దీనిని కార్యరూపమునకు తెచ్చుటకై మహారాణి కిచ్చిన మాట మేరకు విరూపాక్షరాయలు దేవరకొండ రక్షణకై బయలుదేరినాడు అటు సాళ్వ నరసింహనాయకుడు సాధ్యమైనచో ఉత్కళాధిపతిని సరిహద్దు ప్రాంతముననే అడ్డుకొనదలచి, సైన్యమును సిద్ధపరచుకొనుటకై తన రాజధానికి మరలినాడు.

మహారాణి పొన్నలాదేవి విజయనగరమునకు వెనుదిరిగి తన రాయబారపు కథనంతయునూ తిమ్మయామాత్యుని కెరిగించినది.

ఇదివిని తిమ్మయామాత్యుడు నెమ్మదిగా ఒక నిట్టూర్పు విడచినాడు.

"ఇక తరువాతి కార్యక్రమమేమి అమాత్యులూ?" అని పొన్నలా దేవి ప్రశ్నించినది.

"తల్లీ! విద్రోహు లిద్దరకూ యిప్పుడు పెద్ద బాధ్యతల నప్ప గించుటైనది. ఇక మిగిలినది వారి నాశము."

"అది మనము భావించినంత సులభమా, అమాత్యులూ!"

"ఎందులకు తల్లీ?"

"విరూపాక్షరాయల నేమో మనము వశపరచుకొని శత్రువుల మీదికి పంపుటలో సఫలీకృతులమైనాము. కాని సాళ్వనరసింహుని నుండి మనము నిరీక్షించిన సహకారము లభించలేదు తల్లీ! వారు విద్రోహాగ్నితో చెలగాటమాడు చున్నారు. ఆ యగ్ని జ్వాలలే అతనిని నాశమొనరించ గలవు."

"ఆ నమ్మిక నాకు లేదు అమాత్యులూ! విరూపాక్షరాయలనూ, సాళ్వనరసింహనాయకునీ మన మిపుడు శత్రువులపైకి పంపినాము. ఒకవేళ శత్రువులచే వారు పరాజితులైనచో వారి యవతారము పరి సమాప్తమైనదనవచ్చును. కాని మన దురదృష్టమువలన వారు శత్రువు లను జయించివచ్చిన నెట్లు?"

"బహమని, ఉత్కళ సైన్యములముందు వారు నిలువగలరా?"

"వారు ఓడిననే మనకు గెలుపు లేనిచో మన సర్వనాశనము తప్పదు. విజయోన్మత్తులై వచ్చెడివారిని మన మెదిరించి బ్రతుక లేము."

"వారిగతి ఏమి కాగలదో చూతము. అనంతరము మన బ్రతుకు సంగతి!"

"అమాత్యులూ! ఇది ఆత్మ నాశమగుటలేదా? మనము నిప్పులో చెలగాట మాడుచున్నామేమోనని ఒక్కొక్కసారి తోచు చున్నది. మహమ్మదీయులు గెల్చిననూ, విరూపాక్షరాయలు గెల్చిననూ వారిని మనము అడ్డుకొను శక్తిగలదా? అప్పుడు ఓటమి నంగీకరించు టయుండనిచ్చి, సర్వనాశముకానిచో అదృష్ట మనవచ్చును!"

"తల్లీ, అంతటి పరిస్థితి ఏర్పడినచో మన సైన్యము సామ్రాజ్య భద్రతను కాపాడుటకై సిద్ధముగా నున్నది. తమరు భీతిల్లకుడు. మన చేతనైనంత ప్రయత్నమును చేసినాము–సామ్రాజ్యమును యీ గండము నుండి రక్షించుటకు. ఆ పైన దైవేచ్ఛ ప్రకారము జరుగనిమ్మ" అని నిరుద్వేగముతో అనినాడు తిమ్మయామాత్యుడు.

ఈ మాటలతో మహారాణికి కలుగవలసిన సంతోషం కలుగ లేదు. ఆమె అన్యమనస్కముగా కూర్చున్నది. చింతాసాగరమున పడిన దానివలె గన్పట్టుచున్నది. ఎందులకో ఆమెను ఆదినుండి తామీ విద్రోహము నణచుటకు చేబూనిన కార్యము మనస్సుకు అంతగా నెమ్మదిని కలిగింపలేదు. తాము నిప్పుతో చెలగాట మాడుచున్నట్లు మాటిమాటికీ ఆమెకు మనసులో మెదల సాగినది. ఆ యగ్ని యితరుల నాహుతి తీసుకొనుటకుగూరుగా తమనే ఆహుతి తీసుకొన్నచో? ఈ విధముగా భావించుటకు సైత మామె భీతిల్లినది.

ఆమె చింత వ్యర్థముకాలేదు. వాకొకటి దలచిన దైవమొకటి దలంచినది.

బహమనీ సుల్తాను నుండి దేవరకొండను రక్షించుటకై సైన్య సమేతముగా వెళ్ళిన విరూపాక్షరాయలు అదృష్టవశమున యీ కార్యములో విజేతయైనాడు. మసల్మానులు ఓటమిజెంది పారిపోయినారు. పిరికిపందయైన హుమయూను విరూపాక్షరాయల సైనికుల ధాటి కోర్వలేక పలాయితుడైనాడు.

మెఱపువలె యీ వార్త క్షణములో విజయనగరమును చేరినది. ఇది విని మహారాణి పొన్నలాదేవి తల్లడిల్లినది.

మరొక దిక్కునుండి యింతకంటెనూ భయంకరమైన వార్త వచ్చినది. ఉత్కళ కపిలేశ్వర గజపతి విజయనగరముమీదకు వేరొక వైపునుండి దండెత్తి వచ్చినాడు. అతనిని సరిహద్దువద్ద అడ్డుకొనునట్లు చెప్పి వెళ్ళిన సాళ్వనరసింహనాయకు డెందులకో తాటస్థ్యమును వహించినాడు.

ఉత్కళగజపతి నిప్పుడు అడ్డుకొనువారే లేకపోయినారు. అతని సైనికులు క్రొవ్విన అడవి జంతువులవలె సామ్రాజ్యములోనికి బ్రనే

శించి, గ్రామములను కొల్లగొట్టుచు, చేజిక్కినదానిని దోచుకొనుచు, ఎదురైనవారిని సంహరించుచు, పల్లెలను పరశురామప్రీతి గావించుచు ముందుకు దూసుకొని రాసాగినారు. వైష్ణవ పక్షపాతియైన గజపతి, సామ్రాజ్యమందలి శైవక్షేత్రముల నన్నింటిని నాశన మొనర్చుచూ వచ్చినాడు. ఈ విధముగా కంచి మరియు దాని పరిసరములలోగల శైవ దేవాలయములు కాలి భస్మములైనవి. విగ్రహములు భగ్నములైనవి. వాటి సంపద దోచుకోబడినది. ప్రజలు వారి యుపద్రవములను సహింపలేక హాహాకారములు చేసినారు. ఈ సైత్యసమూహమునుండి తమను తప్పించగల నాథులు లేరని ఆక్రందనము చేయుచూ, దిక్కు కొకరై పారిపోయినారు.

ఈ దారుణవార్తను గూఢచారులు మోసుకొనివచ్చి సార్వభౌముని చెవిని వేసినారు. ఇది విని మహారాణి ఓన్నలాదేవికి కనుల నుండి ధారగా అశ్రువులు ప్రవహించినవి. ఆమె తిమ్మయామాత్యుల వైపు తిరిగి :

"అమాత్యులా ! చూడుడు. మనము చేసిన పాపమునకు నిరపరాధి జనత శిక్ష ననుభవించవలసి వచ్చినది !" అని నిట్టూర్చినది.

"ఇప్పుడు మనమా కపిలేశ్వర గజపతి దండయాత్ర నెదిరించుటకు సిద్ధపడడమా ? అటు విజేతయై వచ్చుచున్న ద్రోహి విరూపాక్ష రాయల నెదిరించుటయా ? ఏమిచేయవలెనో తెలియకున్నది."

"తల్లీ ! తమరే హతాశులైనచో యిక సామ్రాట్టులకు సమాధానము చెప్పువారెవరు ? మన మిపుడా ఉత్కళ మదోన్మత్త గజపతిని వెంటనే వెనుకకుతరిమి, ప్రజలకు అభయహస్త మీయవలసియున్నది. ఈ కార్యమునకు నేను వెళ్ళుచున్నాను. తాము విరూపాక్షరాయలను ఉపాయాంతరముగా, రాజధానికి వెలుపలనే విడిదిచేయు నట్లొనరించుడు. నేను గజపతి నోడించి, ఆ ద్రోహికి తగిన బుద్ధి గరపి, వెనుదిరిగు వచ్చునంతవరకు మీరు విరూపాక్షరాయల నెట్లయిననూ నగరము లోనికి ప్రవేశించకుండునట్లు చూచుకొనవలయును. నేను వచ్చిన తరువాత వారిని విచారించుకొనెదను" అని సమాధానము జెప్పి, సార్వ

భౌమునివద్ద అనుజ్ఞపొంది సైన్య సమేతుడై కాంచీపుర మార్గమనుస రించినాడు.

అప్పటికి కపిలేశ్వర గజపతి సైన్యములు చేసిన విధ్వంసకర కృత్యములచే కాంచీపురము స్మశాన దృశ్యమైనది. ఆ ప్రదేశమంత యునూ మరుభూమివలె కనబడసాగినది. ప్రజలు పల్లెలను - పట్టణము లను విడచి అడవిని చేరుకొన్నారు. వారిని రక్షించువారే లేకపోయి నారు. వారు తమ నీ గండమునుండి తప్పింపుమని భగవంతుని ప్రార్థింప సాగినారు. ఆ దైవముకూడ వారి చేయి వదలినట్లే కనబడసాగినది.

అటు దేవరకొండనుండి విరూపాక్షరాయలు తనకు లభించిన విజయముతో ఉప్పొంగిపోవుచూ, తన సకల సైన్యములను కూడగట్టు కొని, మదోన్మత్తుడై విజయనగరము దారిబట్టి వచ్చుచున్నాడు. ఈ పరిస్థితిలో తనకు సింహాసన మప్పగించి, ప్రాణభిక్ష వేడనిచో మహా రాణిని, సార్వభౌముని హతమొనర్చి, తాను సింహాసన మాక్రమించు కొనవలయునని అతడు నిశ్చయించుకొన్నాడు. ఇప్పుడతనిని పట్టువారే లేకపోయినారు.

సైనికులకు అతనిమాట వేదవాక్యము. అతడు యవనులనుండి తనకు లభించిన సంపదనంతయూ సైనికులకు పంచిపెట్టి, వారి హృద యములను చూరగొన్నాడు. అంతియకాక విజయనగరము తన వశమై నచో, ప్రతియొక్క సైనికునీ శ్రీమంతునిగా చేయుదునని వాగ్దాన మొసగినాడు. దీనిచే మదించిన సైనికులు విరూపాక్షరాయలకొరకై ఏ సాహసము చేయుటకైననూ సిద్ధపడసాగినారు. వారి సాయముతో విరూపాక్షరాయలు సింహాసనమునాక్రమించుకొనుటకై వాయువేగముతో బయలుదేరినాడు.

ఇటువంటి విషమపరిస్థితిలో తిమ్మయామాత్యుడు ఆపత్కాల మునకై ప్రత్యేకింపబడిన సైన్యములో చాల భాగము తనతో తీసుకొని కాంచీపురమువైపు వెళ్ళినాడు. విజయనగరములో మహారాణికి, సార్వ భౌమునికి రక్షణకొరకై నిలుపబడిన సైన్యము నగర రక్షణకు చాలదు. వారిని నమ్మి అచ్చట ఊరక కూర్చొనుటకు వీలులేదు.

అయిననూ తిమ్మయామాత్యుడు వెనుదిరిగి వచ్చునంతవరకూ

ఎట్లయిననూ తాను విరూపాక్షరాయలనుండి విజయనగరమును సంరక్షింప వలసియున్నది. అంతవరకునూ ఆమెకు ప్రాణములో ప్రాణము లేకపోయినది. ఆమె తన భవిష్యత్తును భగవంతుని కప్పగించి నిశ్చింతురాలగుటకు ప్రయత్నించినది. కాని, ఆమెకు శాంతి లభించలేదు !

# 10. ఆశయ సిద్ధి

తిమ్మయామాత్యుడు, తందీర ప్రాంతమున కపిలేశ్వర గజపతి జరిపిన అత్యాచారములను, విధ్వంసక చర్యలను అరికట్టుటకై అటు వెళ్ళినతరువాత యిటు విజయనగరము మీదికి విజయోన్మత్తుడైన విరూపాక్షరాయలు సైత్యావేశముతో ఎత్తివచ్చినాడు. అమాత్యుడు నగరమున లేని సమయమును జూచి, దానిని వశపరచుకొనదలచి అతడు శరవేగముతో వచ్చినాడు.

ఈ సమయములో ఏమి చేయుటకునూ మహారాణికి తోచలేదు. తిమ్మయామాత్యుడేమో తాను వచ్చునంతవరకు ఏ విధముగానైననూ విరూపాక్షరాయలకు రాజధాని వశము కాకుండునట్లు చూడవలసినదని చెప్పి వెళ్ళినాడు. కాని అసంఖ్యాకములైన సైన్యములతో సింహాసనమును ఆక్రమించుకొనవలయునను దురుద్దేశముతో వచ్చిన ఆ ద్రోహిని తాను నిరోధించుటెట్లు ? ఎంత యాలోచించిననూ ఆమెకీ విషయము తోచలేదు.

సామ్రాట్ మల్లికార్జునరాయలు తిమ్మయామాత్యుడు పిలుచుకొని వెళ్ళగా మిగిలిన సైన్యమును నగర రక్షణకు నియమించినాడు. కాని అచ్చటగల ఆయుధములు, సైనికులు విజయోన్మత్తులైన విరూపాక్షరాయల సైనికులముందు చాల అల్పముగా తోచినవి. వారు ఆ ప్రబల శత్రువులనుండి ఎక్కువ రోజులు విజయనగరమును కాపాడుట దుస్తరమైనది. కాని హతాశులైనచో కార్యహాని కాగలదు. తిమ్మయామాత్యుడు వారికి సాయము వచ్చునంతరవరకు ఎట్లయిననూ సరియే, రాజధాని విరూపాక్షరాయల వశము కాకుండునట్లు చూడవలసియున్నది. కాని అందులకు వలసిన శక్తి సామర్థ్యము లతనికి లేవు.

యుద్ధము జరిగినచో ఖండితముగ తమ కపజయము కలుగగల దని మహారాణికి తెలియును. తమ బంధువర్గములోనివారగు సైనికుల రక్తమును వృథాగా ప్రవహింపజేయుట మహారాణి కిష్టములేదు. విరూపాక్షరాయలను అతని దురాలోచననుండి విముఖినిగా జేసి వెనుకకు బంపుట సాధ్యముకాదు. ఇటువంటి సమయములో ఓడిపోయి అతనిచేత అవమానింపబడుటకంటెను వీరులవలె పోరాడి మరణించుట మేలని మహారాణి పొన్నలాదేవి భావించినది.

అయిననూ తన వంశాంకురమైన మల్లికార్జునరాయలూ, అతని బిడ్డలూ విద్రోహుల చేతికి పట్టుబడి మరణించుటగాని, తామై ఆత్మ హత్య జేసుకొనుటకాని ఆమెకు సమ్మతము గాకపోయినది. ఏమైనను కానిమ్ము, అతనిని కాపాడి, తిమ్మయామాత్యుని కప్పగించి, అనంతరం సింహాసన రక్షణకై తన సర్వస్వమునూ బలిగావింపవలయునని నిశ్చ యించు కొనినది.

ఈ విషయమై పొన్నలాదేవి ఒక నిర్ణయమునకు వచ్చిన వెంటనే ఆమె సామ్రాట్ మల్లికార్జునరాయలను ఏకాంతమునకు రప్పించుకొనినది. అతనికి జరిగిన విషయములనూ, తమ విషమ పరిస్థితిని వివరించినది, ఈ సమయములో తాము బ్రతికి బయట పడ వలసిన క్రమమును సూచించినది.

"కుమారా! మనమేది జరుగరాదని యాశించితిమో అదియే జరిగినది. మన మిత్రుడు ద్రోహియగు విరూపాక్షరాయలనుండి రాజ ధానిని రక్షించుట కష్టసాధ్యము. దానిని తిమ్మయామాత్యులు వచ్చు నంతవరకు సైతము కాపాడుట కష్టతరమని లోచుచున్నది. యధార్థ విషయమును మనము నిర్లక్ష్యపరచరాదు. విరూపాక్షరాయలవద్ద యిప్పుడసంఖ్యాక సైన్యము గలదు. అతని యంగరక్షకులుకూడ రాజ ధానిలో నలసినంతమంది వున్నారని విన్నాను - ఇటువంటి పరిస్థితిలో విజేతమై, కుడితాగినవలె ముందుకు త్రోసుకొని వచ్చుచున్న ద్రోహి యగు విరూపాక్షరాయలను మనము ఎదిరించి పోరాడి నగరమునూ, సింహాసనమునూ కాపాడుకొనగలమనుమాట సంభవము. అందువలన

యీ గండమునుండి మనము బ్రతికి బయటపడవలయుననిన యుద్ధము విడచి వేరొక మార్గ మన్వేషించవలయును."

"అమ్మా! ఆ ద్రోహి బారినుండి విజయనగరమును తప్పించుటకు యుద్ధమే మంచిదని నాకు దోచుచున్నది. ఈ పవిత్ర కార్యములో మరణించిననూ మనకు సద్గతి సంప్రాప్తము కాగలదు. మీరీ విషయమై అధైర్య పడకుడు!" అని మల్లికార్జునరాయలు తల్లికి సమాధానము చెప్పినాడు.

"నీ భుజముల కంతటి శక్తిగలదని నాకు తెలియును నాయనా! అవమానమున కంటెను వీరమరణమే నీకు ప్రియకరమనియూ తెలియును. కాని మనము సింహాసనమునకై రక్తమును ప్రవహింప జేయుటయా? ఈ పోరాటములో మన కపజయము కలుగగలదని తెలిసియునూ సిద్ధపడుటయా? నిరపరాధుల రక్తమును మన స్వార్థమునకై అధికార లాలసకై బలియిచ్చుటయా? మనము విరూపాక్షరాయల నెదిరించి, పోరాడి మరణించినచో మనకు వీరస్వర్గము లభించవచ్చును— దీనిచే మనము సాధించునదిమాత్ర మేమిగలదు? విజయనగర సామ్రాజ్యమును ఈ ద్రోహి బారినుండి రక్షించవలయునను మన యుద్దేశము నెరవేరగలదా? మనమిపుడు బ్రతికి బయట పడినచో, మున్ముందు సమయము జూచి, ఈ ద్రోహిని సింహాసనమునుండి క్రిందకు దింపి, సామ్రాజ్యమునకు సంభవించిన గండమును తప్పింపవచ్చును. ఇది ఆత్మరక్షణ మార్గము మాత్రమే కాదు — సామ్రాజ్యమును యీ ద్రోహి నుండి కాపాడుటకు మనకుగల దారి యిది ఒక్కటే."

"అమ్మా! నేను సార్వభౌముని గర్భమున జనించినవాడను. కాని సార్వభౌమునివలె జీవించలేను. ఇపుడు మరణమంతైననూ సార్వభౌముని ఘనతకు తగినట్లు పోరాడి మరణించవలయునని యున్నాను. మీ రిందులకు సమ్మతించవలయును." అని మల్లికార్జునరాయ లడిగినాడు.

"కుమారా! నీ వీరభాషణములను విని హృదయము సంతోషాతిశయముచే పొంగిపోవుచున్నది. నీవంటి సార్వభౌముని బడసి యీ సామ్రాజ్యము నెమ్మదిగా నుండలేకపోయినదికదా యని నా వ్యధ!

మన మిపుడా ద్రోహి నెదిరించినచో, మన ఉద్దేశము సాధింపబడదు. యుద్ధమున జయాపజయములు దైవేచ్ఛ ప్రకారము జరుగగలవు. ఒకవేళ మన కపజయముకలిగి, ఆ నీచునిచేతికి పట్టుబడినచో, అవమానము పొంది మరణించవలసి యుండును. దానిని తప్పించుకొనుటకు మనము వేరొక మార్గ మనుసరించుట శ్రేయస్కరముకదా ?"

"అయినచో మీరిపుడు చెప్పునదేమి ?" మల్లికార్జునరాయలు హతాశుడై ప్రశ్నించినాడు.

"మనమిపుడు పోరాడి మరణించుటచే ఎవరికిని ప్రయోజనము లేదు. బ్రతికి దుష్టుల నాశనమునకు బ్రయత్నించవలయునేకాని, మరణించిన ఏమి సాధించినట్లగును? ఇపుడు నేను చెప్పుదానిని శ్రద్ధగా వినుము : నీవు నీ భార్య బిడ్డలు యిప్పుడే యిచ్చటినుండి మారువేషమున తప్పించుకొని బయటపడి, ఎచ్చటనైననూ సురక్షితమైన స్థలములో తలదాచుకొనుడు. లేదా తిమ్మయామాత్యుల ఆశ్రయమునకు వెళ్ళుడు. నేనీ విజయనగరమును తిమ్మయామాత్యులు మన సాయమునకు వచ్చునంతవరకూ ఎట్లయిననూ రక్షించుకొనగలను. ఒకవేళ యుద్ధమనివార్యమైనచో, ఆ ద్రోహి మొదట నన్ను చంపి, ఈ పవిత్ర సింహాసనము నధిష్టించవలయును. నా శరీరములో బొట్టు రక్తమున్నంతవరకూ ఈ సింహాసనము నతనిపాలు చేయుటలేదు."

"నిన్ను శత్రువుల పాలుజేసి, నేను పిరికిపందవలె తలవాల్చుకొనుటయా? వీలులేదమ్మా! నా బొందిలో ప్రాణము లుండునంతవరకు అంతటి పిరికిపందను కాలేను. నా వలన అంతటి హేయకార్యము జరుగనేరదు. మీకు జరుగనున్నదే నాకును జరుగనిండు. నే నిచ్చటనే యుండగలను."

"కుమారా ! ఇది తొందరపడు సమయము కాదు. అనవసరమైన చర్చలలో కాలహరణముచేయు సమయమూ కాదు. నా మాటను వినుము. హఠము చేయకుము. నీవు మా వంశాంకురమవు. నీవలననే మా జీవితము నిలచియున్నది. నీవు బ్రతికిన ఆ నీ బిడ్డలు బ్రతుకగలరు సామ్రాజ్యము మనగలదు. సింహాసనము దక్కును.

ఇపుడు అది మనచేయి జారిపోయిననూ, రేపది మనవశము కాగలదు. అందులకే నీవు, నీ భార్య బిడ్డలు బ్రతికి యుండవలయును. లేనిచో ఆ నీచునిచే మీ జీవితములు సురక్షితములు కావు. అతనివలన గండము సంభవించుటకు మునుపే తప్పించుకొని పారిపొండు. ఇది ఆత్మ ద్రోహము కాదు, భీరుత్వమూ కాదు. భవిష్యత్తుకొరకై చేయవలసిన ముందాలోచన. దేశముకొరకై చేయవలసిన స్వార్థత్యాగము. తిమ్మయామాత్యులు నగరరక్షణకై వచ్చునంతవరకూ నీ విచ్చటినుండి తప్పించుకొని పొమ్ము. నిన్నెవ్వరునూ ప్రాణభీరువని అనలేరు" అని యనేక విధముల మల్లికార్జునుని సమాధానపరచి, ఒడంబడజేసినది పొన్నలాదేవి.



"నేను తప్పించుకొనిమాత్ర మెచ్చటికి వెళ్ళను ? ఈ స్థితిలో మన కాశ్రయమిచ్చు వారెవరు ?" హతాశాభావముతో ప్రశ్నించినాడు సామ్రాట్టు.

"ఆశ్రయమా ? మనకు భగవంతుడే ఆశ్రయ మివ్వగలడు. నీవు మొదట యిచ్చటినుండి తప్పించుకొని బయటపడుము. సాధ్యమైనచో తండీర ప్రాంత్యమునకు వెళ్ళి ఛద్మవేషమున తిమ్మయామాత్యులను కలుసుకొనుడు. వారు ప్రాణములతో నున్నంతవరకూ మీ సిగపూవుకూడ వాడనివిధముగ జూచుకొనగలరు. అట్లు గానిచో ఏదైననూ ఒక రహస్య స్థలమున దాగియుండి యీ రాజ్యక్రాంతి తగ్గినపిమ్మట కనిపెంపుడు. మీరు క్షేమముగా నున్నచో నేనిచ్చట నెమ్మదిగా నుండగలను. నిశ్చింతలో విజయనగరమునూ, సింహాసనమునూ ఆ ద్రోహినుండి రక్షించుకొనుటకై పోరాడగలను."

"మిమ్ములను—అబలలైన మిమ్ములను - యీ విషమ పరిస్థితిలో విడచిపెట్టి నే నొక్కడను తలదాచుకొనడమా ? మీరు ఎందులకు మా వెంట రాకూడదమ్మా ?"

"లేదు, నాయనా ! నే నిచ్చోటువాసి ఎచ్చటికీ రాను. సింహాసనమును కాపాడుటకు నా జీవితమును బలిగావించి పోరాడునట్లుగా నేను కీర్తిశేషులైన ప్రభువులకు మాట యిచ్చినాను. నా బొందిలో ప్రాణములుండునంతవరకూ ఈ పవిత్ర సింహాసన మన్యులచే అపవిత్రమగుట

కవకాశమివ్వను. అంతియకాక సామ్రాజ్య ప్రజ నన్ను తల్లియని భావించియున్నది. వారిని ఆపదలో చేయివిడచి స్వార్థపరురాలగుటకు నాకు మనస్కరించుటలేదు. నే నిచ్చటనేయుండి రాగలదానిని ధైర్యముగా ఎదిరించి పోరాడెదను. మా వంశలతవైన నీవు సురక్షితముగా నున్నచో, నా కన్నియూ నున్నట్టే నాయనా! నీవు నా గురించి ఆలోచించకుము" అని కుమారుని సమాధానపరచినది. కాని అతని భార్యయగు చంద్రముఖీదేవిని సమ్మతింపజేయు టింకనూ కఠినముగా పరిణమించినది. ఆమె స్వాభిమానయగు స్త్రీ. సార్వభౌముని భార్యయైన పిమ్మట సామ్రాజ్య ప్రజాకోటి రక్షణ, పోషణలు తనవని భావించినది. తాను సామ్రాజ్య ప్రజలను ఆపదకు గురిచేసి, తప్పించుకొని పారిపోవుట కర్తవ్య పరాఙ్ముఖతయని భావించినది. అంతియకాక అది భీరువుల లక్షణమని గ్రహించినది. ఇటువంటి సద్గుణయైన ఆమె అత్తగారి మాట విని నగరమును శత్రువుల కప్పగించి, తలదాచుకొనుటకు సమ్మతించగలదా?

కాని, పరిస్థితి అటువంటిది. బలవంతముగానైననూ ఆమెను సమ్మతింపజేయక తప్పదు.

"ఈ విధముగా నీవు పట్టుబట్టకూడదమ్మా! నీ క్షేమమును కోరియే నేనీ మాటలు చెప్పుచున్నాను. నీ శ్రేయస్సు నీ భర్త ననుసరించియే యున్నది. నీమీద యిప్పుడు సామ్రాట్టుల రక్షణాభారము పడియున్నది నా మాట వినుము. ఇది మొండిపట్టు పట్టవలసిన విషయము కాదు" అని పొన్నలాదేవి వినయముగా చెప్పినది.

"మిమ్ములను మాత్రము ఆపదకు గురిచేసి, మేము తప్పించుకొనుటయా? లేదు, అత్తగారూ! మీ రెన్ని చెప్పిననూ నే నిందులకు సమ్మతించను. నా పాలిటి దైవమైన మిమ్ములను బాసి నే నెచ్చటికీ వెళ్ళలేను. మీకు సంభవించిన దుర్గతినే నేననూ అనుభవించగలను. మీరు మరణించినచో నేననూ మరణించెదను" అని చంద్రముఖీదేవి యనినది. ఆమె పలుకులలో స్థిరత్వము వినబడినది.

"అయినచో నీవు నాయొక్కయు, నీ భర్తయొక్కయు ఆజ్ఞనుల్లంఘించెదవా?" అని తీక్షణముగా చంద్రముఖిని జూచినది.

ఈ పలుకులకామె నిరుత్తరయైనది. ఇదివరకూ ఆమె భర్తమాట కెదురాడినది కాదు — సహధర్మచారిణియై, నీడవలె సర్వదా అతనిని అనుసరించెడిది. ఇప్పుడు తన భర్త అచ్చటినుండి తప్పించుకొనుటకు సంసిద్ధుడై యుండగా, అతనిని తిరస్కరించుట పతిభక్తిగల తనకు భూషణమా? చంద్రముఖి ఆలోచనాపరురాలైనది. కాని, ఏమియునూ తోచక ఆమె కనులలో నీరు గ్రమ్మినవి.

"అమ్మా, మిమ్ములను వదలి నే నెట్లుండగలను. నా పాలిటి దైవము మీరు. నా తల్లికంటెనూ ఎక్కుడుగానున్న మిమ్ములను బాసి నే నెట్లు జీవించను?" అని ఆమె యేడ్చినది.

"ఏమిచేయగలము తల్లీ! పరిస్థితి యీ విధముగా రాగలదని ఎవరనుకొన్నారు? నీవు సార్వభౌముని చేపట్టి యిపుడు పరదేశివలె తలదాచుకొని తిరుగవలసి వచ్చినట్లయినది. ఇది నా దురదృష్టము. కాని, ప్రస్తుత మింతకంటెను వేరు గత్యంతరములేదు తల్లీ! మీరు సుఖముగా జీవించవలయుననియే మా యాశ. సామ్రాజ్యమునకు సంభవించిన యీ యాపదను తప్పించి మరల దీనిని కాపాడవలయుననియే మా కోరిక. అందులకై మీరు జీవించి యుండవలెను. నా వలన మీ మనసుకు బాధ కలిగియుండినచో క్షమించు తల్లీ!" అని మహారాణి కూడ కన్నీరు కార్చినది.

అది శోకించుచూ కూర్చొనుటకు సమయముకాదు. వెళ్లుటను నిశ్చయించడమేమో అయినది. ఇక అందుకై వలయు ప్రయత్నములు చేయవలసి యున్నది. ఈ విషయ మత్యంత రహస్యముగా నుంచవలసి యున్నది. ఇది ఎవరికి తెలిసిననూ, దానిచే వారి ప్రాణమున కపాయ మేర్పడగలదు. అన్నియును చాల అప్రమత్తతతో నిర్వహింపవలసి యున్నది —

వారు వెళ్ళినపుడు పొన్నలాదేవి కుమార్తెకంటెనూ ఎక్కుడైన చంద్రముఖిని ఏకాంతమునకు బిల్చి చెప్పవలసిన విషయములను చెప్పినది.

"తల్లీ! ఈ విపత్తునుండి నేను తప్పించుకొనక పోయినచో,

నీమీద చాల పెద్ద బాధ్యతాభారమును మోపి వెళ్ళుచున్నాను. నా మాట లను శ్రద్ధగా వినుము. నీ భర్తయగు మల్లికార్జుని స్వభావమును నీవు యిదివరకే అర్థముచేసుకొని యుండవచ్చును. అతడు పొరబాటున సార్వభౌముల కడుపునబుట్టి సామ్రాట్టు అయినాడని నా భావన. అతడు కవి కావలసినవాడు. కాని రాజుగా జన్మించినాడు. జనకునివలె రాజర్షి కాగోరినాడు. కాని యిది త్రేతాయుగము కాదనునది అతను గ్రహించి నట్టులేదు. ఇపుడు అడుగడుగునా ఆపద కాచియున్నది. సామ్రాజ్య మును కాపాడుటకు సమర్థులూ, దక్షులూ నగు వ్యక్తి సింహాసనములో నుండుటావశ్యకముగ నున్నది. సార్వభౌముని భార్యవై, రాష్ట్ర రథ మును ముందుకు నడుపు భాధ్యత నీదితల్లీ! నా మల్లికార్జునుడు యీ నాటి కుటిల రాజ తంత్రమునకు తగినవాడు కాడని నీ కప్పగించి వెళ్ళు చున్నాను. అతనినీ, ఈ సామ్రాజ్యమునూ కాపాడు భారము నీయది.

"ఇంతకంటెను గొప్ప బాధ్యత నొకదానిని అప్పగించి వెళ్ళు చున్నాను. నీ తనయులు రాజశేఖర, పెద్దరాయలు వీరికి కొంతబుద్ధి వచ్చినది. తక్కినవారింకనూ పసిగందులు. వారి జీవితము కష్టకార్పణ్య ముల కాలవాలమగుట అక్కరలేదు. ఎటువంటి పరిస్థితి సంభవించి ననూ ఆ బిడ్డలను నీవు చేయి విడువక బాగుగా చూచుకోతల్లీ! వారు మన వంశ లతలు. ఈ బాధ్యతను నేను మల్లికార్జునరాయల కప్పగించ లేను. అతనికి ప్రాపంచిక విచారములలో నాసక్తిలేదు. అత డధ్యాత్మ మార్గ మవలంభించినాడు. అతనివలన నీ జీవితము ముండ్లపాన్పు కావ చ్చును. అయిననూ మన వంశపు యీ వృక్షమును నీవు చాల జాగ్ర త్తగా కాపాడవలయును. ఇదియే నేను నీకు చెప్పదలచినది" అని చెప్పుచుండగనే కంఠము గాద్గదికమైనది. కనులలో నీరు గ్రమ్మినది. ఆమె ఏడ్చివేసినది. పొన్నలాదేవి ఎప్పుడూ యీ విధముగా రోదించి నదికాదు.

చంద్రముఖికూడ అత్తగారి ఒడిలో తలవాల్చి పసిపిల్లవలె రోదించినది.

వారు వీడ్కోలు పుచ్చుకొని వెళ్ళవలసిన రోజులు దగ్గరపడు చున్నకొలదీ ఎవరికినీ నిద్రపట్టుటలేదు.

రాజశేఖరుని కిపుడు పదునాలుగేండ్ల ప్రాయము. ఆ వయసునకే అతడు తన తాతగారివలె మహదాకాంక్షియైనాడు. అతనికి తమను అవ్వగారు దూరముగా బంపి, తానొక్కతే రాజధానిలో సుండగలదను విషయము తెలిసి చాల వ్యథ జెందినాడు.

"అవ్వగారూ! మీరేమైననూ చెప్పుడు. నేను నాయనగారితో వెళ్ళను. ఇచ్చటనే యుందును." అని ఒక్కటే పట్టుబట్టినాడు.

"అట్లనిన ఎట్లునాయనా! నీవు యీ విధముగ హఠము చేయ రాదు. నా కొరకై నీవు జీవించవలయును. ఈ నీచుడగు విరూపాక్ష రాయలను సంహరించి, పగదీర్చుకొనుటకై నీవు బ్రతికియుండవల యును తండ్రీ! ఈ సామ్రాజ్యమును శత్రుహస్తగతము కాకుండా కాపాడుటకై నీవు జీవింపుము" అని మనుమని తలదువ్వి, అతి కష్ట ముపై అతనిని సమాధానపరచినది.

వారి ప్రయాణ మత్యంత రహస్యముగా నుంచబడినది. ఈ విషయము ఆంతరంగికులగు కొందరు వ్యక్తులకు దప్ప, మరెవరికినీ తెలియదు.

ప్రయాణమునకు సర్వమూ సిద్ధము చేయబడినది. మల్లికార్జున రాయలు భార్య-బిడ్డలతో ఛద్మవేషములను ధరించినారు. అనంతర మతి కష్టముపై తల్లివద్ద సెలవు బుచ్చుకొని, తమకని ఏర్పాటు చేయబడిన అశ్వముల నధిరోహించినారు. విశ్వాసపాత్రులగు కొందరు భటులు వారి రక్షణకై బయలుదేరినారు. మహారాణి పొన్నలాదేవి ఒక పెట్టె నిండుగా విలువగల వస్త్రాభరణముల నుంచి, భటులచేత బంపినది.

అంతయూ వారు నిర్ణయించిన కార్యక్రమము ప్రకారమే జరిగి నది. మల్లికార్జునుడు తన పరివారముతో నగరమును విడచి రహస్య ముగా తందీర ప్రాంత్యమునకు ప్రయాణించినాడు. అచ్చటగల తిమ్మయా మాత్యులను త్వరలో వెళ్ళి కలుసుకొనవలయునని అతని యాశ.

అతడు రాజధానిని విడచివెళ్ళినతరువాత పొన్నలాదేవి సామ్రాట్ ప్రౌఢదేవరాయ, భీమలాదేవిగారి చితాభస్మముంచిన పూజాగృహమునకు వచ్చి దానికి సాష్టాంగ నమస్కారముచేసి, ఏడ్చుచూ కూర్చొన్నది.

ఆ విధముగ చాలసేపు రోదించి చివరకు తనకు తానే సమాధానము చెప్పుకొనినది.

"ప్రభూ! ఈ నాటికి మీ కిచ్చిన వాగ్దానమును చెల్లించుకొనినాను. ఇక మీవద్దకు వచ్చుటకు నా కాజ్ఞయిండు" అని చెప్పి అచ్చటి నుండి లేచిపోయినది.

ఆ తరువాతి రోజులు మహారాణి పొన్నలాదేవికి యాంత్రికముగా గడచినవి. ఆమె జడురాలైనది. తన జీవన ప్రభయైన మల్లికార్జునరాయలు, చంద్రముఖి, రాజశేఖర, పెద్దరాయలు, ఆ పసిగందులు-వీరిని బాసినపిమ్మట ఆమె జీవిత మంధకారమయమైనది, అయిననూ ఆమె కర్తవ్య పాలనమునకై జీవించియున్నది. విజయనగరమును దుష్టుడైన విరూపాక్షరాయలనుండి రక్షింపవలసిన మహత్తర కార్యభారమామె ముందున్నది. అందులకామె నడుముకట్టి నిలబడియున్నది.

విరూపాక్షరాయలు ప్రచండమారుత వేగములో వచ్చి విజయనగరమును ముట్టడించినాడు. అంతయూ పొన్నలాదేవి భావించినవిధముగనే జరిగినది.

ఈ పర్యాయము తనకు లభించిన యవకాశమును వ్యర్థపరచుటకతడు సిద్ధముగా లేడు. సింహాసనమును తనదిగా చేసుకొనవలయునను దృఢనిశ్చయముతో అతడు దండెత్తి వచ్చియున్నాడు. విజేతయైన అతని నడగించువారే లేకపోయినారు. మల్లికార్జునరాయల దుర్బల పరిపాలనతో విసుగుజెందిన ప్రజలతనికి సంతోషముతో స్వాగతమిచ్చినారు. అతని ప్రలోభమునకు లోబడిన సైనికులతని పక్షమునే యవలంబించినారు. అటువంటివారి నెదుర్కొనుటకై మహారాణి సిద్ధముగా కూర్చొనియున్నది!

ఇది తన జీవితపు చరమ పోరాటమనునది ఆమెకునూ తెలియును. ఈ పోరాటములో తా నోడిననూ సరియే, ఆ నీచునికి సింహాసనము నప్పగింపరాదని ఆమె నిశ్చయించుకొన్నది. ఈ విషయములో ఆమె వజ్రమునకంటెనూ కఠినురాలైనది.

ఈ విషయము తెలియగనే విరూపాక్షరాయలు నిరాశ జెందినాడు. అతడే పోరాటమునూ లేక విజయనగరమును తన వశమొనర్చుకొనవచ్చుననుకొన్నాడు. స్వబంధు సైనికుల రక్తమును ప్రవహింపజేయుట అతనికిఁకూడ యిష్టములేదు. రక్తరహితమైన రాజ్యక్రాంతి యొనర్చి సింహాసనము నాక్రమించుకొనవలయు ననుకొన్నాడు. కాని మహారాణి తనతో పోరునకు సిద్ధముగా నున్నసంగతి తెలియగనే అతడు తన యభీష్టమును ఉపాయముగా నెరవేర్చుకొనుటకు వేరొక మార్గ మవలంబించినాడు.

అమాత్య సింగననాయకునితో దీర్ఘముగా నాలోచించి, ఒక లేఖ వ్రాసి పొన్నలాదేవికి బంపినాడు.

ఆ లేఖలో యీ విధముగా నున్నది:

"మహారాణిగారూ!

నా మీద లేని రాజద్రోహమును మోపి, నన్ను ఉపాయముగ బంధించి చెఱలో వేయుటకు మీ రాలోచించి యున్నారు. కాని దైవము నా పక్షమున నున్నది. మీ పన్నుగడ ఫలించలేదు. ఇపుడు మీరు నాచే జిక్కి యున్నారు. నేను తలచినచో రాజ్యకోశముల నాక్రమించుకొని, మిమ్ముల నందరనూ హత్య జేయింపవచ్చును. కాని నే నంతటి నీచుడను కాను. నాకు కావలసినది సామ్రాట్ పదవి! మీ సింహాసనము! ఈ రెండింటిని మీరు మా కప్పగించి, శరణుకోరునట్లయినచో మిమ్ముల క్షమించగలను. మీ జోలికి రాక, మీ యపరాధములను మరచిపోగలను. మీరు నా యీ కోర్కెను తిరస్కరించిన పక్షమున నేను బలవంతముగా సింహాసనము నాక్రమించుకొనవలసి యుండును. అటువంటి పరిస్థితిలో మీ మాన ప్రాణములు నాచేత నుండగలవనునది మరువకనుకొందును.

ఇప్పుడునూ కార్యము మించిపోలేదు. మీరు బాగుగా నాలోచించి, మల్లికార్జునరాయలకు చెప్పి సింహాసనమును నా కప్పగించి నన్ను ప్రాణభిక్ష కోరుటలో మీకు క్షేమముగలదు. తొందరపడినచో మీ సర్వనాశనము తప్పదు. తెలిసినవారి కెక్కువ వ్రాయలేను. నాకు కావలసినది

రక్తరహిత రాజ్యక్రాంతి ! ఇందులకు ప్రతిఘటించినచో మొదట మీ రక్తమే చల్లబడును ! ఆవేశపడక అన్నియూ చక్కబరచగలరని నమ్ముచున్నాను."

ఈ లేఖ చదివి మహారాణి పొన్నలాదేవి తిరస్కారభావముతో నవ్వినది.

"మహారాణిగారూ ! దీనికి ప్రత్యుత్తరము తీసుకొనిరమ్మని సామ్రాట్టులాజ్ఞాపించినారు" అని పత్రవాహకుడన్నాడు.

ఈ మాటవిని పొన్నలాదేవి మండిపడినది.

"ఎవరు మీ సామ్రాట్టులు ? నీ వెవరితో మాటలాడుచున్నావో తెలియునా ?" అని గర్జించినది.

"ప్రభువులు - ప్రభువులు...." అని అతడు తడబడినాడు.

"ఎవరు నీ ప్రభువు ?"

"వి.... విరూపాక్షరాయలు...."

"వెళ్ళి ఆ కుక్కకు చెప్పుము ! అది మొరిగినచో స్వర్గలోకము నకు చ్యుతిలేదు. అతడు బ్రతుకదలచినచో శస్త్రసన్యాస మొనరించి, సామ్రాట్టులకు శరణురమ్మని చెప్పుము. సింహాసనమునకై పోరాడ నిశ్చయించినచో, మొదట అతని రక్తము అభిషేకము చేయబడునని కూడ చెప్పుము."

"అయినచో మీ రిచ్చు ప్రత్యుత్తరము....?"

"దానిని నేను రణరంగములో యివ్వగలను. ఆ ద్రోహని ....విశ్వాసఘాతకుని చంపి, తరువాత జవాబు చెప్పగలను...." అని ఒబిలోనున్న ఖడ్గమును వెలికితీసి భయపెట్టినది.

ఈ జవాబుతో భీతిల్లిన ఆ పత్రవాహకుడు సూటిగావెళ్ళి జరిగిన సంగతిని విరూపాక్షరాయల కెరిగించినాడు.

"ఓసీ - అబలా ! నన్నవమాన పరచునంతటి గర్వమెక్కి నవా ? కానిమ్ము. దాని ఫలితమును నీవూ నీ కుమారుడూ త్వరలో అనుభవింపగలరు" అని దీర్ఘముగా ఒక నిట్టూర్పు వదలి విరూపాక్ష

రాయలు సింగన దండనాయకునకు విజయనగరముమీద నండెత్తి దానిని వశపరచుకొనుట కాజ్ఞాపించినాడు.

ఆ యాజ్ఞ ప్రకారము సింగన దండనాయకుని సైన్యము వెళ్ళి విజయనగరమును ముట్టడించినది.

విజయనగర కోటను సులభముగా వశపరచుకొనుటకు వీలుగా దనియే పొన్నలాదేవి అతనికి సమరాహ్వాన మిచ్చినది. కోటలోపల రక్షణకై ఎక్కువమంది సైనికులు లేరనితెలిసియూ- నగరము శత్రువుల వశమగుటకు దీర్ఘకాలము పట్టగలదని గ్రహించి ధైర్యమును వహించి నది. తా నెట్లయిననూ తిమ్మయామాత్యుడు వచ్చువరకు దుర్గమును రక్షించినచో, తరువాత తనకేభయమూ లేదని అనుకొన్నది. కాని, తానొకటి దలచిన, దైవమెకటి దలచినది.

విరూపాక్షరాయలు పక్షములోనివారు రాజధానిలో అనేకులున్నా రను విషయమామె మరచినది. ఆ ద్రోహులు విరూపాక్షరాయలవద్ద ధనముగైకొని, నగరరక్షణకై నియమింపబడిన సైనికులను తమ వైపుకు త్రిప్పుకొన్నారు. ఈ విధముగా విజయనగరకోట ఏ పోరాట మునూ లేకయే విరూపాక్షరాయల వశమైనది. పొన్నలాదేవి చూచు చుండగనే జయనగర మామె చేయిజారిపోయినది.

విరూపాక్షరాయలు తన దైత్యబలముతో విజయోన్మత్తుడై అంతఃపురమును ముట్టడించినాడు. సాధ్యమైనచో మల్లికార్జునరాయ లనూ, మహారాణి పొన్నలాదేవినీ ప్రాణములతో చెరబట్టి వారిమీద పగ దీర్చుకొనవలయుననునదే అతని ఆశయము. అందులకై దైత్యావేశ ముతో అతడంతఃపురముమీద వెళ్ళి పడినాడు.

కాని, అప్పటికి నగరము విరూపాక్షరాయల వశమైనవార్త విని, అతడంతఃపురము మీదకు రావచ్చునని ఊహించి, ఆమె అంతఃపుర రక్షణకై స్వయముగ తానే నిలచినది.

విరూపాక్షరాయలు సుడిగాలివలె అంతఃపురమును చుట్టియున్న కోటమీద వచ్చి పడినాడు. అచ్చట భయంకరమగు పోరు జరుగగలదని అతడనుకొనలేదు. మహారాణికాని, మల్లికార్జునరాయలుకాని తనను

ప్రతిఘటించక, శరణువచ్చి ప్రాణభిక్ష నర్థించగలరని భావించిన అత నికి నిరాశయే కలిగినది. అతడు తన బలమును కేంద్రీకరించి, కోట ద్వారమును భేదించి. లోనికి ప్రవేశించినాడు.

మహానదీ ప్రవాహమువోలె వెనువెంటనే అతని సైనికులుకూడ లోనికి చొచ్చుకొని పోయినారు. వారు లోనికి ప్రవేశించి అడ్డుపడిన వారిని హత్యజేసి, అంతఃపురమునూ, భాండాగారపు ఆయకట్టు ప్రదేశము లనూ వశపరచుకొన్నారు.

విరూపాక్షరాయలు మహారాణినీ, మల్లికార్జునరాయలనూ చెఱబట్టు కొనుటకై, చేత ఖడ్గము ధరించి తానే స్వయముగా ముందుకు వెళ్ళి నాడు. కాని, అప్పటికే మహారాణికొరకై అంతఃపురమంతయూ శోధిం చిన సైనికులు తిరిగివచ్చి :

"ప్రభూ ! మోసము జరిగినది. ఎచ్చటా మల్లికార్జునరాయలు కాని, మహారాణి పొన్నలాదేవికాని కనబడలేదు. బహుశః వారు యుద్ధములో మరణించి యుండవచ్చు. లేదా తప్పించుకొని పారిపోయి యుండవచ్చు" అని తెలియజేసినారు.

"మీరు వారిని అంతఃపురములో వెదకితిరా ?" సింగన దండ నాయకుడు ప్రశ్నించినాడు.

"వెదకినాము ప్రభూ, ఎచ్చటనూ వారి జాడ కనబడలేదు."

"మల్లికార్జునరాయల భార్య-బిడ్డలుకూడ లభింపలేదా ?" విరూ పాక్షరాయ లడిగినాడు.

"లేదుప్రభూ !"

"అయినచో.... వారు తప్పించుకొని పారిపోయినారా ?"

"ఉండవచ్చును, ప్రభూ !" అన్నాడు సింగన.

ఈ మాటతో విరూపాక్షరాయలకు చాల నిరాశ కలిగినది.

"ఉండదు. ఎవరు తప్పించుకొనిననూ మహారాణి పొన్నలాదేవి యిచ్చటనే యుండవలయును. ఆమెను వెదకుడు." విరూపాక్షరాయలు భటుల కాజ్ఞాపించి, తాను సింహాసనము నాక్రమించుకొనుటకై వెళ్ళినాడు. అతని యాజ్ఞప్రకారము రాజబొక్కసమును స్వాధీనపరచుకొనుటకై

సింగన దండనాయకుడు వెళ్ళినాడు. తక్కినవారు మహారాణి పొన్నలా దేవినీ, మల్లికార్జునరాయలనూ వెదకుటకు వెళ్ళినారు.

ఇంతలో ఒక భటుడు వచ్చి విరూపాక్షరాయల కిట్లు చెప్పినాడు : "ప్రభూ ! మహారాణి పొన్నలాదేవిగారు అంతఃపురము ముందు పడి మరణించియున్నారు. వారి చేతిలో నున్న ఖడ్గమును తిలకించిన, మనతో పోరాడి మరణించినట్లు దోచుచున్నది."

ఇది విని విరూపాక్షరాయలు, "ఓసీ, నీచస్త్రీ ! చివరకు నన్ను మోసగించితివా ?" అని నిట్టూర్చినాడు. కాని, సింహాసనము తనదిగా అయిన సంతోషమీ పరాభవమును తుడిచివేసినది.

## 11. మరణదండనము

విరూపాక్షరాయలు మల్లికార్జునరాయలకొరకై నగరమంతటా విడువకుండా శోధించినాడు. కాని ఎచ్చటనూ అతడు కనబడలేదు. అతడేమైనాడో ఎవరునూ చెప్పలేకపోయినారు. పొన్నలాదేవివలె అతడుకూడ మరణించియుండునా? లేక తప్పించుకొని పారిపోయి యుండునా ? ఏదియునూ తెలయకపోయినది.

తుదకెవరో విషయమును తెలిపినారు : పొన్నలాదేవి యాజ్ఞకు కట్టువడి మల్లికార్జునుడు తన భార్యా బిడ్డలతో సహా శత్రువులు ముట్టడించక మునుపే నగరమును వదలి ఎచ్చటికో వెళ్ళిపోయినాడని.

ఈ వార్తవిని విరూపాక్షరాయలకు సంతోషము కలుగకపోయిననూ మల్లికార్జునరాయల గతి తెలియుటచే నెమ్మది కలిగినది. అతడెచ్చట నున్ననూ వెదకి, పట్టితెచ్చి తన కప్పగించవలసినదిగా గూఢచారుల కాజ్ఞాపించి వారిని బంపి, నిశ్చింతగా సింహాసన మధిష్ఠించి 'సామ్రాట్టు'ని ఘోషించుకొన్నాడు. అరిరాయ విభాండ, పరరాయభయంకర, హిందూరాయ సురత్రాణ, కర్ణాటకేశ్వర, రాయకుంజర మొదలైన బిరుదములను ధరించి, విజయనగర సింహాసనమునకు తానే నిజమైన ప్రభువని చాటించి, సామంతులు - మన్నీలు వగైరా అందరిచేతనూ ప్రమాణములను స్వీకరించినాడు.

మోసముతో అధిష్ఠించిన సింహాసనమును దక్కించుకొనుటకై అతడు ప్రజల నేమరించుట కనేక ధర్మకార్యములను చేయమొదలిడినాడు. గుడి, గోపురముల జీర్ణోద్ధారమును జేయించినాడు. సామ్రాజ్య మందలి సకల వర్ణాశ్రమ ధర్మములనూ సమానముగ పాలించునట్లు చాటింపు వేయించినాడు. ప్రజల యభిమానమును చూరగొనుటకై, ఎన్నియో పన్నులను తీసివైచినాడు.

దీనిచే నాయకుడు లేని పాలనా యంత్రమునకు క్రొత్త నాయకుడు లభించినట్లయినది. ప్రజలలో చెలరేగిన అరాచకత్వమునకునూ తన వ్యవస్థ చేకూరినట్లయినది. ప్రజలు తమను బహామనీ మరియు ఉత్కళ శత్రువులనుండి కాపాడుటకు సమర్థుడైన విరూపాక్షరాయలను ప్రభువుగా అంగీకరించినారు. అతడు సామ్రాట్ ప్రౌఢదేవరాయల తమ్ముని కుమారుడగుటచే జనత అతని సార్వభౌమత్వమును సహించినది.

విరూపాక్షరాయలు సింహాసన మధిష్ఠించి, తన చిరకాల స్వప్నమును యధార్థముగావించుకొన్నాడు. తన తండ్రి సాధించలేని ఆకాంక్షను తాను సాధించినాడు. ఇప్పుడతనికి పదవీ భ్రష్టుడైన మల్లికార్జునునిపట్ల ద్వేషమునకంటెనూ అనుకంపమే జనింపసాగినది.

ఎందువల్లననగా, తాను విజయనగరముపై దండెత్తి వచ్చినపుడు తలదాచుకొన్న మల్లికార్జునరాయలు పోగొట్టుకొన్న సింహాసనమునకై మరల ఏ ప్రయత్నమునూ చేయలేదు. అతడు తిమ్మయామాత్యుని ఆశ్రయమునకువెళ్ళి నిలచిననూ అమాత్యుని సలహామేరకు విరూపాక్షరాయలను అధికారచ్యుతునిగా జేయుట కే చర్యయునూ తీసుకొనక ఊరక ఉండిపోయినాడు.

తిమ్మయామాత్యుడు శత్రువైన కపిలేశ్వర గజపతి నోడించి, తండీర ప్రాంత్యమునుండి తరిమివేసినాడు. తరువాత తన లక్ష్యమునతడు విజయనగరము వైపునకు త్రిప్పినాడు. కాని మల్లికార్జునుడు మాత్రము సింహాసనమునకై జరుగు ఈ యుద్ధమున కెందులకో సుముఖుడుగా లేడు. సామ్రాట్టులకు యిష్టములేని యీ యుద్ధమొనరించుటకు అమాత్యులకు కూడ ఉత్సాహము లేకపోయినది. అతడు వేరు దారి గానక తన సైన్యమును విసర్జించి, సామ్రాట్టుల సేవకై నిలబడినాడు.

మల్లికార్జునరాయలు తన రక్షణ కావశ్యమైనంత సైన్యమునుంచు కొని, తక్కినవారికందరకూ తమ తమ యిండ్లకు వెళ్ళవలసినదిగాచెప్పి, తాను కాంచీ పట్టణమును రాజధానిగా చేసుకొని అచ్చట నిలచినాడు. అచ్చటి విద్వాంసుల సహవాసమందునూ, గురుపీఠము లందుననూ, వరదరాజస్వామి సేవతోనూ తన జీవన వ్యధను, బాధలను మరువ ప్రయత్నించినాడు.

ఈ విధముగా రాజరికములో లభించని శాంతిని - నెమ్మదినీ విద్వాంసుల యొక్కయు, కళాకారుల యొక్కయు సాన్నిధ్యములో పొందుటకై నిలచిన, అతనినుండి తనకేవిధమైన యిబ్బందియునూలేదని భావించి, విరూపాక్షరాయలతనిపై పగదీర్చుకొనలేదు. అతనిని క్షమించి, జీవదాన మొసంగి తన యౌదార్యమును ప్రకటించుకొనినాడు. మల్లికార్జునరాయలకు కాంచీ రాజ్యమును కానుకగా యిచ్చి, అతనిపాటు కతనిని వదలి, తాను సామ్రాజ్య వైభవాట్టహాసములలో మునిగిపోయినాడు.

సామ్రాట్టు కావలయుననిన అతని కోరిక ఫలించిననూ, ఆ వైభవము మాత్రమతనికి దక్కలేదు. మల్లికార్జునరాయల పాలనలో రాజ బొక్కసమునకు రావలసిన ధనము సక్రమముగారాక అది ఖాళీగా నున్నది. పూర్వీకుల నిధియని చెప్పబడు గుప్తనిధి ఎచ్చట నున్నదో తెలిసికొనుటకై ఎంత ప్రయత్నించిననూ అతనికి తెలియక పోయినది. అతడరాచకమైన సామ్రాజ్యమును, అనాయకమైన పాలనమును, ఖాళీగా నున్న రాజభాండాగారమును వీటిని చూచుకొని సింహాసనమున కూర్చొన వలసిన పరిస్థితి సంభవించినది.

ఈ మాత్రపు భాగ్యము నాశించి అతడు సామ్రాట్టుగా వెలుగొంద వలయునని అనుకొనలేదు. సామ్రాట్ పదవి యిచ్చెడి వైభమునకై అతడు సింహాసనము నపేక్షించినాడు. దాని అట్టహాసమునకై సామ్రాజ్యము నభిలషించినాడు. కాని అవిమాత్రమతనికి లభించలేదు. అందుచే నతనికి చాల నిరాశ కలిగినది.

అదృష్టవశమున దేవరకొండలో పరాజితుడైన బహమనీసుల్తా

నుని భయము సామ్రాజ్యమునకు తాత్కాలికముగ తప్పినది. అదే విధముగ తిమ్మయామాత్యునిచే దెబ్బతిని వెనుకకు మరలిన ఉత్కళగజపతి భీతికూడ కొంతవరకూ నివారణమైనది. తాను సింహాసనమును దురాక్రమణ చేయుటకు ప్రయత్నించగా, వెలుపల శత్రుబాధ లేకపోవుట తన భాగ్యమని భావించినాడు విరూపాక్షరాయలు. అప్పటి రాజకీయ పరిస్థితి కూడ యీ విధముగ అతని కనుకూలమైనది.

అల్లాయుద్దీనుషు మరణించినపిమ్మట అతనియనంతరము హుమయూను సుల్తానైనాడని తెలియుచున్నది దేవరకొండ యుద్ధములో విజయనగర వీరభటులచే దెబ్బతిని, పరాజితుడై పారిపోయినపిమ్మట అతడెక్కువరోజులు జీవించలేదు. ఇది జరిగిన మరుసటి సంవత్సరముననే అతడు మరణించినాడు. తదనంతరము నిజాంషాహి బహమనీ సుల్తానైనాడు. కాని అతడుకూడ కేవలము రెండు సంవత్సరములు మాత్రమే రాజ్యపాలన మొనరించి, మరణించినాడు. ఇపుడు ఇమ్మడి (రెండవ) మహమడ్ సింహాసనమునకు వచ్చియున్నాడు.

ఈ మహమడ్ కాలమున మున్నెన్నడునూలేని బలమైన యిరుపు సామ్రాజ్యమందిరములో పుట్టినది మండలేశ్వరులలో పరస్పరము కలహము లేర్పడసాగినవి. వజీరులలో, ఆస్థానీకులలో పక్షములేర్పడినవి. సైనికులలో క్రమశిక్షణ లోపించినది. అది 'షాహి' రాజ్యములుగా చీలిపోవు మార్గమున సాగినది. దీనిని తప్పించుటకు మహమడ్ తన శక్తి నంతయునూ కేంద్రీకరింపవలసి వచ్చినది. అతడీ వ్యర్థ పోరాటములో నిమగ్నుడై యుండగా విజయనగర సింహాసన మధిష్ఠించిన విరూపాక్ష రాయలకు తన యధికారమును భద్ర పరచుకొనుట కవకాశ మేర్పడినది.

అయిననూ ఘటకాళ్ సంఘటనయందు ఉభయ రాజ్యములకునూ యుద్ధమనివార్యమైనది.

ఆదినుండియు బహమనీసుల్తానులు తాము 'అశ్వపతు' లను పొగడ్తకు పాత్రులైనారు. అదేవిధముగ ఉత్కళ ప్రభువులు తాము

'గజపతు' లని చెప్పుకొనెడివారు. విజయనగర రాజులు తాము 'నర పతు' లను బిరుదును ధరించిన వారు. బహమనీ సుల్తానులు స్వయుద్ధ కలహములో మునిగియుండగా, వారి అశ్వ వ్యాపారము తప్పి, విజయ నగరమువారి పాలైనది.

పూర్వమునుండియు విదేశములనుండి వచ్చెడి అశ్వములు పశ్చిమ తీరపు రేవు పట్టణములగు భట్కళ్, హొన్నావరము, మంగుళూరు, గోవా మార్గములుగా దేశములోనికి దిగుమతి యగుచుండెడివి. అప్పటి వ్యాపారులు వాటిని విదేశీ వ్యాపారులైన అరబ్బీ, పోర్చుగీసుల నుండి తెప్పించుకొని, లాభమున కమ్ముచుండెడివారు. ఈ యశ్వముల కధిక ధనమిచ్చి బహమనీ సుల్తానులూ, విజయనగర రాజులూ కొనుచుండెడి వారు. గుఱ్ఱములకు మారుగ విదేశీవర్తకులు భారత దేశమునుండి పట్టు బట్టలు, మెణుప్పు, సాంబారు పదార్థములు, వెండి, బంగారు, వజ్రములు మొదలగు వస్తువులను కొనిపోయెడి వారు. ఇది చాల లాభదాయకమైన వ్యాపారమగుటచే విజయనగర సామ్రాజ్యమునకు స్వర్ణవాహిని ప్రవ హించెడిది. ఈ వృత్తిలో నిమగ్నులైన వర్తకులు శ్రీమంతులై మెరయ సాగినారు.

అప్పటికింకనూ గోవా విదేశీవ్యాపార కేంద్రము కాలేదు. అశ్వము లన్నియు విజయనగర ప్రముఖ రేవుపట్టణమైన భట్కళ్ మూలముననే వచ్చుచుండెడివి. కాని భట్కళ్‌నందు జరిగెడి ఈ అశ్వవ్యాపా రము మహమ్మదీయ వర్తకుల చేతిలోనుండెడిది. ఒక భట్కళ్ నందు ఇరువదివేలమంది ముస్లిము లీ వ్యాపారములో నున్నారు.

రెండవ మహమద్ తనకు కావలసిన అశ్వములను భట్కళ్ వర్తకులనుండియే కొననలసియున్నది. విరూపాక్షరాయలు విజయనగర సింహాసనములో కూర్చున్నవెంటనే ఖాళీగానున్న రాజ బొక్కసమును నింపుటకై భట్కళ్ రేవునకు వచ్చెడి అశ్వములనన్నింటిని తానే కొని, లాభమునకు వాటి నప్పటి వర్తకుల కమ్ముచుండెడివాడు. అందువలన గుఱ్ఱముల ధర సహజముగా పెరిగినది. ఈ పరిస్థితిలో విజయనగర

రాజులనుండి ఎక్కువసంఖ్యలో, అధిక ధనమిచ్చి అశ్వములను కొనుటకు బహమనీ సుల్తానుకు సాధ్యము కాకపోయినది. ఎందువల్లననగా ఉత్తమశ్రేణికి చెందిన అశ్వముల నన్నింటిని విరూపాక్షరాయలు తన లాయమునకు చేర్చుకొనెడివాడు. మధ్యమశ్రేణికి చెందిన వారువములు మాత్రమే అమ్మకమునకు లభించెడివి. దీనితో విసుగుజెందిన మహమద్ 'కాళసంత'లో తనకు కావలసిన అశ్వములను కొనుటకు నిశ్చయించి, ఈ యుద్యమమునకు సమర్థులైనవారిని నియమించినాడు.

ఈ విషయ మెట్లో విరూపాక్షరాయలకు తెలిసినది. భట్కళ్ రేవునకు వచ్చుచుండిన అశ్వముల సంఖ్యకూడ హఠాత్తుగా తక్కువైనది. రాజాదాయముగా వచ్చుచుండిన వర్తమానమునందునూ తక్కువ పడినది. ఉత్తమాశ్వములు లభించుట దుర్లభమైనది. ఇదంతయునూ చూచి, తన కంటి కగపడకుండా అశ్వముల దొంగవ్యాపారము సాగుచుండవచ్చునను ఊహ కలిగినది. ఈ విషయమును శోధించి తెలుపవలసినదిగా ఆజ్ఞాపించి గూఢచారులను నియమించినాడు.

వారు జరుగుచున్న దొంగవ్యాపారమును కనిపెట్టి విరూపాక్షరాయల కెరిగించినారు. భట్కళ్ వర్తకులలో ప్రముఖుడైన ఇస్మాయిల్ సేట్ రేవుకువచ్చుచుండిన గుఱ్ఱముల నన్నింటినీ రహస్యముగా వేరొక రేవునకు సాగించి, బహమనీ సుల్తాను పక్షపువారి కధికలాభమున కమ్ముచున్నాడని తెలిపినారు.

ఈ వార్తవిని విరూపాక్షరాయ లుగ్రుడైనాడు. తనకు ద్రోహము తలపెట్టుచున్న ఇస్మాయిల్‌ను సముఖమునకు రప్పించుకొని, విచారణకు గురిచేసినాడు.

"హుజూర్ ! తెలియక సన్నిధానమునకు అపచారము చేసియుండిన క్షమింపుడు. నాకునూ యీ దొంగవ్యాపారమునకునూ ఏ సంబంధమునూ లేదు. తమ కెవరో అబద్ధము చెప్పినారు. తమరీ ద్రోహులమాట నమ్మరాదు. తమ పాదములసాక్షిగా మేమీ ద్రోహము చేయుచుండుటలేదు" అని అతడు అల్లామీద ఆనబెట్టి చెప్పినాడు.

"అయినచో భట్కళ్ అని అశ్వవ్యాపార మెందులకు మునుపటివలె జరుగలేదు ?"

"ఆ విషయము మాకు తెలియదు, హుజూర్ !"

"విదేశములనుండి వచ్చెడి అశ్వములు మొదట దిగునదెచ్చట?"

"రేవువద్దగల సామ్రాట్టుల అశ్వశాలకు హుజూర్ !"

"అప్పటికి వచ్చివెళ్ళేడి అశ్వముల సంఖ్య సరిగా నున్నదా ?"

"సంబంధముగల అధికారు లచ్చటనే వున్నారు. పరామర్శించ వలయును హుజూర్ !"

"అయినచో మాకు వచ్చుచుండిన ఆదాయ మెందులకు యిపుడు తక్కువైనది ? అశ్వముల సంఖ్య ఎందులకు తగ్గుచున్నది ?"

"నాకు తెలియదు హుజూర్ !"

"ఇందులో ఏదియో మోసమున్నది. మీరు రేవునకు వచ్చుచున్న అశ్వములను వేరొకచోటికి సాగించి, బహమనీసుల్తానులకు దొంగ చాటుగా అమ్ముచున్నారని తెలిసినది, యిందులకు మీ రేమి జవాబు చెప్పగలరు ?"

"అది అబద్ధము హుజూర్ !"

"కానిమ్ము, మీరు చెప్పున దబద్ధమో లేక నిజమో మేము విచారించుకొనెదము మీరు మా యతిథులుగా రాజధానిలో కొంతకాల ముండవలయు" అని అతనిని కొంతకాలము నిర్బంధములో నుంచుట కాజ్ఞాపించినాడు.

కాని అతనిని చెఱసాలలో నుంచుటవలన ఏ విశేష విషయమునూ విరూపాక్షరాయలకు తెలియలేదు. అతడు సింగనదండనాథునితో దీర్ఘముగా నాలోచించి, ఒక పన్నుగడ పన్నినాడు. తరువాత ఇస్మాయిల్ సేఠ్‌ను విడచిపుచ్చి :

"సాహెబ్ ! మీరు నిరపరాధులని మాకు తెలిసినది. ఇందులో మీ ప్రమేయ మేమియునూ లేదనికూడ గ్రహించితిమి. మా వలన మీకు తొందర కలిగినందులకు విచారించుచున్నాము" అని గౌరవముగా అతనిని భట్కళ్‌నకు పంపివేసినాడు.

తనమీద విద్రోహారోపణ నిరాధారమైనదని సామ్రాట్టు గ్రహించి నందులకు ఇస్మాయిల్ సేఠ్‌నకు చాల సంతోషమైనది. అతడు భట్కళ్‌ను చేరుకోగానే ద్విగుణీకృతోత్సాహముతో తన దొంగవ్యాపారమును సాగింప మొదలిడినాడు.

ఇట సింగన దండనాయకుడు తన నమ్మికకు పాత్రుడైన నాగన నాయకుని ఇస్మాయిల్ యొక్క రహస్యమును భేదించుటకై నియోగించి, అతనినుండి రాగల వార్తకై నిరీక్షించసాగినాడు.

నాగననాయకుడు తన పరివారముతో బయలుదేరి భట్కళ్ రేవునకు మారువేషముతో వచ్చి దిగినాడు.

ఒకటి రెండు వాసరములు వ్యర్థముగా గడచిన పిమ్మట ఒక మంచి వార్త వినవచ్చినది. ఓర్మజ్‌నుండి అయిదువందల అశ్వరాజముల నెక్కించుకొని ఒక విదేశీ నావ భట్కళ్ రేవునకు రానున్నదని తెలిసినది. ఇది విని నాగననాయకుడు చాల సంతసించి, తన గూఢచారి దళమున కీయవలసిన సూచననిచ్చి, తాను భట్కళ్ రేవులో ఒక కూలివానివలె వేషముధరించి పడవరాక నెదురుచూచుచూ కూర్చున్నాడు.

నావ పద్ధతి ప్రకారము రేవునకు రాలేక దూరములో ఆగి లంగరు వేసినది. దానినుండి చిన్న పడవలో కొందరు అరబ్బీ వర్తకులు రేవునకు వచ్చి ఇస్మాయిల్ సేట్ యొక్క కొట్టునకువెళ్ళి. అతనితో ఏదియో రహస్యముగా మాటలాడి కనుమరుగైనారు. వచ్చిన ముగ్గురిలో ఒక్కడు మాత్రము పడవను నడిపించుకొని వెనుకకు వెళ్ళినాడు. తక్కిన యిరువురు కనుమరుగైన దిక్కును పసిగట్టి నాగననాయకుని గూఢచారి దళము తమ పన్నుగడను సిద్ధపరచినారు.

ఆ రాత్రి నావ అదివరకే నిర్ణయించినట్లు, భట్కళ్‌రేవును వదలి దానికి చాల దూరములోనున్న ఒక చిన్న రేవునకు వెళ్ళినది. వేకువ ఝాము వేళకు నాలుగైదు పెద్ద పడవలలో స్టీమరులో నున్న అశ్వములను తీరమునకు చేర్చు కార్యము ప్రారంభమైనది. వాటిని యిస్మాయిల్ సేట్ అనుచరులు పట్టుకొని సమీపములో నున్న మామిడితోటలోగల లాయమునకు తీసుకొనివెళ్ళి కట్టి వచ్చుచున్నారు. ఈ విధముగ పడవనుండి దాదాపు రెండువందల అశ్వములను సాగించిన పిమ్మట, నావ అప్పటినుండి మాయమైనది.

ఆ తీరమునకు వచ్చిన అశ్వములు తమ లాయమును చేరకనే తడవుగా, ఒక్కసారిగా నలువైపులనుండి ఆయుధపాణులైన భటు లైదు వందలమంది వచ్చి, అశ్వములను కాయుచున్న వారిపైబడి వారినిజంపి, ఇస్మాయిల్ సేట్ యొక్క సేవకుల నందరనూ బంధించినారు. వారిని విచారణకు గురిచేయగా ఇస్మాయిల్ మోసమంతయునూ బయటపడినది.

ఈ కుట్రలో ముస్లిం వ్యాపారు లందరియొక్క ప్రవేశ ముండుటను జూచి విరూపాక్షరాయలకు వారిమీద కోపమువచ్చినది. అతడు యిస్మాయిల్‌ను ఉరికంబ మెక్కించినాడు. ఇదిజూచి భట్కళ్ ముస్లిం

వర్తకులందరూ తిరుగబడి అచ్చటగల అధికారులను సంహరించినారు. దీనితో కోపించిన విరూపాక్షరాయలు అచ్చటగల ముసల్మానులనందరనూ క్రూరముగా సంహరించుటకు సింగన దండనాయకున కాజ్ఞాపించినాడు.

అతని యాజ్ఞ మేరకు నాగననాయకుడు భట్కళ్‌మీద దండెత్తి, స్త్రీలు-శిశువులనక అచ్చటగల ముస్లిముల నందరనూ చిత్రవధ జేసినాడు. ఈ యత్యాచారములో పదివేలమంది మహమ్మదీయులు మరణించినారట. తప్పిదారి మిగిలిన వేయిమంది యవనులు పారిపోయి గోవా యందు తలదాచుకొన్నారు.

ఈ వార్త విని సుల్తాను మహమద్‌నకు విజయనగర సామ్రాట్ విరూపాక్షరాయలమీద విపరీతమైన కోపము వచ్చినది. అతడు హిందూ రాజ్యమైన విజయనగరమును నాశనమొనర్చి తన మతమువారికి జరిగిన యన్యాయమునకై పగదీర్చుకొనగలనని ప్రతిజ్ఞ జేసి, ఈ కార్యమునకు తన వజీరుడైన మహమద్ గవానును నియమించినాడు.

మహమద్ గవాన్ దక్షుడగు వజీరుడైనట్లే సమర్థుడగు దండ నాయకుడుకూడాను. అతను విజయనగరమువారి అమానుష వర్తనరోషుడై, పెద్ద సైన్యమును వెంటబెట్టుకొని వెళ్ళి బెల్గాం దుర్గంమీద పడినాడు. దాని పాలకుడైన విక్రమరాయలకు భీతి కలిగినది. అతడు విజయనగర సామ్రాట్టువద్దకు సాయమును కోరి భటులను బంపు నంతలో బెల్గాందుర్గము శత్రువుల వశమైనది. విక్రమరాయలు పరాభవము జెంది పారిపోయినాడు.

విజేతయైన మహమద్ గవాన్ అచ్చటి ప్రజలమీద ఏ చర్యలునూ తీసుకొనక, ఆ దుర్గ రక్షణకు తగిన ఏర్పాటులు గావించి, సందర్భరితమైన రేవు పట్టణమగు గోవాను ముట్టడించుటకై బయలుదేరినాడు —

గోవా ఎక్కువ పోరాటము లేకయే యవనుల వశమైనది. చాల రోజులుగా సామ్రాజ్యమునకు చెందిన గోవా (గోమాంతకము) ఈ విధముగా విజయనగరరాజుల చేయివిడచిపోయినది. విరూపాక్ష రాయల మూర్ఖత్వమువలన అది అనేక శతమానములవరకు దాస్యము ననుభవించవలసివచ్చినది ! *

---

* అది ఇప్పటికీ పోర్చుగీసుల వశములోనుండుట విచారకర విషయము.

# 12. రాజర్షి

ఇటు గోవా, బెల్గాం ప్రాంత్యములు విజయనగరిమునుండి తొలగి పోయినవను వార్తతోబాటు యిటు దక్షిణాపథమునుండి అంతకంటెనూ భయంకరమైన వార్త వచ్చినది. విరూపాక్షరాయల దుష్పరిపాలనమును సహించలేక పాండ్యరాజగు భువనైకవీర సమరకోలాహలుడు సార్వభౌమునిపై తిరుగుబాటు చేసినాడు.

పాండ్యులు మొదటి నుండియూ స్వతంత్ర సామ్రాట్టులుగా వచ్చినవారు. కాని వారు సుందరపాండ్యుని కాలమున స్వజాతి కలహముతో యవనులపాలై, స్వాతంత్ర్యమును పోగొట్టుకొన్నారు. అటు పిమ్మట కంపరాయలు యవనులను మధురనుండి తరిమివేసిన తరువాత పాండ్యులు విజయనగర సామంతరాజులై సామ్రాజ్యసేవ చేయుచు వచ్చినారు. అయిననూ వారిని, తాము పోగొట్టుకొన్న సామ్రాట్ పదవి చేయెత్తి పిలుచుచున్నది. వారు విజయనగర సామంత రాజరికమును విడదిపుచ్చి, స్వతంత్రులగుటకై పొంచియున్నారు. అందులకై తగిన సమయము కొరకెదురు చూచుచున్నారు. మల్లికార్జునరాయల కాలమున కలిగిన అరాచకత్వము వారికి బలిష్ఠులగుట కవకాశమిచ్చినది. అతనిని మూలకుత్రోసి మోసముతో సింహాసన మెక్కిన విరూపాక్షరాయల విరుద్ధముగ వారు దండెత్తి, మల్లికార్జునరాయల పక్షము వహించి, యిపుడు స్వాతంత్ర్యమును చాటించుకొన్నారు. ఇది చూచి చోళులుకూడ నుత్తేజితులై తండీర ప్రాంత్యమున దండెత్తి తామూ స్వతంత్రులైనారు.

ఈ వార్త మెఱుపువలెవచ్చి రాజధానిని చేరినది. విరూపాక్షరాయలీ వార్త విని భీతిల్లినాడు. అతనికి పాండ్య, చోళ భూపతులమీద భయంకరమైన కోపము వచ్చినది. వారిని శిక్షించి తగిన బుద్ధిగఱపుటకై నిశ్చయించి, వెంటనే సింగన దండనాయకుని సముఖమునకు రప్పించుకొన్నాడు.

అప్పటికే సింగనదండనాయకునకుకూడ చారులవలన పాండ్య-చోళుల విద్రోహ విషయము తెలిసినది. అత డీ విషయమై సార్వభౌములను సందర్శించి సమాలోచించవలయు ననుకొనుచుండగ పిలుపందినది.

"సింగనా, విన్నావా విషయము? ధూర్తులగు ఆ పాండ్య - చోళ ప్రభువులు మనపై కత్తిగట్టినారట. వారి కంత ధైర్యమెట్లు వచ్చినదో ఆశ్చర్యమగుచున్నది!"

"ప్రభూ! ఇందులో మల్లికార్జునరాయల ప్రవేశమున్నట్లు దోచు చున్నది. లేనిచో పిరికిపందలైన ఆ మండలేశ్వరులకు సామ్రాట్టులపై కత్తిగట్టునంతటి ధైర్యమెక్కడిది?"

"నాకునూ అట్లే తోచుచున్నది. మనమా ద్రోహియగు మల్లికార్జున రాయలను యిదివరకు వూరక వదలుటయే అపరాధమైనది. అతని వలన మనకే యాపదయునూ కలుగదని భావించి మోసపోయినాము. చూడగా యీ విద్రోహమున కంతటికీ ఆ నీచుడే కారణమని తోచుచున్నది. అతనిని మనమిపుడు వూరక విడువరాదు!" అని ఘర్జించినాడు.

"ప్రభూ! మల్లికార్జునరాయలకు తమపై కత్తి గట్టునంతటి ధైర్య మెక్కడిది? సింహాసనముమీద నున్నప్పుడే దానిని దక్కించుకొనలేని అత డిక రాజ్యకోశములు లేనపుడెట్లు దక్కించుకొనగలడు? చూడగా దీనికంతటి కినీ సంచాలకుడతని దుష్టమంత్రి తిమ్మయ నాయకుడే కారణమని తోచు చున్నది. మన మీ విషయమై ఏ నిర్ణయము చేయుటకైననూ ముందు, ఈ విద్రోహ నాటకమునకు సూత్రధారు లెవరైనదీ కనిపెట్టి, విద్రోహ వృక్షముయొక్క కూకటివేరును కోసివేయవలయును" అని అన్నాడు.

"అయినచో నీ సలహా ఏమి?"

"మనము వెంటనే నాగన నాయకుని కంచికి బంపి, సార్వభౌముని చర్యలను కనిపెట్టి రమ్మనుట మంచిది. ఉపాయముగా విద్రోహులెవరైనదీ తెలుసుకొని వారినందరినీ బంధించి చెఱసాలలో వేసినచో, ఈ విద్రోహ వృక్షమెండిపోవుట కెంతయో కాలము పట్టదు. అది యెండిపోయిన తరు వాత దాని శాఖలగు పాండ్య - చోళ ప్రభువులుకూడ తమంతట తామే మనకు శరణు రాగలరు. వారి మదమణచుటకు మనము విద్రోహపు వేరును వెదకి గొడ్డలితో నరకవలయునేకాని, కేవలమా తరు శాఖలను నరికిన ప్రయోజనములేదు. శాఖలను నరికిన కొలదినీ మరల మరల విద్రోహపు

చివురెత్తవచ్చును. మనము దాని వేరును వెదకిపట్టి తరువును నాశన మొనరించవలయును." అన్నాడు.

ఈ సలహా విరూపాక్షరాయలకు సమంజసముగా దోచినది. అత డీ కార్యమునకు సింగన దండనాయకుని నియమించినాడు. అతడు కంచిలో నున్న మల్లికార్జున రాయల చర్యలను కనిపెట్టి వచ్చి చెప్పుటకై, నాగన నాయకుని తగిన పరివారముతో పంపినాడు.

నాగన నాయకు డాలస్య మొనరించక వెంటనే కంచికి ప్రయాణ మైనాడు.

సింగన దండనాయకుని మాట లక్షరాలా నిజములైనవి. ఈ విద్రోహమునకూ, మల్లికార్జునరాయలకూ ఏదియో రహస్య సంబంధమున్నదని అతడూహించినది ఒక విధముగా నిజమే అయినది. కాని అతడనుకొన్నట్లీ విద్రోహమున కంతటికీ మల్లికార్జునరాయలే కారణ పురుషుడుకాడు. అతని కుమారుడు రాజశేఖరుడీ విద్రోహమునకు మూలపురుషుడు. అత డమాత్య తిమ్మయ నాయకునితో గలసి చేయివిడచిపోయిన సింహాసనమునూ, సామ్రాజ్యమునూ మరల పొందగోరి, యీ విద్రోహమునకు ప్రేరకశక్తి యైనాడు.

రాజశేఖరున కిప్పు డిరువది యైదేండ్ల ప్రాయము. అతడన్ని విధముల ప్రౌఢదేవరాయలతో బోల్చదగినవాడు. అతనికి తన తండ్రి సింహాసనమును పోగొట్టుకొనుట కర్తవ్యమును సరిగా నిర్వహింపక పోవుటచేతనూ, రాజ్యపాలనమం దాసక్తిని కనబరచక పోవుటచేతనూ, తాము రాజ్యకోశములను పోగొట్టుకొని ప్రవాసులవలె తలదాచుకొన వలసిన దుస్థితి ప్రాప్తమైనదని అనేకమారు లనిపించెడిది. జరిగిన దానికై యిపుడు వగచి ప్రయోజనములేదు. దానిని మరల పొందగల ప్రయత్నము చేయవలసియున్నది. కాని సింహాసనముకొరకై జరుపు ఏ పోరాటమునకునూ సామ్రాట్ మల్లికార్జునరాయ లుత్సాహమును కనబరచెడివాడుకాడు. ఆ ప్రస్తావన వచ్చినపుడంతయూ అతడు నిరుత్సాహమును ప్రకటించెడివాడు.

ఒకనాడీ విషయమై తండ్రీ కొడుకులకు దీర్ఘ చర్చ జరిగినది.

ఈ చర్చతో వారుభయులూ తాము విభిన్న మార్గానుసారులను సత్యమును గ్రహించినారు. కుమార రాజశేఖరుడుతండ్రియొక్క సాత్విక స్వభావమును జూచి విసిగి, ఉద్రిక్తుడై అన్నాడు :

"నాయనగారూ! విరూపాక్షరాయలపై దండెత్తివెళ్ళి ఆ ద్రోహిని శిక్షించగల శక్తి సామర్థ్యములు మీకు లేనిచో నా కనుమతి యిండు! సామ్రాజ్య లక్ష్మిని ఆ దుష్టుని బారినుంచి రక్షించితెచ్చి మీపాద కమలముల కప్పగించగలను."

ఈ మాటవిని మల్లికార్జునరాయలు కుమారుని ముఖ మవలోకించి నవ్వి వూరుకున్నాడు.

"ఎందులకు నాయనగారూ, నవ్వుచున్నారు? నా మాటలు హాస్యాస్పదములుగా నున్నవా? ఇవి కేవలము వినోదమునకై ఆడుచున్న మాటలు కావు. నా హృదయాంతరాళమునుండి వెలువడి వచ్చుచున్న వాక్కులు. మీరు నా కనుజ్ఞయిండు. ఆ ద్రోహిని బరిమార్చి వచ్చెదను."

"నాయనా, రాజ్యకోశములచే వంచితులమైన మనము సమర్థుడునూ, ధూర్తుడునూ అయిన ఆ విరూపాక్షరాయలను బరిమార్చ సాధ్యమా? అతని వజ్రముష్టిలో చిక్కువడియున్న సామ్రాజ్యలక్ష్మిని బంధవిముక్తను జేయసాధ్యమా? సింహాసనమును మరల మన వశము జేసుకొనుట సంభవమా? ఇవన్నియునూ మాటలలో చెప్పునంత సులభమైన వనుకొంటివా తండ్రీ? మీ అవ్వగారు-పూజ్యురాలగు పొన్నలాదేవి-ఉన్నప్పుడే ఆ ద్రోహి యొక్క కపట కృత్యములనుండి మనము తప్పించుకొనలేకపోయినాము. ఇక రాజ్యకోశములులేక వట్టి చేతులతో ఇపుడేమి చేయగలము? దీనిచే మనంతట మనమే లేనిపోని గడబిడ చెలరేపి, అతని కోపమునకు గురియై ప్రాణాపాయమును కోరితెచ్చుకొనినట్లగును, అంతియే. ఇటువంటి పిచ్చి యాలోచనలను మానివేయుము నాయనా! భగవంతుడు మన నుదుట వ్రాసిన దెంతయో అంతియే మనకు లభ్యము కాగలదు! పోగొట్టుకొనిన దానికై కృంగి కృశించుటవలన ఉన్న శాంతికూడ హరించిపోగలదు...." అని అన్నాడు.

"నాయనగారూ! మీకింకనూ రాజశేఖరుని స్వభావము తెలియదు.

అతడు మీ కంటికి బాలకుడుగా కనబడనచ్చును కాని నేను కేవలము బాలుడనుగాను. నాకునూ వయసు వచ్చినది. నా బాధ్యత ఏమియో గుర్తించి నాను. కార్యభారమునూ గ్రహించినాను. విరూపాక్షరాయలపై కత్తి గట్టినచో మనము ఆపదలో చిక్కుకొనగలమను మాట సత్యమే! కాని, దానిని సాధించు విధానమునుబట్టి ఆ విపత్తు సంభవించును. మనమీ విద్రోహ కార్యమును చడీచప్పుడులేక జరుపవలయును. చూపరులకు సంభావితుల వలె గన్పట్టుచూ, సార్వభౌమునిపట్ల నిష్ఠను కనబరచుచూ ఈ విద్రోహ లతను సామ్రాజ్యమందంతటా ప్రాకింపజేయవలయును. ఇప్పటికే విరూపాక్షరాయల విషయములో ప్రజలు విముఖులైయున్నారు. మాండలీకు లనేకులు విసిగియున్నారు. హృదయమున అవిశ్వాసమును నింపుకొనియున్నారు. ఇటువంటి వారినందరినీ మనము కూడగట్టుకొని, వారిని విరూపాక్షరాయలపై కత్తి గట్టింపజేసినచో, మన విద్రోహ వృక్షము నుండి ఫలముద్భవించకపోదు. దీనిని కార్యరూపమునకు తెచ్చుటలో మన గొప్పతన మిమిడియున్నది." అని సమాధానము చెప్పినాడు.

ఈ మాటలకు మల్లికార్జునరాయలు బదులు పల్కలేదు.

కాని, అందులకు తన సమ్మతిని మాత్రము వ్యక్తపరచలేదు.

"ఎందులకు నాయనగారూ! మన కంతటి శక్తి సామర్థ్యములు లేవని మీ భావనయా? ఈ కార్యములో మనము విఫలులము కాగలమని మీ రనుకొనుచున్నారా?" రాజశేఖరుని కంఠస్వరములో సంశయము వ్యక్తమగుచున్నది.

"కుమారా! నా మాటను నీ వన్యథా దలపకుము. మనమిపుడు దైవోపహతులము. బంగారమును పట్టినసూ అది మట్టి యగును. ఇటువంటి సమయములో మన మీ విద్రోహకార్యము నారంభించినచో ఖండితముగా దీని జాడ విరూపాక్షరాయలకు తెలియగలదు. అతడు మనలను ఊరక విడువడు. మనమీద పగదీర్చుకొనవచ్చును. దీనివలన మనమేమి సాధించినట్లగును? ఇది చాల కఠిన విషయము. తొందరపడి చేసిన నిర్ణయమునకు ముమ్మందు చాల విచారపడవలసియుండును. గనుక బాగుగా నాలోచించి ఏ తీర్మానమునకూ రావలసినదని నా సలహా! ఆపైన నీ

యిష్టము నీవు ఏమియునూ తెలియని బాలుడవుకావు. నీ బాధ్యత నీకు తెలియును. కాని, తొందరపడి విద్రోహ కార్యమునకు గడంగుటకు పూర్వమే దీర్ఘముగా నాలోచించి, నిర్ణయమునకు వచ్చుట యోగ్యమూ, సమంజసమూ నగును. నేను మీ కంఎరహ పెద్దవాడనగుటచే యీ మాటలను చెప్పుచున్నాను — తండ్రియను అధికారముతో కాదు. దీని నాలోచించుటయునూ, విడచుటయునూ మీకు సంబంధించినది...." అన్నాడు.

"అయినచో, మనము భగవంతునిపై భారమువేసి, పిరికి పందలవలె నిర్వీర్యులమై, నిష్క్రియులమై, చేతులు కట్టుకొని యీ యన్యాయముల నన్నింటినీ తిలకించుచూ కూర్చొనవలయునా?"

"దైవకృప గలుగునంతవరకు మనమేమి చేయుటకునూ లేదు నాయనా! దైవబలములేని మానవ ప్రయత్నము వ్యర్థము! ఈ యదార్థమును నేను నా జీవితమునుండి గ్రహించితిని."

"అన్యాయమును చూచుచూ వూరకయుండినచో మనము పిరికి పందలమగుట లేదా? పురుషులమైనందులకు అన్యాయమును ప్రతిఘటించి పోరాడవలదా? అన్యాయము నెదిరించి జరుపు పోరాటమెప్పటికీ వ్యర్థము కాదు."

"నాయనా! అన్యాయమును జూచినపుడు పురుషుడైనవాడు ఎదిరించి పోరాడుటలో అతని పురుషత్వ మిణగియున్నది. ఇది మానవుని దైవత్వమునకు తీసుకొనిపోవుగుణము. కాని, అందులకు సైతము కాలాకాలమున్నది. సమయాసమయములను చూడక చేయు పోరాటము వ్యర్థసాహసము కాగలదు. కాలము కలిసిరానిదే, పుణ్యాతరువునందుకూడ పిందె పుట్టదు. మనము చేయునది వ్యర్థపోరాటమైన ప్రయోజనములేదు. అది సార్థకము కావలయును. ఒకసారి వ్యర్థముగా పోరాడినందులకే నే నిపుడు ప్రవాసియైనాను. మరొక పర్యాయము పోరి మీ అందరి ప్రాణములను గండముల పాలు చేయలేను."

"అయినచో, ఇంకనూ మీకు ఆ పరాజయపు గాయము మానలేదు? ఆ యపజయముతో మీకు మామీది నమ్మకమే నశించునట్లు దోచుచున్నది."

"నాయనా! ఇది నమ్మికను గురించిన ప్రశ్నకాదు — ఆత్మ గౌర

వపు ప్రశ్నయూ కాదు! ఇది బలాబలముల ప్రశ్న — గెలుపు, ఓటమిని గురించిన ప్రశ్న! మనము న్యాయమునకై పోరుచున్నమాట నిజమే. కాని, జయాపజయములు మనయధీనములు కావు గదా! ఒకవేళ మన కీ పోరాటమునుండి నిరీక్షించిన ఫలితము లభించనిచో, రాగల పరిస్థితి నిప్పుడే గ్రహించి, పోరునకు సిద్ధపడవలయునని నేను చెప్పుచుండుట."

"నాయనగారూ! మనది ధర్మపక్షమైనచో, ఖండితముగా మనకు జయము లభించవలయును!"

"కుమారా! ధర్మపక్ష మెవరిది? అధర్మపక్ష మెవరిది? అను విష యమును నిర్ణయించువా రెవరు? దైవకృప యున్నచో మన మెందులకు రాజ్యకోశములను పోగొట్టుకొని యీ స్థితిలో నుందుము? మనము దైవోప హతులము నాయనా! విధి మనపై కోపగించుకొనియున్నది. ఏ జన్మ మున చేసిన పాపఫలమునో మనమిప్పు డనుభవించుచున్నాము. దానిని తిరస్కరించుటకు మన మెవరము?"

"నాయనగారూ! మీరు చెప్పునది నిజమే. అంతయునూ వారి వారి కర్మఫలము. కాని ఈ లోకమున అన్యాయ మొనరించకపోయినసూ, పాపము చేయకపోయినసూ దాని ఫలితము ననుభవించవలయుననునది దైవశాసనమా? మనము పాపము చేసినది నిజమేననుకొందము — కాని సామ్రాజ్య ప్రజ ఏ పాపము చేసినదని వారీ నీచునిచేత యీ విధముగా శిక్ష ననుభవించుచుండుట? ఈ విషయము నాలోచించిన కొలదినీ నాకు పిచ్చిపట్టుచున్నది...."

"కుమారా! ఆ కాలమునూ రాగలదు. అపుడు నీ సత్త్వ పరీక్ష జరుగనిమ్ము. అప్పుడామాట అక్కరలేదు" అని రాజశేఖరుని ఉత్సాహము నకు చల్లటినీరు పోసినాడు మల్లికార్జునరాయలు

ఇదివరకూ యీ మాటల నన్నింటినీ మౌనముగా వింటూ కూర్చొని యుండిన పెద్దరాయలు :

"నాయనగారూ! కాలము రానిమ్మని ఎదురుచూచుచూ కూర్చొ న్నచో అది రాజాలము. పౌరుషవంతులకు కాలము కలిసియే యుండునని మీరే చెప్పగా విన్నాను. క్రియాపరులకు మాత్రమే కాలము కలిసరాగలదని

తిమ్మయామాత్యులు చెప్పుటనుకూడ విన్నాను. మనము ప్రయత్నించనినో ఆ కాలము కూడియేరాదు. సింహాసనముకొరకై పోరాడనిచో అది మనకు ప్రాప్తమగుటలేదు" అని నిష్ఠురముగ అన్నాడు.

"కుమారా, అయినచో నీవు చెప్పునదేమి?"

"అన్నగారి మాటలను మీరు కొంత శాంతమనస్కులై ఆలించ వలయునని నా ప్రార్థన। అది వారి వైయక్తిక విచారముకాదు — మా అందరియొక్క హృదయాకాంక్ష। దీనికి అమాత్యుల ప్రోత్సాహముకూడ నున్నది. అవ్వగారుండినచో యిందులకు తప్పక సమ్మతించెడివారు।"

"అయినచో, మీకు మంచిదని తోచిన మార్గము ననుసరించి ముందునకు నడువుడు నేను సార్వభౌముడుగా ఓటమి నందినాను. నేను ఓడిన కార్యములో మీరు జయమును బొంది రండు. భగవంతుడు మీకు మేలుచేయుగాక. పెద్దల యాశీస్సులు సర్వదా మిమ్ము కాపాడుగాక!" అని రాజశేఖరుని అభిప్రాయమునకు తన సమ్మతిని తెలియజేసినాడు.

కుమారు లిరువురూ యుద్ధములో గెల్చినంత సంతసముతో అచ్చటి నుండి లేచివెళ్ళినారు. వారు వెళ్ళిపోయిన పిమ్మట మల్లికార్జునరాయలు తిమ్మయామాత్యులను జూచి :

"అమాత్యులూ। నేనొక లోకమున జీవించుచున్నాను ఈ బిడ్డ లొక లోకమున విహరించుచున్నారు. నిజము చెప్పవలయునన్న నా జీవిత మంతయునూ ఒక సుందర స్వప్నమువలె గోచరించుచున్నది. కలలో సామ్రాట్టునైనట్టు, కలలోనే రాజ్యకోశములను పోగొట్టుకొన్నట్టు దోచు చున్నది. బహుశః నేను భావిజీవిని కావచ్చును. అనుభవనీయుడు కావచ్చును. ఈ ప్రపంచమందలి కార్యములన్నియుసూ నా పాలిటికి అర్థశూన్య మైన, సత్వసారహీనమైన విషయములు. ఈ భార్యాబిడ్డలుకూడ అంతియే. అందులకే వారు చెప్పు విషయములకూ నేను ఆలోచించు విషయములకూ పొందికయే కుదురదు. బిడ్డల అభ్యుదయమార్గములో నేనడ్డు తగులుటకు ప్రయత్నించుటలేదు. పెద్దలు మీరున్నారు. వారు తొందరపడి ఆత్మ వినాశ మార్గమునకాలిడకుండునట్లు చూచుకొనుడు. వారిని హెచ్చరించి సక్రమ పథమున ముందునడుపు బాధ్యతమీది. ఈ ఘడియనుండి వారు నా బిడ్డలు కారు — మీ బిడ్డలు।" అని నిట్టూర్పు విడచినాడు.

"వారు మన బిడ్డలుకారు ప్రభూ! భగవంతుని బిడ్డలు. అతని బిడ్డలుగనే పెరుగనిండు. వారినుండి లోకమున కేమైననూ ఉపకారము కలిగినచో నేను మీకు సేవ చేసినందులకు సార్థకము కాగలదు" అని క్షణకాలము మౌనము ధరించి, అనంతరము రాజశేఖరునకూ, అతనికీ గల భేదమును గురించి చెప్పినాడు :

"ప్రభూ! తమరు రాజుగానుండియునూ ఋషిజీవనమును కోరినారు. రాజర్షి వలె గడుప నిచ్ఛగించినారు. కాని, యీనాటి రాజకీయ జీవితములో మీరు కేవలము పగటికలలు కనెడి ఆదర్శవాదులుగా మార్పు జెందినారు. వ్యవహారజగత్తునుండి దూరము వెళ్ళి స్వప్నజీవులైనారు. ఇది మీ తప్పుకాదు — మిమ్ముల నర్థము చేసుకొనజాలని మా తప్పు. మిమ్ముల జీర్ణించుకొనలేని పరిస్థితి తప్పు. మీ జీవితమంతయునూ శాస్త్ర పరిచయములోనూ, విద్వాంసుల సహవాసములోనూ, కోవిదుల సన్నిధానములోనూ గడచినది మీనుండి మేము కుటిల రాజతంత్రమును వాంఛించి అపరాధ మొనరించినాము. ఇది మా తప్పు. మా కిపుడు తెలియుచున్నది. మీరు నిష్కామకర్మలవలె యీ రాజకీయ జీవన జంఝాటమున దగుల్కొన్నారు. కాని మీ యాత్మ మాత్రము వేరొక లోకమున నున్నది. అది సత్యాన్వేషణమార్గములో పయనించుచున్నది. దానిని బలవంతముగా దెచ్చి రాజకీయములలో దింపుటకు ప్రయత్నించి మేము మహాపరాధము జేసినాము. మా నిర్బంధమునకు కట్టుపడి, అసమ్మతమైన ప్రవృత్తిలో దగులువడి మీరునూ చెడినారు." తిమ్మయామాత్యుడు తన విచారమును వ్యక్తపరచినాడు.

"నిజము చెప్పవలయునన్న, మొదటినుండియూ నా కీ రాజ్యకోశములపై మమత లేదు. కాని సామ్రాట్టుల గర్భమున జనించినందువలన నా కర్తవ్యమును పాలింప ప్రయత్నించినాను. ఇందులో నే నపజయుడనైనానని యిప్పుడే గ్రహించితిని. కాని యిదివరకునుండిన నా ద్వివిధ వ్యక్తిత్వములలో ఈ సత్యమును గ్రహించలేకపోయినాను. అందులకై విచారించుచున్నాను. ఇప్పుడైననూ ఆత్మవంచన తప్పినది కదా అని ఒకింత సంతోషముకూడ పొందుచున్నాను" అని పలికి మల్లికార్జునరాయ లేదియో కలగంటూవున్నవానివలె కూర్చొన్నాడు.

కొంతసేపట్లు మౌనము వహించియుండి, స్వగతమువలె మరల అన్నాడు :

"అమాత్యులూ! ఈ జీవిత మొక నాటకము నేను వేరు — నా యదార్థ స్వరూపము వేరు. నా నిజమైన ఉద్దేశము వేరు, గమ్యము వేరు. ఇవేవియునూ శాశ్వతమైనవి కావనికూడ తెలియును. అందులకే ఈ రాజ్యకోశములు వచ్చినపుడు వద్దనలేదు. అవి పోయినపుడూ నాకు దుఃఖము కలుగలేదు. ఇపుడు నాకు నా నిజస్వరూపము బాగుగా గోచరించుచున్నది. అందులకనియే బిడ్డలకు మీ దారి మీది - నా దారి నాది యని చెప్పినాను" అని తేలికగా నవ్వినాడు.

ఈ మాటలకు అమాత్యుడు జవాబు చెప్పలేదు.

"అమాత్యులూ! నా కెన్నియోమారులు సామ్రాట్టునై పుట్టుటకంటెనూ సామాన్యుడనై జన్మించియుండిన ఎక్కుడు నెమ్మదిగా నుండెడివాడనను భావన కలిగెడిది. కాని, యిదంతయును ఎవరి యిచ్ఛ? నాచే యిటు రాజధర్మమూ పాలనకాలేదు—అటు ఆత్మజ్ఞానమూ లభించలేదు. నేను జీవనవాహినిలో కేవలము తేలియాడినాను. నన్ను నమ్మి మీరందరునూ చెడినారు" అని నిట్టూర్పు బుచ్చినాడు.

"లేదు ప్రభూ! మీరు మొదటినుండియునూ శుద్ధ చేతనులుగనే యున్నారు. పరిశుద్ధముగ జీవించినారు. మిమ్ములను యితరులు వంచించి యుండవచ్చును. కాని మీ రెవరినీ మోసగించియుండలేదు. ఇతరులు మీ కన్యాయము దలపెట్టి యుండవచ్చును. మీ రెవరికీ అన్యాయ మొనరించలేదు. మీ యాత్మ నిర్దేశించిన ఋజుమార్గములో మీరు ప్రయాణించుచున్నారు. మీ స్థాయిని మే మందుకొనలేక మిమ్ముల నపార్థము చేసుకొన్నాము. రాబోవు చరిత్రకారుడు మిమ్ములను సరిగా అర్థము చేసుకొనవచ్చును. మీ కీర్తి అజరామరము కాగలదు. నిందాస్తుతులను మించిన ముక్తచేతనము మీయది. అల్పులు దాని నర్థము చేసుకొనక పోయిననేమి? వజ్రమునకు దాని మూల్య ముండనేయున్నదికదా!" అని చెప్పుచుండగా అతని కంఠము గాద్గదికమైనది.

"అమాత్యులూ! తమతో మరొక విషయమును చెప్పవలయునని

యున్నాను. రాజశేఖరుని మాటలను మీరు విన్నారు. అతడు యువకుడు. అతని కలవిగాని సాహసము లేదు. దైవ మటువంటివానికి తోడ్పడ గలదు. మున్ముందు అతనికి విరూపాక్షరాయలతో జరుగు యుద్ధమున విజయము చేకూరవచ్చును. చేయిజారిపోయిన రాజ్యకోశములు మరల ప్రాప్తము కావచ్చును. కాని అటువంటి సమయమున మీరు మరల సింహాసన మధిష్ఠించుటకు నన్ను బలవంతపరచరాదు. నాకునూ యీ పదవులకునూ చాల దూరము. ఆ వ్యామోహ మేనాడో నశించిపోయినది. ఇపుడు నేను జీవనపథములో పయనించుచున్న యాత్రికుడను. ఆత్మ సాక్షాత్కారమార్గములో సాగిన ఒక పాంథుడను! నన్ను ఈ భవబంధ ములవైపునకు మరల త్రిప్పకుడు. అందువలన ఎవరికినీ క్షేమము కలు గదు" అని అమాత్యునివైపుచూడగా, అతడు తృప్తిగా నవ్వినాడు.

"ప్రభూ! తమ నోటి వాక్కు కార్యగతమగుగాక! మీ కా శిక్షను మరల విధించుట లేదు—" అని అమాత్యు డచటినుండి లేచినాడు.

# 13. విప్లవము

మల్లికార్జునరాయల సమ్మతి లభించినదే తడవుగా రాజశేఖ రుడూ, తిమ్మయామాత్యుడూ మున్ముందు ఆచరించవలసిన ఒక కార్య క్రమమును సిద్ధపరచినారు.

ఆ సమయమున సామ్రాజ్యమందలి స్వామి నిష్ఠాగరిష్ఠులందరూ విరూపాక్షరాయలపై లోలోపల కత్తి నూరుచున్నారు. వారికి సరియైన నాయకుడు లేక వారు తమ అసమ్మతిని కార్యగతము చేయలేదు. సామ్రాజ్యమందలి ధర్మపక్షపాతులందరూ మోసముతో సింహాసనము నాక్ర మించిన విరూపాక్షరాయలను అంతరంగమున ద్వేషించుచున్నారు. అతని అన్యాయములకు, అత్యాచారములకు చిక్కిన ప్రజలూ, అతని నిరంకుశ పాలనతో విసుగెత్తిన జనులూ తమ అసంతృప్తిని వెలిబుచ్చుటకై తగిన సమయముకొరకెదురు చూడసాగినారు,

విరూపాక్షరాయల వైభవములకు, అట్టహాసములకు రాజబొక్కసము ఖాళీయైనది. దానిని నింపుటకు అతడు క్రొత్త క్రొత్త పన్నులను విధించినాడు. ఈ పన్నుల భారముతో బాధపడినప్రజలు సార్వభౌమునిపై దండెత్తుటకు సిద్ధపడినారు. సరిగా యీ సమయముననే భట్కళ్‌నందు మహమ్మదీయులపై జరిపిన అమానుషహత్యలచే సామ్రాజ్య ప్రజ సిగ్గుచే తలొంచుకొనవలసివచ్చినది. సామ్రాజ్యమందలి మతేతరులు యిక తమ కేమి గతి యని భీతిల్లి, వాణిజ్య వ్యవహారములను వదలి దేశాంతరము వెళ్ళనారంభించినారు. దీనితో వ్యాపారము కుంటువడి, రాజబొక్కసమునకు వచ్చుచుండిన ఆదాయము నిలచిపోయినది.

ఈ సమయముననే మండలేశ్వరులలోకూడ విరూపాక్షరాయల పట్ల మనసులు పాడైనవి. అటువంటివారిలో పాండ్య, చోళప్రభువులు అవకాశము లభించినపుడు దండెత్తుటకు సిద్ధముగా నున్నారు. సామ్రాజ్యపు ప్రక్షుబ్ధ వాతావరణము నెరింగిన తిమ్మయామాత్య, రాజశేఖరులు ప్రజలకు నాయకులై నిలబడి ఈ ప్రజాకోటి చర్యలను, విరూపాక్షరాయలను పదవీచ్యుతునిగాజేయు "రాజ్యక్రాంతి" గా పరివర్తింపజేయుటకు నిశ్చయించినారు.

ఆ ప్రయత్నము ఫలించగా వారు స్వాతంత్ర్యమునకై పరితపించుచున్న పాండ్యరాజులను విరూపాక్షరాయలపై కత్తిగట్టునట్లు చేయుటకు నిశ్చయించి, మధురకు వెళ్ళినారు.

వేషాంతరమున వచ్చి తనను సందర్శించిన రాజశేఖర, తిమ్మయామాత్యులను జూచి మధుర పాండ్యరాజు మొదట ఆశ్చర్యపడినాడు. వారిని విశ్వసించుటకు వెనుక ముందు జూచినాడు. కాని వారు వచ్చిన యుద్దేశమును వినిన పిమ్మట నమ్మినాడు.

"రాజకుమారా! మీకు కలిగిన దుస్థితిని జూచి నాకు చాల జాలిగానున్నది. సామ్రాట్టుల గర్భమున జనించిన మీకు ఎంతటి దుస్థితి ప్రాప్తమైనది? మీకు జరిగిన యన్యాయమును జూచి ప్రభు నిష్ఠాగరిష్ఠులందరూ అసంతుష్టులైయున్నారు. కాని యీ ద్రోహి విరూపాక్షరాయల నెదిరించుటకు వారికొక నాయకుడు కావలసియున్నది. మీరు సింహాసనమునకై

మరల పోరాడునట్లయిన, మే మందఱూ మీకు తోడుగా నిలచి పోరాడుదుము" అని హృదయము విప్పి చెప్పినాడు.

"మహామండలేశ్వరులూ! మీరు ఉత్తమ పాండ్యవంశమునకు చెందినవారు. ఒకానొకప్పుడు దక్షిణాపథమున స్వతంత్ర సార్వభౌములుగా ప్రకాశించినవారు. స్వాతంత్ర్యపు విలువ మీకు బాగుగా తెలియును. మీరు మాకు సాయపడునట్లయినచో, ఆ నీచ విరూపాక్షరాయలను సింహాసనచ్యుతునిగా జేయుటకు మా జీవితమును బలి గావించగలము."

"ఇటువంటి కార్యములు నావంటి ఒకరిద్దఱు మండలేశ్వరులతో నెరవేఱజాలదు. నే నిదివరకూ అన్యాయమును చూచియునూ ఊరక యుండవలసివచ్చినది. మీ రీ ధర్మయుద్ధమునకు కంకణము కట్టుకొనునట్లయినచో, నేను మీ పక్షము వహించి పోరాడగలను" అని పాండ్యరాజు వాగ్దానము చేసినాడు.

ఈ మాటలతో తిమ్మయామాత్యు డుత్తేజితుడై :

"మహామండలేశ్వరులూ! మీ రొక్కరు మా పక్ష మవలంబించిన రేపటి ఉదయములోగా ద్రోహియగు నా విరూపాక్షరాయలను నేను సింహాసన చ్యుతునిగా జేయగలను" అని వాక్రుచ్చినాడు.

"నావలన మీ కే సహాయము కావలయునో దెల్పుడు. సంతోషముగా చేయగలను."

"ఇపుడు మన మీ పోరాటమునకు సంచాలకులమని విరూపాక్షరాయలకు తెలిసినచో ప్రమాదము సంభవించగలదు. సామ్రాట్టుల యొక్కయూ, వారి భార్యాబిడ్డలయొక్కయూ ప్రాణములు గండములలో చిక్కుకొనగలవు. ఆ నీచుడు వారిమీద పగ దీర్చుకొనవచ్చును. అందువలన మన మీ కార్యములకు వెనుక నిలచి, ద్వేషమను నీ దవానలమునకు గాలి విసరుదము. మీరు వైయక్తిక కారణములను ముందిడుకొని విరూపాక్షరాయలపై దండెత్తి స్వాతంత్ర్యమును ఘోషించుకొనుడు. మీ మార్గము ననుసరించి యితర సామంతులుకూడ అతనిపై కత్తిగట్టగలరు. అపుడు మన మతనిని పదవీచ్యుతుని గావించుట కష్టము కానేరదు" అని తిమ్మయామాత్యు డన్నాడు.

ఈ సలహా పాండ్యరాజుకు సమ్మతమైనది. దండెత్తుటకు అతడు తగిన సమయముకొరకై వేచియుండగా, అటు భట్కళ్ ముస్లిములమీద జరిపిన దుండగములకు కోపగించుకొని బహమనీ సుల్తాను మహమద్ గవానును విజయనగరముమీదికి బంపినాడు. ఈ సమయము జూచి పాండ్యప్రభువుకూడ ఎదురుతిరిగి తాను స్వతంత్రుడని ఘోషించు కొన్నాడు. అటు బెల్గాం, గోవా పట్టణములు సామ్రాజ్యమును వదలి శత్రు హస్తగతమైనవని వార్త వచ్చినది. ఇటు మధుర మరియును చోళరాజ్యములు సామ్రాజ్యరక్షమునుండి తొలగి స్వతంత్రములైనవి.

ఈ వార్త విని విరూపాక్షరాయల కమితమైన కోపముకలిగిననూ, ప్రజలలో పొడసూపిన అసమ్మతినీ, మండలేశ్వరులలో కలిగిన ద్వేషాసూయలనూ జూచి, ఏ కఠినచర్య గైకొనుటకునూ అసమర్థుడైనాడు. అతడు తోక త్రొక్కిన త్రాచువలె బుసలు కొట్టుచూ, పరాభవాగ్నిలోపడి రగులసాగినాడు. నాగననాయకుని రాయబారముయొక్క ఫలాఫలములను తిలకించి, పాండ్యరాజును శిక్షించుటకై దండెత్తివెళ్ళవలయునని నిశ్చలుడైనాడు.

నాగననాయకు వేషాంతరమున కంచికి వెళ్ళి, ఈ విప్లవమునకు వెనుక నిలబడి పనిచేయుచున్నవా రెవరనునది అతి కష్టముపై కనుగొనినాడు. ఈ రాజ్యక్రాంతి వెనుక తిమ్మయామాత్యుడు, రాజశేఖరుడు సూత్రధారులుగ నిలబడియున్నారను సంగతి తెలిసినది. పాండ్య, చోళ ప్రభువుల విద్రోహమునకు వారే ప్రేరకులు. సామ్రాజ్యములో తల జూపిన ప్రక్షుబ్ధ వాతావరణమునకు వారి ప్రయత్నములే కారణమని గ్రహించుట కెక్కువ రోజులు పట్టలేదు.

రాజధానికి వెనుదిరిగి వారీ వార్తను సామ్రాట్ విరూపాక్షరాయల కెరిగింపగా అతనికి కలిగిన ఆశ్చర్యమునకు మేరలేకపోయినది.

"ఓరీ ద్రోహీ! తిమ్మయామాత్యా!! నీవా తలపొగరు రాజపుత్రునితో గలసి, పాండ్యరాజును మాపై ఎదురుతిరుగునట్లుగాజేసి, మరల అధికారమునకు వచ్చుటకు ప్రయత్నించుచున్నావా?" అని నిట్టూర్చినాడు.

ఇపు డూరక కూర్చున్నయెడల యీ విద్రోహమునకు ఎక్కువ మంది మాండలీకులు చిక్కుకొను నవకాశమున్నది. వారి యీ తిరుగు

బాటు చర్యలను అంకురములోనే హతమార్చకపోయినచో సింహాసనము చేయి విడచిపోవుట కవకాశ మేర్పడగలదు. అందులకే అతడు మల్లికార్జునరాయలను, అతని భార్యా బిడ్డలనూ, తిమ్మయామాత్యునీ బంధించి తీసుకొని రావలసినదని సింగనదండనాథుని కాజ్ఞాపించినాడు.

సింగనదండనాయకు డొక పెద్ద సైన్యముతో వెళ్ళి కంచిని ముట్టడించినాడు.

విరూపాక్షరాయలు హఠాత్తుగా తమపై పగదీర్చుకొనుటకు రాగలడని తిమ్మయామాత్యుడుకాని, రాజశేఖరుడుకాని ఊహించలేదు. హఠాత్తుగా వచ్చిపడిన యీ యాపదను తప్పించుకొను టెట్లని తెలియక వారు చింతించసాగినారు.

అపుడు మల్లికార్జునరాయలు :

"కుమారా! నా మాటయందలి సత్యము యిప్పుడైననూ నీకు గోచరించినదా? సామ్రాజ్యములో ఎచ్చట విప్లవము చెలరేగిననూ దానికి మనమే నాయకులని తలంచుట కెక్కు డవకాశమున్నది. గనుకనే ఈ పాండ్య, చోళ విద్రోహకారులకు మారుగా మనపై పగ దీర్చుకొనుటకు వచ్చియున్నారు. ఇప్పు డీ యాపదనుండి పంపాపతియే మనలను కాపాడవలయును!" అని నిట్టూర్పు విడచినాడు.

"నాయనగారూ! నేను తొందరపడినట్టు తోచుచున్నది. నావలన తమ కందరికీ ఆపద కలుగునట్లయినవి. నా యపరాధమును క్షమింపుడు " అని రాజశేఖరుడు రుద్ధకంఠుడై అన్నాడు.

"గడచినదానికై వగవకుము నాయనా! ఈ శత్రుదాడినుండి ప్రాణములతో బ్రతికి బయటపడుమార్గమును వెదకుము. అదియే పురుష లక్షణము. మన మిపుడు శత్రువుల నెదిరించి పోరాడుటకు యుద్ధాయుధములుగాని, సైనికులుగాని తగినంతమంది లేరు. కొన్నిరోజులవరకు మాత్రమే మన మీ కోటను శత్రువులనుండి కాపాడగలము. ఇచ్చటినుండి మనమిపుడు బయటపడుటకుకూడ సాధ్యము లేదు. తప్పించుకొనుటకుగల రహస్యమార్గముల నన్నింటినీ శత్రువులు మూసివేసినారు. ఇక పోరాడుచూ మరణించుటయో-లేక శత్రువులకు శరణాగతులై,

వారు విధించు శిక్షను సంతోషముగా అనుభవించుటయో; యీ రెండింటిలో నేదియో నొక మార్గమే మనకు గత్యంతరము!"

"ప్రభూ! ఈ యాపదలకు మూలకారకుడను నేను. శత్రువులకు కావలసినది నేనుకాని మీరు కాదు. కాబట్టి నేను శత్రువులకు శరణాగతుడనై మిమ్ములను క్షమించమని వారిని ప్రార్థించెదను" అని తిమ్మయామాత్యు డనినాడు.

"మీ రపరాధులైనచో నేనునూ అపరాధినే అమాత్యులూ! మీ వెంట నేనునూ వచ్చెదను. రాగలదానిని మన ముభయులమూ సంతోషముగా, ధైర్యముగా అనుభవింతము. మనవలన పూజ్యులగు మాతాపితరుల కే యాపదయునూ కలుగరాదు!" అన్నాడు రాజశేఖరుడు.

"అన్నగారూ! మీరు శత్రువులకు శరణాగతులగునట్లయినచో, నేనునూ మీ వెంట వచ్చెదను. ఈ విద్రోహమునకు మనము ముప్పురమూ మూలపురుషులము. నిరపరాధుల నీ విషవర్తులములోనికి ద్రింపకుడు. తీర్థరూపులనూ; నిరపరాధులగు సోదరులనూ సింగనదండనాథుడుదారుడై క్షమించునట్లయిన — వారికి ప్రాణదాన మొసగునట్లయిన — మనము వారికి యుద్ధము లేకయే నగరము నప్పగించి, శరణందగలమని తెలియజేయుదుము. దీనిచే రక్తపాతమైననూ నిలువగలదు; నిరపరాధులకు పడు శిక్షకూడ తప్పగలదు" అని పెద్దరాయ లన్నాడు.

ఈ సలహా తక్కినవారికి సమంజసముగా దోచినది. కాని మల్లికార్జునరాయలుమాత్ర మందులకు సమ్మతించలేదు. అతనికి తమకొరకై రాజశేఖర; పెద్దరాయ; స్వామిభక్తిపరాయణుడగు తిమ్మయామాత్యుడు నిష్కారణముగా బలియగుట ఎంతమాత్రమునూ యిష్టము లేదు. తనే శత్రువులకు శరణాగతుడు కావలయునని పట్టుబట్టినాడు.

కాని అతనిని సమాధానపరచి, తిమ్మయామాత్యుడు రాజశేఖర, పెద్దరాయలతో అచ్చటినుండి లేచి వెళ్ళినాడు. తరువాత వారితో దీర్ఘముగా నాలోచించి, సింగన నాయకునికొక లేఖ వ్రాసి పంపినాడు.

ఆ లేఖను జదువుకొని సింగనదండనాయకుడు, యుద్ధము లేకయే తిమ్మయామాత్య, రాజశేఖర, పెద్దరాయలు తనకు వశమగునట్లయినచో,

లక్కినవారికి ప్రాణభిక్ష నిచ్చుటకు సమ్మతించినాడు. అతనికి కావలసిన వారుకూడ యీ ముగ్గురే! అతడు తన సమ్మతి నెరిగించుచూ ప్రత్యుత్తరము వ్రాసి పంపినాడు.

దానిని చదువుకొని తిమ్మయామాత్య, రాజశేఖరులు నెమ్మదిగా ఒక నిట్టూర్పు విడచినారు.

"అన్నగారూ! ద్రోహియగు ఆ సింగననాయకుని నమ్ముటకు వీలు లేదు. అతడు మనల నుపాయముగా బంధించుటకై యీ పన్నుగడ పన్ని, అనంతరము తలిదండ్రులనుకూడ బంధించి రాజధానికి తోడ్కొనిపోయిన గతి? అతనిని నమ్ముటెట్లు?" అని పెద్దరాయ లనినాడు.

ఈ మాటలకు తిమ్మయామాత్యుడు :

"కుమారా! మనలను మోసగించి చెఱబట్టవలయునని యున్నచో, యుద్ధమునకై వచ్చినవారు వాగ్దానము చేయవలసిన ఆవశ్యకత మేమిగలదు? యుద్ధమొనరించి మనల నందరను బంధించి రాజధానికి తోడ్కొనిపోయి యుండవచ్చును. కాని ఆ విధముగాకాక, మన లేఖకు విలువనిచ్చి, మన ముగ్గురనూ బంధించి తీసికొనిపోవుటకు సమ్మతించినాడు. కాబట్టి అతడు మన మాటకు గౌరవమొసగినట్లే, మనమూ అతని లేఖకు విలువ నొసగి, ఆ మాటను నమ్మవలయును. ఆపైన దైవేచ్ఛ ప్రకారము జరుగనిమ్ము!" అని నిట్టూర్చినాడు.

కాని వారు హతాశులు కానక్కరలేకపోయినది. సింగన దండనాయకునకు కావలసినది రాజద్రోహులగు తిమ్మయామాత్య, రాజశేఖర, పెద్దరాయలేగాని మల్లికార్జునరాయలు కాదు. అందువలననే అతనికి ప్రాణభిక్షపెట్టి, అతనిమీద వేగులవారిని నియమించి, నిర్బంధములోనుంచి, ఖైదీలను వెంటబెట్టుకొని విజయనగరమునకు వెనుదిరిగినాడు—

సింగనదండనాయకుడు అంతఃపురములో సామ్రాట్ విరూపాక్ష రాయలను సందర్శించి తన దండయాత్రాకథను వివరముగా తెలియజేసి, వెంటబెట్టుకొని వచ్చిన ఖైదీల నతనిముందు నిలబెట్టినాడు.

విరూపాక్షరాయలు తిమ్మయామాత్యుడు మొదలగు వారిని తిరస్కారభావముతో చూచి నవ్వినాడు.

ఆ నవ్వునుచూచి రాజశేఖర, పెద్దరాయలకు నిప్పులలో కూర్చున్నంత బాధ కలిగినది. కాని తొందరపడరాదని తిమ్మయామాత్యుడు కనుసంజ్ఞతో వారికి తెలియజేసినాడు. వారు అతి కష్టముపై తమ కోపము నణగ ద్రొక్కుకొన్నారు.

విరూపాక్షరాయలు వారిని తగిన కట్టుదిట్టములతో చెఱసాలకుబంపి, మరునాడు వారిని ఆస్థానములో బహిరంగ విచారణకు గురిచేయునట్లుగా తెలిపినాడు. వారిని క్రూరముగా శిక్షించి, యితర విద్రోహులకు తగిన పాఠము నేర్పవలయునని అతని కోరిక.

మరునాడు నిండుసభలో తిమ్మయామాత్యుడు మొదలగు రాజద్రోహుల విచారణ ప్రారంభమైనది. విరూపాక్షరాయలు న్యాయమూర్తిగా ధర్మపీఠములో కూర్చొన్నాడు.

అతడు సార్వభౌముడైన పిమ్మట యిటువంటి విచారణ జరుగుట యిదియే మొదటి పర్యాయము. అతని న్యాయ తీర్మాన వైఖరిని చూచుట కొరకై పెద్దలు-పిన్నలు అనేకులు నిర్ణీత సమయమునకు మునుపేవచ్చి తమ తమ ఆసనములలో కూర్చొన్నారు.

విచారణ ప్రారంభమైనది.

సింగనదండనాయకుడు విరూపాక్షరాయల కోరికమేరకు అపరాధుల రాజద్రోహమును ఒక్కటొక్కటిగ పట్టిక వ్రాసినట్లు చెప్పినాడు.

అంతయునూ ముగిసిన పిమ్మట విరూపాక్షరాయలు తిమ్మయామాత్యునిజూచి,

"ఈ యపరాధములకేమి చెప్పెదరు?" అని ప్రశ్నించినాడు

"మేము నిరపరాధులము ప్రభూ!" అని అతడు నిరుద్వేగముతో జవాబు చెప్పినాడు.

"మాకు వ్యతిరేకముగ విద్రోహకర కార్యముల నొనరించి, సామంతుల నడుమ వైమనస్యములను కలుగజేసి, ఇపుడు నిరపరాధులమని చెప్పుకొనుటకు సిగ్గుటలేదా?"

"సిగ్గుచే తలొంచవలసినంతటి కార్యమేదియునూ మేము చేసియుండలేదు ప్రభూ!"

"మీరు మాపై దండెత్తుటకు పాండ్యరాజును ప్రేరేపించిన దబద్ధమా?"

"ఔను!"

"ఈ పొగరుబోతు రాజశేఖరునీ, పెద్దరాయలనూ ఉసికొల్పిన దెవరు? వారి హృదయములో విద్రోహ బీజమును నాటిన దెవరు?"

"నేనుకాను ప్రభూ!"

"అయినచో యింకెవరు, మల్లికార్జునరాయలా?"

"కాదు ప్రభూ! వారు దైవాంశసంభూతులు. రాజ్యకోశముల ప్రలోభము వారికిలేదు. వారు నిజమైన విరక్తులు!"

"అయినచో రాజ్యమునకై జరిగిన యీ విప్లవమునకు నాయకు లెవరు?"

ఈ ప్రశ్నకు తిమ్మయామాత్యుడు నిరుత్తరుడైనాడు.

అపుడు రాజశేఖరుడు :

"ఈ విప్లవమునకు నాయకుడను నేను.దీనికి ప్రేరకవ్యక్తిని నేను. శిక్ష విధించునట్లయిన నాకు విధించుడు. తిమ్మయామాత్యులు నిరపరాధులు!" అని వేడుకొన్నాడు.

ఈ మాటలువిని సభలో విద్యుత్తు ప్రవహించినది. విరూపాక్షరాయలే క్షణకాలము నిర్విణ్ణుడైనాడు.

"నీ వెందులకీ విద్రోహమునకు సంచాలకుడవైనావు?"

"మాదియగు సింహాసనమును మేము మరల పొందుట కొరకు!" అతని మాటలలో దృఢత్వము గోచరించుచున్నది.

"ఈ సింహాసనము మీదియా?"

"ఔను! మా పితామహులనుండి మా పూజ్య పితరులకు ధర్మదత్తముగా వచ్చిన సింహాసనము గనుక అది మాదియే!"

ఈ మాటలకు విరూపాక్షరాయలు వికటముగా నవ్వినాడు.

"మీ తండ్రిగారికీ సింహాసనమెట్లు ప్రాప్తమైనది?" అని మరల ప్రశ్నించినాడు.

"అది వారికి వంశ పారంపర్యముగా వచ్చినది:"

"మీ పితామహుల తండ్రి ఎవరు?"

"శ్రీ వీరవిజయ మహారాజులు"

"ఇది తెలిసిన నీకు వీరవిజయ మహారాజులకు ముగ్గురు పుత్రు లుండిరను విషయముకూడ తెలిసి యుండవలయును కదా?"

"తెలియును!"

"తెలిసియున్నచో నా పూజ్య పితరులు శ్రీ ప్రతాపరాయలు ప్రౌఢ దేవరాయలవలెనే ఈ సింహాసనమునకు హక్కుదారులన్నది సైతము తెలిసియుండవలయును కదా? అన్యాయముతో దీనిని తమ వశము జేసి కొని, మల్లికార్జునరాయల కప్పగించిన యీ సింహాసనమును సామ్రాజ్య క్షేమ దృష్ట్యా నే నాక్రమించుకొనవలసివచ్చినది. ఇందులో అధర్మ మేమి యునూ లేదు. అన్యాయమునూలేదు. నా సింహాసనమును మరల నే నెక్కి నాను. సార్వభౌముడై యుండినను సింహాసనమును కాపాడుకొను శక్తి, సామర్థ్యములు మల్లికార్జునరాయలకు లేకపోవుటచేతనే అది నా వశమైనది. శత్రువులనుండి దానిని రక్షించుకోలేనివాడు నా కప్పగించి నారు. మేము సింహాసన మధిష్ఠించి ధర్మముతో ప్రజాపాలనము చేయుచూ వచ్చినాము.

ఈ సింహాసనమును మేము అధర్మముతోగాని, అక్రమముగ గాని పొందియుండినచో సామ్రాజ్యప్రజలెప్పటికీ సహించెడివారు కారు. నా ప్రభుత్వమునకు రాజ్యప్రజల సాయముండుటవలననే యీ సింహాసనము నాకు భద్రతరమైనది. దీనిని మరల పొందవలయునను వ్యర్థ సాహసము నకు నిన్నెవరు ప్రేరేపించినారో తెలియదు. మొత్తముమీద సాధింప వీలుగాని కలగని వృధాగా తొందరల పాలైనావు. నాకు నీపై కోపము లేదు. మీమీద పగదీర్చుకొనుట నా యుద్దేశముకాదు. మీ పితామహులు మా పుజ్యపితరుల కిడిన ప్రాణదానమును దలచి నేను మిమ్ములను క్షమించు టకు సిద్ధముగ నున్నాను. నిండుసభలో మీరు మీ యకృత్యమునకై పశ్చాత్తాపపడి, సామ్రాజ్యమునకు నిష్ఠతో సేవచేయగలమని ప్రమాణము స్వీకరించినచో మీ యపరాధములను క్షమించి ప్రాణదాన మొనరించగలను. మీకు తలబరువైనచో నన్ను వ్యతిరేకించి దాని ఫలమనుభవించగలరు!" అని గంభీరముగ నుడివినాడు.

ఈ మాటలకు పెద్దరాయలు రాజశేఖరుని చెవిలో ఏదియో చెప్పి నారు. రాజశేఖరుడు తిమ్మయామాత్యుల ముఖ మవలోకించినాడు. ఆ ముఖములో అతనికి తాను నిరీక్షించిన జవాబు గోచరించినది. దీనిచే ఉల్లసితుడైన అతడు :

"ప్రభూ! మేము తెలియక తమ కపచారము చేసియుండిన మా తప్పును మన్నింపుము. యౌవనోద్రేకములో నేను తొందరపడినాను. ఇపుడు నా యపరాధమును గ్రహించితిని. అందులకై నాకు పశ్చాత్తాప మగుచున్నది. మీరు మా తప్పులను సైరించి కృపజూపవలయును." అని దైన్యముగా ప్రార్థించినాడు.

ఇది విని విరూపాక్షరాయల ముఖములో దరహాసము ప్రతిఫలించి నది.

"మీరు మీ స్వబుద్ధితో యీ విద్రోహకృత్యమునకు పాల్పడలేదని తెలిసియే నాకు మీపై కోపము కలుగలేదు. ఎవరో స్వార్థపరుల మాట లాలించి, సుఖముగానున్న జీవితమునకు అపాయమును కొని తెచ్చు కొన్నారు. మీ తప్పు మీకు తెలిసినచో చాల సంతోషము. మిమ్ములను క్షమించుచున్నాను....కాని...."

"ఎందులకు ప్రభూ, అనుమానము?"

"మీ మనసును నా విషయములో చెరిపిన స్వార్థులెవరైనదీ నేను తెలుసుకొనవలయును."

దీనికి కుమారరాజశేఖరుడు జవాబు చెప్పక నేలపై దృష్టి నిగిడ్చి నిలబడినాడు.

"వారెవరైనదీ నాకు తెలియును. నీవు చెప్పకపోయిననూ ఆ ద్రోహిని నే నెరుగుదును" అని సింగన దండనాయకులవైపు తిరిగి :

"అమాత్యులూ! ద్రోహియగు యీ తిమ్మయమంత్రిని తీసుకొని వెళ్ళి చెఱసాలయందలి చీకటి గదిలో వేయుడు. ఏమియు తెలియని బాల కులను నాపై కత్తి కట్టునట్లు చేసిన ద్రోహమునకు మరణదండన విధించ వలయుననుకొన్నాను. కాని యీ క్షుద్రవ్యక్తిమీద నేను పగదీర్చుకొను టయా? అని యీశిక్ష విధించినాను!" అని తిమ్మయామాత్యుని ముఖమును జూచినాడు.

తిమ్మయమంత్రి సంతోషముతోడనే యీ శిక్షకు సమ్మతించి నాడు.

సైనికులు సింగన దండనాయకుని ఆజ్ఞమేరకు వచ్చి తిమ్మయ మంత్రిని సంకెళ్ళతో బంధించి, చెఱసాలకు దోడ్కొనిపోయినారు.

అనంతరము విరూపాక్షరాయలు రాజశేఖరునివైపు తిరిగి: "మీ పితామహుని యౌదార్యమును దలచుకొని మిమ్ములను చంపక వదలినాను. కాని మీరు ద్రోహచింతనమును మాని, మాకు నిష్ఠతో సేవచేయగలమని మాట యిచ్చునంతవరకునూ రాజధానియందు నిర్బంధములో నుండ వలయునని యాజ్ఞాపించుచున్నాను" అని చెప్పి ఆసనమునుండి లేచి నాడు.

ప్రజలు విరూపాక్షరాయల తీర్పును విని చాల సంతోషపడినారు. రాజశేఖరునికి మరణదండన విధించవచ్చునని భావించిన వారికీ తీర్పు ముదమును కలిగించినది. కుటిలుడైన విరూపాక్షరాయలు విద్రోహమను కంటకమును ఆ విద్రోహపు కంటకముచేతనే విరువ ప్రయత్నించియున్న విషయము వారికి తెలియదు. అతడు రాజశేఖర, పెద్దరాయలకు జీవ దానము చేయుట వారి మీది విశ్వాసముతో కాదు, తన తండ్రికి ప్రౌఢ దేవ రాయలు చూపిన ఔదార్యమును తలచుకొనియునూ కాదు. ఈ విప్లవమునకు -విద్రోహమునకు మూలపురుషులైనవారిని, రాజధానిలో బాధ్యులనుగా బంధించియుంచిన మున్ముందు వారి పేరుతో ఏ విద్రోహమునూ జరుగ దను భావముతో. ఒకవేళ మల్లికార్జునుడుకాని, అతని యభిమానులు కాని వారి పక్షమవలంబించి సింహాసనమునకై కుట్ర చేసినచో, వారి కుట్రను ఆదిలోనే అణచివేయుటకై వారిని బాధ్యులనుగా సమీపములోనే వుంచు కొన్నాడు. వారి పేరున ఎవరు విద్రోహము తలపెట్టినసూ వారి ప్రాణము గండములో చిక్కుకొనగలదు.

కాని తెలియని అమాయిక ప్రజలు మాత్రము విరూపాక్షరాయల న్యాయ పక్షపాతమును ప్రశంసించి, అతనిపై ఏర్పడిన దురభిప్రాయ మును మరువ ప్రయత్నించినారు.

విరూపాక్షరాయలు రాజశేఖరుని విషయమై తీర్పునిచ్చి అంతఃపురము

నకు వెనుదిరిగి తల్పముపై పడుకొని తన చాతుర్యమునకు తానే సంతోష పడుచూ విశ్రాంతి తీసుకొనసాగినాడు. ఈ సంతోషమును సింగనతో పాలుపంచుకొనుటకై అతనిని సముఖమునకు రప్పించుకొన్నాడు.

"సింగనా! ఈనాటి నా తీర్పును విని నీకు ఆశ్చర్యము కలిగి యుండును కదా? ఈ విద్రోహకారులను హతమార్చక ఎందులకు ప్రాణ ములతో నిలిపినాడని నీకు అనుమానము కలిగియుండును" అని యన్నాడు.

"ఔను ప్రభూ! ద్రోహులగువారి నెందులకు విడచిపుచ్చినారో నా కింకనూ అర్థము కాలేదు. ప్రజలేమో మీ యీ తీర్పునకు ప్రశంసించు చున్నారు. నా యభిప్రాయము చెప్పవలయునన్న, త్రాచుపిల్ల తెలిసిన తరువాత, అది చిన్నదైననూ, పెద్దదైననూ, దానిని చంపకపోవుట అవి వేకము. ఈనాడు రాజశేఖర, పెద్దరాయలు పసివారు కావచ్చును.... రేపు వారు సింహాసనమునకై తమకు వ్యతిరేకముగ మరల కుట్రపన్న వచ్చును! వారి నిప్పుడే తొలగించుకొనుట శ్రేయస్కరముకదా? వారున్న వరకూ సింహాసనమునకు కంటకమే కదా?"

"సింగనా! ఇచ్చటనే నీవు పొరబడుచున్నావు. వారివలన ఏ ద్రోహమునూ జరుగరాదనియే యిచ్చట నిర్బంధములోనుంచి యుండుట. మరల మనకు ద్రోహము తలపెట్టినచో, హతమార్చుటెంతపని? వారు మన నిర్బంధములో నున్నంతవరకూ వానినుండి, వారి యనుచరులనుండి మన కే అపాయమునూరాదు. అపాయము జరుగరాదనియే నేను వారిని ప్రాణములతో నుంచియున్నాను" అని తన మనసులోని విషయముల నతని కెరింగించినాడు. అపుడు సింగన దండనాయకునకు కలిగిన యాశ్చ ర్యమునకు మేరలేదు.

"ప్రభూ! తమ సూక్ష్మ వివేచనముందు ఎవరు నిలువగలరు? తం త్రమునకు గురువులు మీరు! మిమ్ములను నే నపార్థము చేసికొన్నాను—" అన్నాడు సింగన.

"అంతమాత్రపు వివేచన లేనిచో నేను సామ్రాట్టు నయ్యేడివాడనా? నీ కింకనూ విరూపాక్షరాయల బుద్ధికుశలత తెలియదు. నా మనసు ఇప

వైపులా పదునుగల కత్తివంటిది. దానికెన్నడూ అపజయము లేదు. అప జయము కలిగిననాడే ఈ సింహాసనము నాచేయి విడువగలదు." అని గర్వముగా అన్నాడు.

సింగన దండనాయకుడు నిర్విణ్ణుడై నోట మాటరాక కూర్చు న్నాడు. అతనికి విరూపాక్షరాయల యీరకపు వ్యక్తిత్వము మాత్ర మెప్పు డునూ పరిచయమై యుండలేదు. అందులకే అతడు విస్మయము జెంది నాడు.

# 14. నయవంచకుడు

సామ్రాజ్యములో హఠాత్తుగా తలజూపిన విద్రోహాగ్ని నార్పినట్లయినది. కాని బహమనీ సుల్తానుని దండయాత్రను నిర్జించు పెట్లని విరూపాక్ష రాయలకు తెలియలేదు.

బెల్గాం దుర్గపు విక్రమరాయలు పరాజితుడై తల దాచుకొన్నాడు. విజయనగరమునకు వచ్చుచుండగా దురదృష్టవశమున దారిలో మహమద్ గవాన్ సైనికు లతనిని పసిగట్టి పట్టి బంధించి, తమ నాయకుని ముందు నిలబెట్టినారు. గవాను అతనిని తగిన రక్షణతో గుల్బర్గునకు బంపినాడు.

గుల్బర్గు (కల్బుర్గి)నకు వచ్చిన విక్రమరాయలను ఇమ్మడి మహ మ్మద్‌ఖానుడు వీరోచితముగా గౌరవించినాడు. కాని విక్రమరాయలే అతని మైత్రీ హస్తమును నిరాకరించి, ఔద్ధత్యముతో ప్రవర్తించి, సుల్తా నుని క్రోధమునకు గురియైనాడు. అలసిచే అవమానితుడైన సుల్తాను అతనిని క్రూరరీతిని హత్యజేయించి, శిరమును విరూపాక్షరాయలకు కాను కగా బంపినాడు.

ఈ కార్యమువలన విరూపాక్షరాయలశరీరము భగ్గుమనినది. అతడు విక్రమరాయలకు జరిగిన అన్యాయమునకై కోపించి, దీనికి రాజధాని యందలి మహమ్మదీయులే పరోక్షముగ కారణమని వారిపై పగ దీర్చు కొన నిశ్చయించినాడు.

ప్రౌఢదేవరాయల కాలమునుండియూ ఎన్నియో వేలమంది యవనులు విజయనగరములో స్థిరముగా ఆవాస మేర్పరచుకొన్నారు. వారిలో కొందరు భట్కళ్‌నందు అత్యాచారము జరిగిన పిమ్మట తమకు రాజధానిలో రక్షణ లేదని బహమనీ రాజ్యమునకు వలస వెళ్ళినారు. కాని అటువంటివారి సంఖ్య గమనార్హమైనది గాకపోవుటచే, సామ్రాట్టుల దృష్టి అటు తిరుగలేదు. అయిననూ బహమనీ సుల్తాను సామ్రాజ్యమునకు చెందిన బెల్గాం మరియు గోవా పట్టణములను వశపరచుకొని విజయనగరముమీద దండెత్తనున్న విషయము కర్ణాకర్ణికగా విని, రాజధానిలోనున్న యవనులు యిక తామచ్చట నుండినచో తమ మానప్రాణములు నిలువవని భీతిల్లి, ఎక్కుడు సంఖ్యలో బహమనీ రాజ్యమునకు వెళ్ళనారంభించినారు.

ఇది విరూపాక్షరాయల దృష్టిని బడక తప్పలేదు. అ[illegible]డీ వలస వెళ్ళుటను నిలుపుటకై వెంటనే రాజశాసనమును ప్రకటించినాడు. ఇది యవనులకు మరింత భీతికి కారణమైనది.

సామ్రాట్ ప్రౌఢదేవరాయలు హిందూ ముస్లిం బాంధవులలో సఖ్య సామరస్యములను జూడ బ్రయత్నించి, ముస్లిములకు రాజధానిలో అనేక సౌకర్యముల నేర్పాటు జేసినాడు. వారి మత ధర్మములను గౌరవముగా ఆదరించినాడు. తన తండ్రి నీతినే మల్లికార్జునరాయలుకూడ పాలించుచూ వచ్చినాడు. కాని అధర్మములో సింహాసన మధిష్ఠించిన విరూపాక్షరాయలకు ఏ మత ధర్మమందునూ అంతటి శ్రద్ధ లేదు.

అతడు తనకు వ్యతిరేకముగ కుట్ర జరిపిన భట్కళ్ ముస్లిముల మీద కఠినచర్య గైకొన్నాడు. ఈ చర్యతో సామ్రాజ్యమందలి యవనులు చింతించునట్లయినది. రాజధానిలోనున్న మహమ్మదీయులు ముందేమి గతి రానున్నదోయని సదా భీతితో గడుపసాగినారు.

వారి భీతి నిరాధారము కాలేదు. భట్కళ్ ముస్లిములమీద విరూపాక్షరాయలు జరిపిన అత్యాచారమునకు కోపించి, మహమద్ బెల్గాం మరియు గోవాలను పట్టుకొని, విక్రమరాయలను క్రూరముగా హత్య జేయించినాడు.

ఇది జూచి నగరములోనున్న యవనులు తల్లడిల్లినారు. భీతిల్లి పారిపోసాగినారు. కాని విలుకాండ్ర గుంపులోనున్న కొందరు ప్రముఖ ముస్లిం అధికారులూ, మండలములలో పనిజేయుచున్న యితర ముస్లిం పెద్దలూ సభజేసి, సామ్రాట్టుల యీ దుష్ప్రవర్తనమును ఖండించినారు. అతని శాసనమును న్యాయబాహిరమని ప్రతిఘటించినారు. ఇదియే వా రొనరించిన యపరాధము.

ఈ వార్త క్షణార్థములో ప్రాకిపోయినది. వారి ప్రతిఘటన గూఢ చారులనుండి సింగన దండనాయకునకు ముట్టి, అతనినుండి విరూపాక్ష రాయల కందినది. తన శాసనమును ధిక్కరించునంతటి యహంకారము కలిగినదా వారికి? అటువంటివారందరూ రాజద్రోహులని చాటించి, వారి కంఠము లుత్తరించుమని యాజ్ఞాపించినాడు. వారి ఆస్తిపాస్తులను వశ పరచుకొనవలసినదని ఉత్తర్వులు జారీ చేసినాడు.

ఈ యాజ్ఞను కార్యగతమొనరించుటకై వచ్చిన రాజభటులమీద యవన సైనికులు తమ ప్రతీకారమును తీర్చుకొన్నారు. ఈ తుముల యుద్ధములో నాగననాయకుడు ఒక ముస్లింవిలుకాని బాణమునకు గురియై అసువులను గోల్పోయినాడు.

నాగననాయకుని మరణవార్త విని విరూపాక్షరాయ లావేశములో పిచ్చివాడే అయినాడు. సింగనదండనాయకుని బిలిపించి, రాజధానిలో నున్న యవనుల నందరనూ సమూహముగా సంహరించవలసినదని యాజ్ఞాపించినాడు.

భీకరమైన యీ యాజ్ఞను విని రాజధాని ప్రజలు తల్లడిల్లినారు. తమ కేమపాయము కలుగనున్నదోయని కొందరు ప్రజలు గృహము లలో దాగుకొన్నారు. మరికొందరు నగరమును విడచి పారిపోయినారు. కాని ఊరు విడచి వెళ్ళుచున్న ముస్లిములను పట్టి, నరమేధ గావించ వలసినదని విరూపాక్షరాయ లాజ్ఞాపించినాడు. అందుచే దురదృష్టవంతు లకు ముస్లిములు తప్పించుకొని వెళ్ళుటకు వీలులేక, పోరాడి మరణించు టొక్కటే తమకు మిగిలిన దారియని నిశ్చయించుకొన్నారు. కాని తమ భార్య బిడ్డల గతి? వారి మానప్రాణములు మిగిలెడిదారి?

ఎంత యాలోచించిననూ ముస్లింనాయకులకు తమ స్త్రీలకు జరుగు అత్యాచారమునూ, శిశుహత్యలనూ తప్పించుటకు మార్గము గోచరించ లేదు. కాని ఎవరో ఒక ముస్లింపెద్ద తనకు తోచిన అభిప్రాయమును పెద్దలముందు వెల్లడించినాడు :

"ఖాన్‌సాహేబులూ! మన మిపుడు సామ్రాట్టులవద్దకు వెళ్ళి దైన్యముతో వారి నెందులకు ప్రాణభిక్ష నర్థించరాదు? బ్రతుకుటకు మార్గ మది ఒక్కటే గలదు!" అన్నాడు.

"కాని, ముల్లాసాహేబులూ! మన ప్రార్థన ఫలించగలదను ఆశ ఏమున్నది? భట్కళ్‌లో జరిగిన దుండగమును మీరు వినియున్నారు. ఒక్క ఇస్మాయిల్ సేఠ్ గావించిన యపరాధమునకు అచ్చటి నిరపరాధులకు యవనులనందరనూ యీ దొర క్రూరముగా హత్య జేయించినాడు. ఇక విక్రమరాయల చావునకు, నాగననాయకుని హత్యకు మనల నూరక విడువగలడా?"

"ప్రయత్నము చేయుదము. ఫలితము 'అల్లా' యిచ్చు ప్రకారము జరుగగలదు!" అని ముల్లాసాహేబన్నాడు.

"మాకు మీ ధైర్యము లేదు. అందులకు మారుగా మేము సింగన దండనాయకునివద్దకు వెళ్ళి, అతని పాదములపైబడిన, సార్వభౌములను వశపరచుకొని అతడు మన ప్రాణములను గాపాడవచ్చును."

"కాని నాగననాయకుని హత్యచే వారుకూడ మనపై క్షుబ్ధులై యున్నారు. మనపై పగ దీర్చుకొనుటకు ఆతురత జెందుచున్నారు. వారిచే మన కే ప్రయోజనమూ లభించదు. ఇది గొఱ్ఱె కసాయివాని ముందు నిలచి చేయు వ్యర్థప్రలాప కాగలదు, అంతియే!"

"అయినచో మన మిపు డేమి చేయవలయును?"

"రాజధానిలో రాజశేఖరరాయ లున్నారని విన్నాను. వారు ధర్మాత్ములగు మల్లికార్జునరాయల కుమారులట. మహాత్ములైన ప్రౌఢ దేవరాయల మనుమలట. వారు దయాపరులనీ, ఉదారులనీ ప్రజ లను కొనుచుందురు. మన మిపు డెట్లయిననూ, వారిని కలుసుకొని మన దుస్థితిని వారిద్వారా సామ్రాట్టులకు నివేదింపజేసి, ఈ శాసనమును ఉపసంహ

రించుకొనునట్లు గావించినచో బ్రతికి బయట పడవచ్చును. ఇది తక్క మనకు వేరు దారి లేదు।"

తక్కనవారందరూ యీ సలహాకు సమ్మతించినారు. నిర్బంధములోనున్న రాజశేఖరుని సందర్శించి, అతనికి తమ గోడును నివేదించుకొనవలయునని తీర్మానించుకొన్నారు. ఆ తీర్మానము ప్రకారము, రాజశేఖరుడు నిర్బంధములోనున్న అంతఃపుర కావలి భటులలో గల ఒక మిత్రుని సహాయముతో ముల్లాసాహేబు లెట్లో ఉపాయముగ ప్రవేశమును లభింపజేసుకొని, రాజధానిలో జరిగిన విషయముల నన్నింటినీ అతనికి వివరముగా వర్ణించి చెప్పినాడు.

ఇది విని సాత్త్వక స్వభావుడైన రాజశేఖరునకు హృదయ మార్ద్రమైనది. వారి కభయమొసగి, ఈ విషయమై తాను విరూపాక్షరాయలను సందర్శించి మాటలాడునట్లుగా చెప్పి, వారిని పంపివేసినాడు.

రాజశేఖర, పెద్దరాయలకు విరూపాక్షరాయలు తమను రాజధానియందు నిర్బంధములో నుంచు టొకవిధముగా వరముగా పరిణమించినది. వారికి వృధగా మరణించుట కిష్టము లేదు. తమకు లభించిన ప్రాణదానమును సదుపయోగపరచుకొని, సరియైన సమయము జూచి, విరూపాక్షరాయలను హతమార్చవలయుననుకొనిన ఆ సహోదరులు, భీరువుల వలె నటించి, పశ్చాత్తాపపడుచున్నవారివలె మెలగి విరూపాక్షరాయలవద్ద క్షమ నర్థించి ప్రాణదానమును బడసినారు. వారికి రాజోచితమైన అంతఃపురము నివాసమునకై యొసంగబడినది. అచ్చట వారికి సంపూర్ణ స్వాతంత్ర్యము గలదు. కాని దానిని దాటి వెలుపలికి వచ్చు స్వాతంత్ర్యము మాత్రము లేదు. దానిని సర్వకాల సర్వావస్థలలోనూ ఆయుధపాణులగు భటులు కావలి కాయుచుందురు. వారి కనులు గప్పి ఎవరూ లోనికి బ్రవేశింప వీలుకాదు. వారి ప్రతి చర్యయునూ సామ్రాట్టున కెరిగింపబడుచుండెడిది. ఈ విషయము తెలిసిన ఆ సోదరులు తొందరపడి తమకు తామై గండములో చిక్కుకొనుట కిష్టపడలేదు.

కాని యిపుడు రాజధానిలో జరిగిన హత్యాకాండ కథ విని, ఎట్లయిననూ యీ నరమేధను తప్పించవలయునని రాజశేఖరుడు నిశ్చయించు

కొన్నాడు. ఈ విషయమై విరూపాక్షరాయలతో వైరము కట్టుకొనవలసిన పరిస్థితి యేర్పడిననూ భీతిల్లరాదని భావించినాడు. అందులకే అతడీ విషయములో కఠినత్వమును వహించినాడు.

తనను చూడవచ్చిన భటునితో అతడు, వెంటనే తనను సింగన దండనాయకునివద్దకు దోడ్కొని పోవలసినదిగా ఆజ్ఞాపించినాడు. ఈ వార్త విన్న కావలిభటుల నాయకుడు సింగన కీ విషయమును దెలిపి అతనినే అచ్చటికి గొనివచ్చినాడు.

ఈ వార్త అందినపుడు సింగనదండనాధుడు సమవస్త్రములను ధరించి సైనికదళముతో, ముస్లిములపై దండెత్తి వెళ్ళుటకు సిద్ధమగుచున్నాడు. రాజశేఖరునినుండి యీ విచిత్రమగు పిలుపు వచ్చుటనుజూచి, విషయమేమియో తెలుసుకొనగోరి వెనువెంటనే వచ్చినాడు.

అతనిని చూడగనే రాజశేఖరుడు :

"అమాత్యులూ! మీ నుండి ఒక ఉపకారము జరుగవలసియున్నది" అని ప్రార్థనా ధోరణిలో అన్నాడు.

"ఏమది, కుమారా?"

"నగరములోనున్న యవనులమీద జరుగనున్న యీ నరమేధను తప్పించగలనని తమరు వాగ్దానము చేయవలయును!"

"అది నాకు మించిన విషయము, కుమారా!"

"ఎందులకు?"

"సామ్రాట్టులు యవనుల నీచత్వముపట్ల కోపగించుకొని వారి నందరనూ హతమార్చమని యీ యాజ్ఞ నొసగినారు?"

"వా రేమపరాధము జేసినారు?"

"వారి మూలముననే స్వామిభక్తి పరాయణుడగు విక్రమరాయల శిరచ్ఛేదము జరిగినది. వారి వలననే మన నాగననాయకుడుకూడ అసువులను బాసినాడు. ఆ నీచులనేమి జేసిననూ పాపములేదు!" అని బొదు గరచినాడు సింగననాయకుడు.

"అయినచో, మీరీ విషయమై ఏమియునూ సహాయము చేయలేరా?"

"అది నా చేయి మీరిపోయినది, కుమారా! సామ్రాట్టులే స్వయ

ముగా యీ విషయములో దయాశూన్యులై యున్నారు. వారు ఎవరి మాటలనూ వినుటలేదు. తమ శాసనమును కార్యగత మొనరించుటకు ఒకటే పట్టుబట్టియున్నారు...."

"అయినచో నేను సామ్రాట్టులను జూచి ప్రయోజనములేదా?"

"లేదనియే నా భావన."

"అట్లయిన మీరు నాకొక సహాయము జేసెదరా?"

"ఏమి సహాయము?"

"ఒక్కసారి నన్ను సామ్రాట్టుల సన్నిధికి తీసికొనివెళ్ళి, పుణ్యము గట్టుకొనుడు."

ఈ దైన్య ప్రార్థనమును ద్రోసిపుచ్చుటకు సింగన నాయకునకు మనసు రాలేదు. గత్యంతరములేక అతడు రాజశేఖరుని దోడ్కొని వెళ్ళి విరూపాక్షరాయలముందు నిలబెట్టినాడు.

అతనిని చూడగనే విరూపాక్షరాయలు ద్వేషముతో నిప్పులు గ్రక్కినాడు.

విరూపాక్షరాయల భీకర వదనమునుజూచి భీతిల్లక, రాజశేఖరుడు శాంతుడై రాజధానిలోగల యవనులకు ప్రాణభిక్ష నర్థించినాడు, ఈ విచిత్ర ప్రార్థనమును విని విరూపాక్షరాయలు వికటముగా నవ్వినాడు.

"ప్రభూ! ఇది పరిహసించవలసిన విషయముకాదు. ఈ ధర్మ సామ్రాజ్యములో సర్వధర్మములవారూ సహోదరులవలె జీవించుచూ వచ్చుచున్నారు. తమ ప్రజలలో యవనులుకూడ కలసియే యున్నారు. పూర్వ రాజులుకూడ ముస్లిములకు తగిన రక్షణ నివ్వగలమని మాట యిచ్చి వారి నిచ్చటికి గొనివచ్చినారు. వారి వచనమును మనము పాలించవలదా? ఈ ముస్లిములవలన నే యపరాధము జరిగినదని వారిని శిక్షించుట?"

"అపరాధమా? వారి సుల్తానుడు మన విక్రమరాయలను క్రూరముగా జంపి మన కవమానము జేసినాడు. అంతియకాదు. ఈ మదోన్మత్తులు మన నాగననాయకుని దయాశూన్యులై హత్యజేసి మన యాజ్ఞ నుల్లంఘించినారు. అటువంటి వారిపై కరుణయా? అది సాధ్యముగానిపని!"

"ఆ నీచులపై కరుణ జూపుడని నేను మిమ్ములను ప్రార్థించుట లేదు. నాగననాయకుని హత్యాకారు లెవరైనరూ సరియే వారిని కఠినముగా శిక్షించుడు, నేను వద్దనుటలేదు — వారి కపరాధ కానుక విధించినసూ వద్దని చెప్పుటలేదు. కాని నిరపరాధులగు ప్రజలమీద—స్త్రీ పురుషులమీద—ఏ యపరాధమునకై యీ విధమగు సామూహిక వైరము దీర్చుకొనుట? ప్రభూ, తమను దీనముగా ప్రార్థించుచున్నాను. ఈ ధర్మ సింహాసనమునకు తమరీ హత్యాకళంక మాపాదించకుడు!" అని దైన్యముగా ప్రార్థించినాడు.

కాని విరూపాక్షరాయలు శిలకంటెను కఠిన హృదయుడు.

"కానిమ్ము, కుమారా! నీవు యింతగా ప్రార్థించిన పిమ్మట నీ కోర్కెను నిరాకరించరాదు. కాని నాగననాయకుని హత్యకు కారకులైన వారిని మాత్రము నేను క్షమించలేను. ఆ పాపులకు తగిన శిక్ష జరిగి తీరవలయును."

"అయినచో నేను అదృష్టవంతుడనే ప్రభూ!" అని నవ్వు ముఖము తోనే వీడ్కోలు పుచ్చుకొని అచ్చటినుండి బయలుదేరినాడు రాజశేఖరుడు.

రాజశేఖరుడటు వెళ్ళగనే విరూపాక్షరాయలు సింగనదండనాథుని రావించుకొని వికటముగ నవ్వి,

"సింగనా! ఎట్లున్నది నా అభినయం?" అని యడిగినాడు.

"ప్రభూ, తమ మాటలు నా కర్థము కాలేదు "

"అర్థమగుటకు నీకింకనూ చాల సంవత్సరములు కావలయును—ఆ అమాయకుడు నా మాటలను నిజమని నమ్మి, యిచ్చటినుండి వెళ్ళి పోయినాడు. ఇంకనూ పసివాడు! ఉండనీ, నీవు నా యాజ్ఞను శ్రద్ధగా ఆలింపుము. ఈ రాత్రియే అది కార్యగతము కావలయును. ఈ నగరములో నున్న ముసల్మానుల నందరినీ — ఒక్క కూననుగూడ విడువక — ఫిరంగి మూతికి కట్టి ప్రేల్చి, మన ప్రతిజ్ఞను నెరవేర్చుకొనవలయును, తెలిసినదా? ఇందులో హెచ్చుతగ్గులు జరుగుటకు వీలులేదు. ఈ యాజ్ఞనెవరుల్లంఘించి నను లెక్కచేయకూడదు వెళ్ళి ఆ నీచులను సైతాను లోకమునకు బంపి రండు!" అని యాజ్ఞాపించి అతనిని పంపివేసినాడు.

ఇటు రాజశేఖరుడు తన అంతఃపురమునకు వెనుదిరిగి, పెద్ద

రాయలకు జరిగిన విషయములన్నియు వివరముగ నెరిగించి, ప్రశాంతముగా నిద్రించుట కుద్యుక్తుడైనాడు. కాని, అంతఃపుర దక్షిణభాగము నుండి ఉన్నట్టుండి ఫిరంగుల ప్రేలుడు వినబడినది. ఈ శబ్దమును విని రాజశేఖరుడు దిగులుచెంది కూర్చొన్నాడు.

"తమ్ముడూ, విన్నావా? ఫిరంగుల మ్రోత అంతఃపురమువైపు నుండి వచ్చుచున్నది. బహుశః నాగన నాయకుని హత్యజేసిన పాతకుని కథ ముగిసినది కాబోలును" అన్నాడు.

"కాని, ఈ యపరాత్రిలో యీ శిక్షయా? నా కెందులకో అనుమానము వేయుచున్నది." అన్నాడు పెద్దరాయలు.

"దొంగలూ, కపటులూ పనిజేయునది రాత్రియందే. దీనిచే ప్రజాక్షోభ గలుగవచ్చునని యీ విధముగా అర్ధరాత్రమున యీ నీచు డీ శిక్ష విధించి యుండవలయును!"

ఈ విధముగా రాజశేఖరుడు చెప్పుచుండగనే ఒక్కసారిగా పది, పంద్రెండు కాదు, నూరారు ఫిరంగులు ప్రేలిన శబ్దము భయంకరముగా వినబడినది. దీనిచే రాజశేఖరుడు దిగ్భ్రమ చెందినాడు.

"అయినచో.... అయినచో.... విరూపాక్షరాయలు నన్ను మోసగించి యుండునా?...."

"మోసము! శుద్ధమోసము!! మిమ్ముల నా నీచుడు మోసగించినాడు, అన్నగారూ! ఖండితముగా మోసగించినాడు!" అని పెద్దరాయలనుచుండగా మరల ఫిరంగులు ప్రేలినవి.

కాని యీసారి ఫిరంగుల ప్రేలుడు శబ్దము ఉరుము మెరపులతో కూడిన కుంభవర్షమువలె చాలసేపటివరకూ కర్ణభేదనము గావించినవి. ఈ విధముగ ఒక ఘడియసేపు నిరంతరముగా ప్రేలుడు వినబడి అనంతరము నిలచిపోయినది. వెనువెంటనే రాజధాని ప్రజలలో చెలరేగిన క్షోభ వారికి చెవుడును కలిగించినది.

నగరములో ఒక్కసారిగా ఉత్పాదనమైనట్లు తోచినది. కాని దానిని తిలకించుటకా సహోదరుల కవకాశములేదు. వారుండిన అంతఃపుర ద్వారములు మూయబడినవి. తన నిస్సహాతను, తనకు విరూపాక్షరాయలు

మోసము చేసిన విషయమునూ దలచుకొని — రాజశేఖరరాయలకు దుఃఖము పొంగివచ్చినది. ఈ హత్యాకాండము యొక్క అపరాధి తానే యనుస ట్లతడు బాధపడసాగినాడు. అతని కీ వ్యథతో రాత్రి గడచి ఉదయ మైనదికూడ తెలియలేదు.

# 15. రాక్షసకృత్యము

రాజశేఖరు డేమి జరుగరాదని యనుకొన్నాడో అదియే జరిగినది. అత డే దురంతమును తప్పించుటకై తన చేతనైనంత సాహసమును చేసినాడో అదియే జరిగినది. విరూపాక్షరాయ లీ విధముగ తనను మోసగించగలడని అత డెప్పుడూ భావించలేదు. మోసము! శుద్ధ మోసము! వంచన. శుద్ధ వంచన! చివరకు తన నతడు వంచించినాడు. అంతటి దయాహీన్యుడు, నీచుడునగు క్షుద్రవ్యక్తి నేమి చేయవలయును? తానుకూడ దయాహీన్యుడై, హతమార్చవలయును! అతనిపై యిక కరుణ జూపరాదు. అత డొక క్షుద్రజంతువు. పాపి. అతని పాపము పండినది. అతని యవతారము సమాప్తి జెందుటకు సమయ మాసన్నమై యుండవలయును. లేనిచో అతని దైత్యపరిపాలనమునకు జిక్కి యింకనూ ఎంతమంది నిరపరాధుల రక్తము ప్రవహించునో....దానిని తప్పించవలయును....తప్పించనిచో తాను మనుష్యుడు కాడు. తాను మానవుడైనచో యీ యన్యాయమును తప్పక అరికట్టవలయును. ఈ దైత్య పాలనమున కంతము తీసుకొని రావలయును....అంతము తీసుకొని రావలయును....

రాజశేఖరుని కిపుడు విరూపాక్షరాయల గోముఖ వ్యాఘ్రత్వము తెలిసివచ్చినది. ఆ నీచుడు తమను చంపక వదలినది ఔదార్యమును ప్రకటించుటకు గాదు. తమ మూలముగ జరిగెడి పితృద్రోహమును చెలిసికొనుటకై తమను వాధ్యులనుగా జేసి, ప్రాణములతో నిలిపియున్నాడనియూ తెలిసినది. దీనిచే అతనిపై రాజశేఖర, పెద్దరాయలకు గల సద్భావన లన్నియూ ద్వేషాగ్నిలోపడి దగ్ధమైపోయినవి. వారు తమకు మోసము

చేసిన ఆ నీచుని ప్రతిబంధకమును నివారించుకొను టెట్లని గాఢముగా నాలోచించసాగినారు.

మరునా డుదయము రాజధానిలో జరిగిన అమానుష హత్యా కాండ కథ అందరినోట వినబడసాగినది. ఈ కథను విని ప్రజల ముఖములో జీవకళ గుందినది. నేడు యవనులకు పట్టిన గతి రేపు తమకు గూడ సిద్ధించగలదేమోనని భీతిల్లి యిండ్లు-వాకిండ్లను వదలి కొందరు పారిపోయినారు. మరికొందరు భగవంతునిపై భారము వేసి రాగలదాని నెదుర్కొనుటకై ధైర్యముగా నిలబడినారు.

ప్రజ లాడుకొను యీ మాటలు కావలివాండ్రను దాటి రాజశేఖరుని చెవినిగూడ పడినవి. ఆ వివరములను వినియే అతడు తల్లడిల్లినాడు.

అర్ధరాత్రిలో జరిగిన యీ నరమేధలో దాదాపు వేయిమంది యవనులైననూ మరణించియుందురు. అంతకంటెనూ ఎక్కుడు సంఖ్యలో క్షతగాత్రులైనారు. వారి యిల్లు వాకిండ్లు నేల సమమైనవి. వారి భార్యబిడ్డలు వీధులపాలైనారు. వారిమీద జరిగిన అత్యాచారములు, దుండగములు చెప్పదరము కానివి. ఒక్కమాటతో నగరమందలి యవనుల నివాస ప్రదేశము ఫిరంగి ప్రేలుడులకు చిక్కి పాడుభూమి యైనది. క్రిందటి దిన మది జీవంతముగానుండి, ఈనాటి ఉదయ మగునంతలో భీకరశ్మశానముగ మారినది.

దానిని తిలకించిన ప్రజలు తనపై తిరస్కారమును, ద్వేషాసూయలను ప్రకటించరాదని విరూపాక్షరాయ లా ప్రదేశములో వాహనముల సంచారమునూ, ప్రజలు నడచుటనూ నిషేధించిననూ అటువైపునుండి దాటివచ్చు నతదృష్టులచే అచ్చట జరిగిన నరమేధ కథ జనసామాన్యులకందరికీ తెలిసిపోయినది. ఇది విని అందరూ జుగుప్స వహించినారు. భీరువులు మూర్ఛవడినారు. ధీరుల హృదయములో ద్వేషపు దావానలము చెలరేగినది. వీరుల ఎదలో ప్రతీకారవాంఛ పొడసూపినది.

తన పిచ్చి యాజ్ఞతో విరూపాక్షరాయలు నిజమైన పిచ్చివాడే యైనాడు. అతనిలోగల మానవతా వాహిని వట్టిపోయినది. దైత్యునివలె అతడు రక్తపిపాసులై, రక్తబలిని గోర నారంభించినాడు. రక్తమును

రుచి చూచిన కొలదిని దానికై మరింత ఆతురత జెందసాగినాడు. అతని దైత్యపరిపాలనము ప్రారంభమైనది.

అతి త్వరలో సామ్రాజ్యప్రజల కతని రాక్షసపాలనము విసువును బుట్టించినది. ప్రజ లతని బారినుండి విముక్తి పొందగోరినారు. ప్రజా నాయకు లతనిని పదవీచ్యుతుని జేయుటకై పట్టుబట్టినారు. కాని తన పరి పాలనమునుగురించి నీచముగా జెప్పుకొనువారి నందరినీ అతడు క్రూర ముగా శిక్షించుచూ వచ్చినాడు. తనను ప్రతిఘటించిన వారినందరినీ చెఱలో వేయించినాడు. ప్రజ లతనిపే రుచ్చరించుటకు సైతము భీతిల్లి నారు. స్త్రీలపాలిటి కతడు కాలభైరవు డైనాడు.

అందరూ అతని నాశనమునకై ఎదురు చూడసాగినారు. అయి ననూ దీని నెట్లు సాధించవలయుననున దెవరికీ తెలియలేదు. ప్రజ లతని క్రౌర్యమునకు భీతిల్లి, అతని శిక్షలకు భయపడి ఎట్లో కాలము గడు పుచూ వచ్చినారు. వారికి తమ నీ దుష్టరక్కసుని బారినుండి కాపాడు దైవసముదొకడు అవతరించుట కావలసియున్నది. అటువంటి కారణ పురుషుని రాకకై వా రెదురు చూడసాగినారు.

విరూపాక్షరాయలు యవనులను క్రూరముగా హింసించిన పిమ్మట తనను ప్రతిఘటించిన వారి కందరికీ పాఠము నేర్పుటకై, మరణించిన వారి నందరినీ ఒక గోతిలో పూడ్చిపెట్టి దానిపై గోరీ కట్టించి, ఆ గోరీ పైన :"సామ్రాట్టులను ప్రతిఘటించి నాశనమైనవారి గోరీ"అని వ్రాయించి నాడు.

ఈ గోరీని తిలకించి ప్రజలు పిశాచదర్శనమైనవారివలె భీతిల్లి పారిపోసాగినారు. నిజమునకు విరూపాక్షరాయల పరిపాలనము పైశాచిక ప్రభుత్వమే యైనది.

ఎటుగన్ననూ హత్య-దోపిడి-అత్యాచారము!

ప్రజలు భీతిచే దుఃఖాక్రాంతులైనారు. ఈ దుష్టుని బారినుండి తమకు విముక్తి లేదేమోనను హతాశాభావ మనేకులలో అంకురించినది. వారు తమ నీదుర్మార్గుని చేతినుండి రక్షించగల దైవసమునికొరకై చకోరములవలె నిరీక్షించసాగినారు.

ఆ దిన మెంతయో దూరమున లేదు....

ఆ పాపియొక్క పాపము పండినది....

ఆ దుష్టుని యవతారము సమాప్తిజెందు రోజు దగ్గరపడినది. తనకు జరిగిన పరాభవమువలన రాజశేఖరుని కతనిమీద ద్వేషము జనించినది. ఈ హత్యాకాండలో తన ప్రవేశమున్నట్లు దోచి, అతనికి తనమీద తనకే విసుగు కలిగినది.

ఈ నీచునకు భీతిల్లి, రక్తపాతమునకు భయమంది మల్లికార్జున రాయలు సింహాసనమును వదలుకొన్నాడు!

ప్రజ లీ విరూపాక్షుని తమ ప్రభువుగా సమ్మతించి, అతని పాలనమును సహించుకొనుచూ వచ్చినారు!

అతని పైశాచిక కృత్యములకు సాక్షిగా తాము జీవించియున్నారు. రాజశేఖరునికి తనమీద, తన మాతాపితరులమీద ద్వేషాసూయలు పెల్లుబికి వచ్చినవి.

ఇదంతయునూ కనులారా గాంచియూ తాను వూరక యుండినందుల కతనికి తనపై ఏవగింపు గలిగినది. ఈ విషయమునే తలచి తలచి అతడు పిచ్చివాడైనాడు. చింతాజనకమైన అతని వదనము, నిద్ర లేని నయనములు, రేగిన తల వీటిని జూచి అతని కేదైననూ అస్వస్థత యేర్పడి యుండవచ్చునని పెద్దరాయలు భీతిల్లినాడు. ఈ స్థితిలోనే మరి కొంతకాలమున్నచో రాజశేఖరునికి పిచ్చిపట్టుట ఖండితమని భావించి నాడు.

ఒకనా డతడు యీ విషయమై అన్నగారితో ప్రసంగించినాడు :

"అన్నగారూ! మీ పరిస్థితిని జూచిన నాకు భీతి కలుగుచున్నది. మీ యారోగ్యము చక్కగా లేదా, ఎందులకు మీరట్లున్నారు?" అని ప్రశ్నించినాడు.

"సోదరా, నాకు పిచ్చిపట్టుచున్నది!"

"ఎందులకు అన్నగారూ! ఇప్పు డటువంటి దేమి జరిగినది?" ఆందోళనగా అడిగినాడు.

"విరూపాక్షరాయల పైశాచ్య పరిపాలనమును కనులారా గాంచియూ ఫిరికిపందవలె నుండిన పిచ్చిపట్ట కేమిచేయును?"

"అందులకు మీరేమి చేయవలెనున్నారు?"

అతనిపై పగదీర్చుకొనవలయు ననిపించుచున్నది. ఈ పోరాటములో నేను మరణించిననూ సరియే, ఆ నీచుని యవతారమునకు సమాప్తి తీసుకొని రావలయునని యున్నాను."

"అదెట్లు సాధ్యమగును?"

"ఎట్లయిననూ సాధ్యమై తీరవలయును. లేనిచో నాకు పిచ్చిబట్టుట నిశ్చయము. అతడో లేక నేనో మరణించవలయును. నాకీ నీచుని పైశాచిక ప్రభుత్వము విసుగును బుట్టించినది. ఇక దీని కంతమును దీసుకొని రావలయును:"

మరల అదియే ప్రశ్న: "అదెట్లు సాధ్యమగును?"

దీనికి జవాబు వారికి తోచలేదు. వట్టి ప్రశ్న మాత్రము వారియుందు నిలబడినది. జవాబునకై తలబ్రద్దలు కొట్టుకొన్నారు.

వాసరములపై వాసరములు గడచిపోయినవి —

కాని, ఏ మార్గమునూ గోచరించలేదు. దీనిచే రాజశేఖరునికి నిరాశా హిమము దట్టముగా పేరుకొనినది. దానిని భేదించుకొని, వెలుపలికి వచ్చు మార్గ మగుపడలేదు.

చివరికొకరోజు వారిపాలిటి దైవము కనులు దెరచినది.

దానితోబాటు సామ్రాజ్య భాగ్య బాల భాస్కరుడుకూడ ఉదయించి నాడు.

స్వేచ్ఛకై పరితపించుచున్న చిలుకకు — పంజరములోని కీరమునకు — విముక్తి లభించెడి మంగళ ముహూర్తము సమీపించుచూ వచ్చినది—

ఆనాడు పంపా విరూపాక్షరాయల రథోత్సవము. విరూపాక్షాలయములో పంపాపతికి విశేష పూజ కేర్పాటులు గావించబడినవి. ఈ ఉత్సవమునకు సామ్రాట్టుకు ప్రత్యేకాహ్వానము బంపిననూ అతడు మాత్ర మిందులో పాలుగొనుట కిచ్ఛగించలేదు. భగవంతుడా నా డతని యవతార సమాప్తికై నిశ్చయించియుండగా అతనికి భగవత్సేవా భాగ్యమెట్లు లభించగలదు?

ఆనాడు రాజశేఖరుడు పంపా విరూపాక్షస్వామి దర్శనమున కనుమతి నీయవలసినదని ప్రార్థించుచూ, విరూపాక్షరాయలకు లేఖ వ్రాసి పంపినాడు.

ఆ లేఖకు అనుమతి నొసగుటలేదను జవాబు లభించినది. రాజశేఖరుడు సార్వభౌముని మనసును వశపరచుకొని, అనుమతి బడయగో సింగనదండనాయకుని మంచి మాటలచే వశము జేసుకొని విరూపాక్షరాయల దర్శన భాగ్యమును పొందినాడు.

"ఏమి సమాచారము, కుమారా?" విరూపాక్షరాయలు కుతూహలముతో ప్రశ్నించినాడు.

"ప్రభూ! నేడు పంపా విరూపాక్షస్వామి రథోత్సవముగదా? ఈ నాటికి విజయనగరము యవనులనుండి విముక్తినిబొంది ఒకటిన్నర శతాబ్దము గడచినదికదా? పంపానాధుడు పంపాంబికను వరించిన దీపుణ్యదినముననే కాదా? అటువంటి యీ యుత్సవమునకు నేను వెళ్ళి స్వామి దర్శన భాగ్యమును బడసి రావలయునని యున్నాను. అట్లే సామ్రాట్టుల కళ్యాణమునుకూడ కోరి రాదలచితిని. అంతఃపురములో ఏకాకిగా నుండుటచే నా కిపుడు జనసందోహమునూ, జాతరనూ చూడకోరిక యగుచున్నది.... తమరు నా యీ కోర్కెను నెరవేర్చి, నన్ననుగ్రహించవలయును" అని దైన్యముగ బ్రార్థించినాడు.

"కుమారా! ఇంత అల్పవిషయమునకై నీ వింతగా బ్రార్థింపవలయునా? ఇందుచే నీకు ముదము చేకూడునట్లయిన వెళ్ళి రమ్ము. నీవు వెళ్ళదలచిన అమాత్యుల కాజ్ఞాపించెదను. వారు నీ దైవసందర్శనమునకు తగిన ఏర్పాటు చేయగలరు" అని అచ్చట పూలకుండీలోనున్న ఒక చిన్న గులాబీని తీసుకొని, దాని సౌందర్యమునూ, పరిమళమునూ ఆఘ్రాణించుచున్నవానివలె క్షణకాలము చూచుచూ నిలబడినాడు.

అంతలో అతని కేమనిపించినదో రాజశేఖరునివైపు తిరిగి :

"కుమారా! ఈ గులాబీ పుష్పమును జూచితివా? దీని సౌరభమెవరికి? పెంచిన వృక్షమునకు కాదు. దారిని బోవువారికినీ కాదు, దేవతార్చనమునకునూకాదు. బలమున్న బల్లిదులకు! అదేవిధముగా ఈ సింహా

సనము — ఈ సామ్రాజ్య పదవి; గౌరవము; అధికారములు వేడుకొన్న వచ్చునవికావు. కోరినచో లభింపవు. బలమున్నవారికి మాత్రము లభ్యమగు వస్తువులు। నీవు యిప్పటికైననూ ఈ సత్యమును గ్రహించియుందు వనుకొందును?" అని చిరునవ్వు నవ్వినాడు.

కాని రాజశేఖరుడు మాత్రము నవ్వలేదు.

అతడు నవ్వక పోవుటనుజూచి, విరూపాక్షరాయలతనిని తీక్ష్ణముగా జూచినాడు. ఆ చూపులో తిరస్కారము గోచరించినది.

ఆ తీక్ష్ణదృక్కుల నెదిరించలేక రాజశేఖరుడు తలవాల్చి నిలబడినాడు.

ఆ దృష్టినిజూచి క్రూర మృగమొకటి తన కాహారముగా వచ్చిన ప్రాణి మాంసమునూ, శరీరసౌష్ఠవమునూ పరికించుచున్నట్లలనికిదోచి, గుండె ఝల్లుమనినది. శరీరమంతయునూ స్వేదముతో తడిసి ముద్దయైనది.

అంతలో ఎవరో అచ్చటికి వచ్చినట్లయినది.

"ఎవరు, సింగననాయకులా?" అని అంటూ విరూపాక్షరాయలు రాజశేఖరుని సమీపించి ద్వారమువైపు తొంగిచూచినాడు. ఈ సమయము జూచి రాజశేఖరుడు తన మొలలో దాచుకొనియుండిన విషపూరితమైన కైజారునుతీసి, విరూపాక్షరాయలపైబడి అతని వెన్నులో బలముగా పొడిచినాడు.

"అయ్యో, చచ్చితిని" అని అరచుచూ విరూపాక్షరాయలు నేల గూలినాడు.

రాజశేఖరు డతని శరీరములో గ్రుచ్చుకొనియున్న కైజారును తీసి మరల మరల గాయపరచినాడు. ఆ గాయములకు రక్తము మడువుగట్టినది. దానిలోపడి దొరలుచూ అత డతి కష్టముతో అంతిమశ్వాస విడచినాడు.

విరూపాక్షరాయల గావుకేకవిని, పహరా నిచ్చుచుండిన నల్వురైదుగురు భటులు పరుగునవచ్చి రాజశేఖరునిమీద పడినారు. అప్పటికే అచ్చటికివచ్చి రాజశేఖరుని కలసికొనిన పెద్దరాయలా సైనికులమీద పడి, వారిని తన ఖడ్గమునకు బలియిచ్చి రాజశేఖరుని కాపాడినాడు.

పెద్దరాయ, రాజశేఖరులిద్దరూగలసి విరూపాక్షరాయల శవము

నెవరూ చూడని స్థలమునకు సాగించినారు. అతని వ్రేలిలోనున్న రాజ ముద్రికను రాజశేఖరుడు తీసుకొని వెలుపలికి వచ్చినాడు. విరూపాక్ష రాయలను వెదకికొని సింగననాయకు డచ్చటికి వచ్చినాడు.

అతనిని దూరమునుండి జూచి, రాజశేఖరుదేదియో పనిలో నిమగ్నుడై యున్నట్లు నటించుచూ మౌనముగా నిలబడినాడు. అతనినిజూచి సింగనదండనాయకుడు :

"సామ్రాట్టు లెచ్చట నున్నారు? నన్ను రమ్మని కబురుచేసినారట" అని ప్రశ్నించినాడు.

"అదిగో! సామ్రాట్టులచ్చట నీరాక నెదురు చూచుచున్నారు." అని వేరొక దిక్కును జూపినాడు.

సింగన దండనాయకు డటు చూచునంతలో యిటు దాగియుండిన పెద్దరాయ లతనిమీదబడి, ఒకే ఒక్క ఖడ్గప్రహారముతో అతని తల నరికి వేసినాడు. అతని శరీరము రక్తపు మడుగులో తేలినది. అక్కడికి యిద్దరు దుష్టుల యవతారము ముగిసినది.

ఈ స్థితిలో తామంతఃపురములో ఎక్కువకాలముండు టపాయకరమని గ్రహించి, రాజశేఖరు డచ్చటనున్న సేవకుని సమీపమునకు బిలిచి, అతని చేతికి రాజముద్రికనిచ్చి,

"సార్వభౌములు విశ్రమించియున్నారు. ఈ ముద్రికనుజూపి, చెఱసాలలోనున్న తిమ్మయామాత్యులను వెంటనే యిచ్చటికి దోడ్కొని రావలసినదని రాజాజ్ఞగా చెఱసాలాధికారికి తెలుపుము" అని యాజ్ఞాపించినాడు.

తిమ్మయామాత్యుడు వచ్చునంతవరకూ ఆ సహోదరులకు ప్రాణములో ప్రాణము లేకపోయినది. వారి యదృష్టము కొలవిని ఆనాడు అంతఃపురములోనున్న సేవకులలో చాలమంది రథోత్సవమునకు వెళ్ళియున్నారు. తక్కిన కావలివాండ్రు పండుగ భోజనముచేసి, బాగుగా త్రాగి మైకములో పడియున్నారు. అందువలన వారు గావించిన విరూపాక్షరాయలహత్య ఎవరికినీ తెలియలేదు. పండుగ కోలాహలములో లోపల జరిగిన యీ గడబిడ లోపలనే అణగిపోయినది.

ఇంతలో తిమ్మయామాత్యుడు అచ్చటికి పరుగున వచ్చినాడు. భీతిల్లుచునే అతడు వచ్చి సామ్రాట్టులముందు నిలబడి, శిరము పైకెత్తి చూచినాడు—ఎదుట కనబడినది రాజశేఖరుడు. అతడు పరుగున వచ్చి తిమ్మయామాత్యులను కౌగిలించుకొని, అతని నేకాంతమునకు తోడ్కొని వెళ్ళి, జరిగిన విషయములను రెండే మాటలలో చెప్పినాడు. తిమ్మయామాత్యు లీ మాటలను విని, దృశ్యములను జూచి తన చెవులను-కనులను తానే నమ్మలేకపోయినాడు చివరి కా రాక్షసుని యవతారము సమాప్తమైనదని తెలుసుకొని నెమ్మదిగా ఒక నిట్టూర్పు విడచినాడు. క్షణకాలానంతరము :

"ఆ పాపి కథ ముగిసినది. విజయనగర సౌభాగ్యచంద్రునికి పట్టిన రాహువు వదలినది" అని ముదమందినాడు.

# 16. నిష్కామయోగి

చివరకు విరూపాక్షరాయల పైశాచిక ప్రభుత్వమునకు ముగింపు కలిగినది. అతడు మరణించగనే సామ్రాజ్యాకాశమున ఆవరించిన అనిశ్చయతా కారుమేఘములు చెదరిపోయినవి.

అతడు సింహాసన మలంకరించిన సుమా రిరువది సంవత్సరముల కాలము విజయనగర చరిత్రయం దొక రక్తరంజిత అధ్యాయమైనది. మోసము, వంచన, విద్రోహము, అత్యాచారముల హృదయవిదారకమైన కథ యైనది. క్రాంతి-ప్రతిక్రాంతి గాథయైనది.

విరూపాక్షరాయలు ధర్మాత్ముడైన మల్లికార్జునరాయలను సింహాసనమునుండి తొలగించి, అధర్మముగ సింహాసన మాక్రమించుకొనినను, దానిని దీర్ఘకాలమువరకూ తన యధీనమున నుంచుకొనుటకు సమర్థుడు కాలేకపోయినాడు. చివరకు ధర్మమునకే జయము లభించినది. విరూపాక్షరాయల మరణముతో ఒక దురంతాధ్యాయము ముగిసినది. ప్రజలాతని మరణవార్త విని సంతోషముతో పండుగలు చేసుకొన్నారు.

ప్రజాజీవితములో హఠాత్తుగా క్రమ్ముకొనిన కారుచీకటి తొలగి క్రొత్త జీవన సుప్రభాతమైనది. మరల వారు ధర్మాత్ములైన మల్లికార్జున రాయల పాలనమును సంతోషముతో సమ్మతించుటకు సిద్ధపడినారు.

కాని మల్లికార్జునరాయలకు మరల సార్వభౌముడు కావలయునన్న యాశ లేదు. అత డప్పటికే ఆధ్యాత్మిక మార్గమున చాలదూరము పయనించినాడు. ఇహలోకపు ఏ వస్తువూ అతని నాకర్షించలేకపోయినది.

తిమ్మయామాత్యుడు మల్లికార్జునరాయలను మరల సింహాసన మధిష్ఠింపజేయుటకై చాల శ్రమపడినాడు.

"ప్రభూ! తమను మరల నేను ప్రాపంచిక జంఝాటమునకు ద్రిప్పుచున్నానని భావించకుడు. ఈ లోకమున నున్నంతవరకు మీ రీ వలయమునుండి తప్పించుకొనుటకు వీలులేదు. ఈ జీవనమును నిష్కామ కర్మగా గడుపవలసినది నిజమే. తామరాకుపై నీటిబొట్టువలె యీ కృత్యములలో అంటియూ అంటకుండవలయును. శ్రీకృష్ణభగవానుడు చెప్పిన 'అనాసక్తి' యోగ మిదియే! ఇదియే గీతార్థము. తమరు మా కెల్లరకూ పెద్దవారై మా కొక దిక్కు జూపవలయునని మా యాకాంక్ష. రాజర్షి యగు జనకచక్రవర్తివలె, తమరు సామ్రాజ్యమును చూచుకొనుడు. సార్వభౌములై తా మిహపరముల సాధనమునకు బూనుకొనవలయునని మా అందరియొక్క ఆశ." అని వినమ్రుడై ప్రార్థించినాడు.

"అమాత్యులూ! ఈ విషయమై నే నిదివరకే నా యభిప్రాయము నెరిగించియున్నాను. నా కీ రాజకీయములం దాసక్తి లేదు. ఆసక్తిలేని కార్యమును చేబూని, ఆత్మవంచన చేసుకొనలేను. అట్లు చేయుటచే ప్రభువుగా నేను కర్తవ్యభ్రష్టుడ నగుదును. అటు ఆధ్యాత్మమార్గములోకూడ వెనుకపడెదను. అందుచే నా ఆత్మసమ్మతముకాని పనికి మీరు నన్ను ప్రేరేపించకుడు. విరూపాక్షరాయల మరణముతో యిపుడు సామ్రాజ్యమునకు సంభవించిన గండము తప్పినట్లయినది. ప్రజల నా దుష్టుని బారినుండి కాపాడిన రాజశేఖరునకే యీ సింహాసనము నర్పించి, సార్వభౌమ పట్టము గట్టుడు. ఇందులకు నా శుభాశీస్సు లొసంగుచున్నాను. అతడు ప్రజల ప్రియతమనాయకుడైనాడు. వారి యాశలకు–ఆకాంక్షలకు

సంకేతమైనాడు. అతనిచే ప్రజాజీవితములోకూడ నవోదయము కాగల దను నమ్మిక నాకు గలదు. శత్రువులతో నిండిన సామ్రాజ్యనౌకను అత డొక తీరమునకు చేర్చగలడను ధైర్యముకూడ గలదు. మీ రతనిని సార్వ భౌమునిగ జేయుడు. పెద్దరాయలను యువరాజుగ జేసి, ఆ సహోదరు లకు సహాయులుగానుంటూ, మీ రీ సామ్రాజ్యమును కాపాడవలయునని నా ప్రార్థనము!"

ఈ మాటలకు అమాత్యుడు మారు పలకలేకపోయినాడు. గత్యం తరములేక రాజశేఖరునివద్దకు వెళ్ళి జరిగిన సంగతినంతయూ వివ రించినాడు :

"కుమారా! నీ విపు డీ సామ్రాజ్యనౌకను నడుపు నావికుడవై ప్రజాకోటి కభయము నీయవలయును" అని నిట్టూర్చినాడు.

ఈ మాటకు రాజశేఖరుడు వెంటనే జవాబు చెప్పలేదు. అత డేదియో ఆలోచిస్తూ కూర్చున్నాడు. అతని పరధ్యానమును జూచి మరల తిమ్మయామాత్యుడే అనినాడు :

"కుమారా! సింహాసనమును దీర్ఘకాలము ఖాళీగా నుంచుట సామ్రాజ్యమునకు క్షేమము కాదు. సింహాసన విషయము విరూపాక్ష రాయల అంత్య సంస్కారానంతరము ఆలోచింతమని యన్నాను. ఈ విషయమై సామ్రాట్ మల్లికార్జునరాయలుకూడ తమ యభిప్రాయమును స్పష్టముగ వెలిబుచ్చినాడు. సామ్రాజ్య ప్రజకూడ విరూపాక్షరాయల పైశాచిక ప్రభుత్వమునుండి రక్షించిన నిన్ను ప్రభువుగా అంగీకరించు చున్నది. అన్నివిధముల నీ వీ పవిత్ర సింహాసన మధిష్ఠించుట కర్హు డవై యున్నావు. దీని నెక్కి నీవు ప్రజాభీష్టమును నెరవేర్చి, స్వామి భక్తిపరాయణుల మనస్సును సంతోషపరచవలయునని విన్నవించు చున్నాను."

ఈ మాటలకు సైతము రాజశేఖరుడు వెంటనే జవాబివ్వలేదు. ఇది జూచి తిమ్మయామాత్యులకు నిజముగ విస్మయము కలిగినది.

"కుమారా! నీ వేదియో ఆలోచించుచున్నావు. సింహాసన మధిష్ఠిం చుట నీ కిష్టము లేదా? నీ మనసున నేమి గలదో చెప్పుము!" అమాత్యుని పలుకులలో విసుగు ధ్వనించినది.

రాజశేఖరుడు చిరునవ్వు నవ్వి అమాత్యునివైపు జూచినాడు. ఆ చూపులోని అర్థమును గ్రహించి తిమ్మయామాత్యుడు :

"కుమారా! వినోదమున కిది సమయము కాదు. ప్రజాకోటి సింహాసనముపై నిన్ను జూడ తహతహలాడుచున్నది. నీ సేవకు సామ్రాజ్య నిష్ఠావంతులు నడుముగట్టి నిలచియున్నారు. నీకు భువనేశ్వరీ మాత కృప గలదు. పూజ్య విద్యారణ్యమౌనీంద్రుల అనుగ్రహము గలదు. మీ తండ్రిగారి యాశీస్సునూ లభించినది. ఇంకెందులకు నీవు అనుమానించుచున్నావు ? సింహాసన మధిష్టించుటకు మీనమేషములు లెక్కించుచున్నావు?"

"అమాత్యులూ! నా మనసుననున్న విషయమును జెప్పిన మీరు కోపపడరుకదా?"

"లేదు, చెప్పుము కుమారా!"

"నా మాటలను మీ రన్యథా భావింపకుడు. పిరికిపందనై నే నీ మాట లనుటలేదు. కాని వీరుడనై —ధర్మవీరుడనై — ఈ మాటలను చెప్పుచున్నాను. సత్యపథానువర్తినై ఈ సలహా నిచ్చుచున్నాను. మీ రీ సింహాసనమును నా సోదరుడగు పెద్దరాయల కర్పించుడు. అతనిని సార్వభౌమునిగా జేసి మన మెల్లరము సంతోషపడుదము!"

"ఏమీ? పెద్దరాయలకు విజయనగర సింహాసనమా?" ఆశ్చర్యముతో తిమ్మయామాత్యుడు ప్రశ్నించినాడు. రాజశేఖరు డీ విధముగా అనగలడని అతడు స్వప్నమునైననూ దలచలేదు.

రాజశేఖరుడుమాత్ర మేదియో కలగనుచున్నవానివలె కూర్చున్నాడు.

"ఏమీ, పెద్దరాయలకు సింహాసనమా? రాజశేఖరా నీవు జాగ్రదావస్థలో నున్నావా లేక గలగనుచున్నావా?"

"నేను కలగనుచుండలేదు అమాత్యులూ! యదార్థమునే చెప్పుచున్నాను."

రాజశేఖరుని వాక్కులలో నిరుద్వేగము గలదు.

"ఏమీ, నీవు కష్టించి సంపాదించిన ఈ సింహాసనమును పెద్దరాయల కర్పించుకొనెదవా?"

"ఔను!"

"సింహాసనమును అన్యులపాలుజేయు హక్కు నీకు లేదు."

"ఎందులకు?"

"అది జ్యేష్ఠ సంతతికి మాత్రమే లభించును."

"నేనే దానిని పెద్దరాయలకు అర్పించుచున్నాను."

"ఎందులకు, సార్వభౌముడగుటకు నీ కిష్టములేదా?"

"లేదు!...."

"ఎందులకో తెలుసుకొనవచ్చునా?"

"ఆదర్శ సామ్రాట్టగుటకు వలసిన యర్హత లన్నియునూ నీకు గలవని మేమందరమూ భావించినాము. మల్లికార్జునరాయలే స్వయముగా ఆ విధముగా దలచినారు. ప్రజలుకూడ అనుకొన్నారు. ఇట్లుండగా నీకు సింహాసన మధిష్ఠించుట కర్హతలేదా?"

"అమాత్యులూ, నేను పాపిని. పితృవధ జేసిన పరమ పాపిని! తండ్రి స్థానములోనున్న విరూపాక్షరాయలను హత్యజేసినాను. నా చేతులారా వారినిజంపి రక్తాభిషేకము జేసినాను. ఈ శరీరము మలినమైనది. పవిత్రమైన యీ విజయనగర సింహాసన మెక్కుటకు నేను యోగ్యుడను గాను. నావంటి కళంకితుడు సింహాసన మెక్కుటకు అర్హుడుకాడు."

"ఏమి, నీ మాటలు రాజశేఖరా! ఎంతమంది రాజులు రక్తమును ప్రవహింపజేసి సింహాసనముపై గూర్చొనలేదు? నీ పినతండ్రియైన విరూపాక్షరాయలు సింహాసనమును మీ తండ్రిగారినుండి దురాక్రమించుకొనిన దెట్లు? హత్య, మోసము, కుతంత్రములతో యిది అతని వశమైనది. నీవు అటువంటి నీచుని సంహరించి దుష్టులను శిక్షించి, శిష్టులను రక్షించినావు. నీ సింహాసనమును మరల పొందగలిగినావు. దీనిచే నీకు కళంకము కలుగ నేరదు. విరూపాక్షరాయలవంటి నీచుని పౌరుషముగా బరిమార్చి సామ్రాజ్య ప్రజలను రక్షించినావు. పితృవధాపాపము నిక్కువముగా నీకు కలుగదు. ఒకవేళ అటువంటి పాపమేర్పడినచో, శాస్త్రములలో వాటి ప్రాయశ్చిత్తమున కనేకవిధులు—దానధర్మములు గలవు. నీ వీ విషయమై చింతించకుము. సామ్రాజ్య రమావధూటి నిన్ను వరించి వచ్చినది. ఆమెను నీవు తిరస్కరించకుము, ఇది ఎవరికినీ భూషణముకాదు,"

"అమాత్యులూ! నేను దుష్టుడగు విరూపాక్షరాయలను సంహరించి, సామ్రాజ్య ప్రజలకు మేలుచేసి యుండవచ్చును. కాని అతడు నా పిన తండ్రియను విషయమెవరునూ దాచలేరు. అతని తండ్రియూ, మా పితామహులూ ఒక తండ్రిబిడ్డలేకదా? దీనిచే నాకు పితృహత్యా పాతక మంటుకొనలేదా? ఏ పుణ్య తీర్థములో గ్రుంకిన నా యీ పాపము పరిహారము కాగలదు? ఇటువంటి నేను పూజ్యులగు విద్యారణ్య మౌనీంద్రులచే స్థాపితమైన, ధర్మరాజు లంతటి మహాత్ములు పాలించిన యీ సింహాసనమునెక్కి మలిన పరచలేను!"

"అయినచో, నీవు జెప్పునదేమి?"

"అనాదికాలమునుండి, వంశపారంపర్యముగా వచ్చిన యీ పవిత్ర సింహాసనము నాచే అపవిత్రమగుట సహించలేను. దీనిని నే నధివసించి మలిన పరచలేను. ఈ సింహాసనమును పరిశుద్ధుడై న పెద్దరాయల కర్పింపుడు. అతడుకూడ నావలెనే సామ్రాట్ మల్లికార్జునరాయల సుపుత్రుడే. సింహాసనమెక్కుటకు నాలోగల అర్హతలన్నియునూ అతనిలోనూ గలవు."

"అయినచో, మున్ముందు నీవేమి చేయగలవు?"

"నేను నా దుష్కృత్యపు ప్రాయశ్చితమునకై సన్యాసమును స్వీకరించగలను. ఇచ్చటనేయుండి రాజ్యపాలనమునందు నా సహోదరునికి సాయపడుచూ, ఆ విధముగా సామ్రాజ్యమునకు నా సేవను చెల్లించగలను."

"ఇదియే నీ తుది నిర్ణయమా?"

"ఔను. పంపాపతిసాక్షిగా సత్యము. నేను సింహాసనమధిష్ఠించుట లేదు. అది యీ జన్మలో సాధ్యముగాని పని...."

"అయినచో...."

అని ఆగి రాజశేఖరుని వదనమును పరికించినాడు. అతడు నిశ్చలముగ కూర్చొనియున్నాడు.

"ఒకవేళ యీ సింహాసనమును పెద్దరాయలుకూడ నిరాకరించిన, అప్పుడేమి చేయవలయును?"

"నే నతనిని సమ్మతింపజేయగలను."

"ఒకవేళ నీ తదనంతరము నీ బిడ్డలు సింహాసనమునకై పోరాడి నచో?"

"అటువంటి పరిస్థితి ఏర్పడరాదనియే నే నవివాహితుడుగనే యుండ దలచినాను."

"రాజశేఖరా! ఎవరి యపరాధమున కెవరికి శిక్ష? నీవు యిది అంత యునూ బాగుగా నాలోచించితివా?"

"అమాత్యులూ! అంతయునూ దీర్ఘముగా నాలోచించియే నే నీ నిశ్చయమునకు వచ్చినాను. నా కీ రాజ్యకోశముల ప్రలోభములేదు."

"అయినచో నీవు సార్వభౌముని కుమారుడవై సన్యాసమును స్వీక రించెదవా?"

"ఔను. కాని వీరసన్యాసి యయ్యెదను. పూజ్య విద్యారణ్యులవలె సన్యాసిగానుంటూ సామ్రాజ్యసేవ చేయుదును."

ఎందులకో యీమాట లాలించి తిమ్మరయామాత్యుని కను లశ్రు పూరితములైనవి. అత దేదియో మాటలాడ జూచినాడు. కాని సాధ్యముగాక అచటినుండి లేచి వెళ్ళిపోయినాడు.

సింహాసన విషయ మత డనుకొనినంత సులభతరము కాలేదు. ఈ వార్తవిని పెద్దరాయలుకూడ మొదట అందులకు సమ్మతించలేదు.

"అమాత్యులూ! పూజనీయులగు తండ్రిగారూ, భ్రాతలైన రాజ శేఖరులూ త్రోసిపుచ్చిన సింహాసనము నాకునూ వలదు. దానికి న్యాయ మైన హక్కుదారులగువారే వద్దనిన పిమ్మట నేను మాత్ర మెందులకు దానిని స్వీకరించవలయును?" అని నిర్దాక్షిణ్యముగా చెప్పినాడు.

"కుమారా! నీవునూ నీ సహోదరునివలె యీ సింహాసనమును నిరాకరించిన, యిక ఈ పవిత్ర సింహాసనము సంగమవంశము వారి చేయి విడచి వెళ్ళగలదు. సింహాసనమును కాపాడుకొను ధైర్యము నీకు లేనిచో ఆ మాట చెప్పుము. పురుషుడవైనచో యిటువంటి మాటలు నీ నోటి వెంట రాజాలవు."

"దానిని నా సహోదరుడైన దేవరాయల కిమ్ము!"

"సింహాసనమును దారినబోవు దానయ్యల కిచ్చుట కిది మార్పి కి

వస్తువేమియునూ కాదు — దీని నధివసించుటకు సైతమర్హత కావలయును!" అని కొంత నిష్ఠురముగా బలికినాడు తిమ్మయామాత్యుడు.

"నేను చెప్పిన దానిలో తప్పేమి గల దమాత్యులూ?"

"తప్పు-ఒప్పుల మాట నేను చెప్పలేదు కుమారా! కాని సింహాసన మనిన నీ కంటికి తేలికగా తోచుటనుజూచి యట్లంటిని. ఇది ధర్మరాజు వంటి వారెక్కిన సింహాసనము. పూజనీయులగు హక్క-బుక్కరాయ సోదరు లధివసించినారు. సామ్రాట్ ప్రౌఢదేవరాయ లలంకరించి యుండిరి. దీనిని నీవు తలచుకొనిన వారి కీయవచ్చునని భావించియుండిన అది తప్పు. అందులకై నేను విచారించుచున్నాను."

ఈ పలుకులాలించి పెద్దరాయలు నవ్వినాడు.

"పెద్దరాయా! ఇది వినోదమునకు సమయముగాదు. నా మాటలను శ్రద్ధగా వినుము. ఇది భగవతీ భువనేశ్వరీమాత కృపచే, పూజ్య విద్యారణ్యమౌనీంద్రులు స్థాపించిన ధర్మసామ్రాజ్యము. దీని నెక్కుటకు అర్హత కావలయును. వైరాగ్య సంపన్నులైన మీ పూజ్యపితరులు దీనిని మీ కర్పించినారు. రాజశేఖరుడు పితృవధను తలలో నింపుకొని నీ కర్పించి నాడు. నీవు దానిని యితరుల కర్పింప జూచుచున్నావు. ఈ సింహాసనము మీకు అవసరములేనిచో, విరూపాక్షరాయల నెందుకు వధించినారు? అతనికి వ్యతిరేకముగా ముట్టడి నెందులకు జరిపినారు? ఇవి భీరువులయొక్క లక్షణములేగాని — వైరాగ్య లక్షణములుకావు. నీవైననూ ధీరతగల పురుషునివలె మాటలాడుము. త్యాగ తిమిరమునబడి, అవ్యవహారపు జీవనము చేయకుము. నమ్మినవారిని రక్షించు కర్తవ్యమును దలంచి, నా మాటను వినుము సింహాసన మధిష్ఠింపుము. ప్రజలను ధర్మముతో గాపాడుము. దీనిచే ఇహపరముల కళ్యాణము కలుగగలదు."

"నాకు సింహాసన మక్కరలేదని చెప్పుట లే దమాత్యులూ! కాని అన్నగారి కక్కరలేని సింహాసనము, రేపు వారి కుమారులు కోరినచో, అపుడు వారికి అడ్డము రాకూడదని చెప్పితినంతియే!"

"నీవా విషయమై చింతింపబనిలేదు. రాజశేఖరుడు సన్యాసమును స్వీకరింప నిశ్చయించినాడు."

"ఇప్పుడేదియో భావోద్రేకముతో అట్లు ప్రతినజేసి, రేపు అందులకై పరితపించవచ్చును!"

"నీవు చెప్పెడిమాట నిజమే. కాని రాజశేఖరుడు మాటమాత్రమునకై యిట్లు చెప్పటలేదు — హృదయస్ఫూర్తిగా చెప్పుచున్నాడు. పంపాపతిమీద ఆనబెట్టి ప్రతిజ్ఞ స్వీకరించినాడు!"

"ఇది తాత్కాలికమైన ప్రతిజ్ఞ కాదుగదా?"

"కాదు. అది భీష్మప్రతిజ్ఞ!"

"అమాత్యులూ! నా మాటలను మీ రన్యథా భావించరాదు. లోకమున రాజ్యకోశములు, పదవులు ఎటువంటివారి నెటువంటి స్థితికి తీసుకొని రాగలవో ఎవరునూ చెప్పజాలరు. రేపీ సింహాసనమునకై రాజశేఖరుడు పశ్చాత్తాపపడరాదు అందులకై స్వయముగా మా అన్నగారి నుండియే నాకు వాగ్దానము కావలయును!" అని వివరించగా తిమ్మయామాత్యుడు నవ్వినాడు.

అతని కోరిక ప్రకారమే అమాత్యుడు రాజశేఖరుని రప్పించినాడు. అన్నగారి ముఖ మవలోకించుచూ తమ్ము డనినాడు :

"అన్నగారూ! మీ కీ సింహాసనముపై కోరిక లేకపోయిననూ, యితర సోదరులు దీని నపేక్షింపరని చెప్పుటెట్లు? స్వార్థపరు లెవరైననూ వారిని నాపై కత్తిగట్టునట్లు జేయవచ్చును—అటువంటి పరిస్థితి ఏర్పడిన నెట్లు? ఆ విరసమును తప్పించు మార్గమేది?"

"నీ వా చింతజెందనక్కరలేదు తమ్ముడూ! ఈ సింహాసనమును నేను నీకు దత్తము చేయుచున్నాను. ఇక ఆ యధికారము నీది. నేను నీ కండదండనై, రాజ్యపాలనమున సాయపడగలను. ధైర్యముగా నీవు సింహాసనము నధిష్ఠింపుము!" అని ధైర్యము చెప్పినాడు.

పెద్దరాయలు తాను సార్వభౌముడు కాగలడన్న సంతోషముతో అన్నగారివద్ద వీడ్కోలు పుచ్చుకొని వెళ్ళిపోయినాడు. అతడు వెళ్ళిన పిమ్మట రాజశేఖరుడు అమాత్యునితో :

"మంత్రిగారూ! మా పెద్దరాయల స్వభావమే అటువంటిది. అత డెవరినీ నమ్మడు. ఇది సార్వభౌముడు కాబోవువాని కుండవలసిన

గుణమే! కాని, నమ్మవలసిన వ్యక్తులను నమ్మనిచో, రాజ్యపాలనము జరుగుటెట్లు!" అని నవ్వినాడు.

"కుమారా! మన యదుపులోనికి వచ్చిన పిమ్మట అతనిని చక్క దిద్దుకొనవచ్చును. నీవు యీ విషయమై చింతించకుము" అని సమాధాన పరచినాడు.

"ఎందులకో నా కా నమ్మిక లే దమాత్యులూ!"

"ఎందులకు కుమారా?"

"మా ఉభయుల జీవనవాహిని ప్రవహించిన మార్గమే వేరు. నా స్వభావమువంటిది కా దతనిది. నా యాదర్శము వేరు — అతని యాదర్శము వేరు. ఎంతైననూ అత డీ లోకపువాడు. అతనికి అధికారము, వైభవము, అట్టహాసము వలయును. నాకు వాటిపై నాసక్తి లేదు. ఒక్కొక్కపర్యాయ మతని రాజ్యలోభము, అధికార వాంఛ జూచి, దిగు లేర్పడును? చెడుదారిబట్టిన అతనిని కాపాడుట కష్టము. కాని అతనిని మీ స్వాధీనము జేసి నేను ధైర్యముగా నుండవచ్చును. అత డింకనూ పసివాడు. అనుభవము లేనివాడు. యౌవనవాంఛల కతని మానసము ప్రేరేపించవచ్చును, కర్తవ్యమును మరపింపవచ్చును. వాటినుండి మీ రతనిని కాపాడవలయును. తప్పిద మొనరించినపుడు చక్కదిద్ది బుద్ధి చెప్పవలయును. ఈ బాధ్యతను నేను మీ కప్పగించి దూరముగా వెళ్ళిపోవు చున్నానని దలచకుడు. అతడు సార్వభౌముడైన పిమ్మట మీ ఉభయుల సంబంధమూ ఎక్కుడుగానుండును గనుక, మీ రతనిని చక్కదిద్దున ట్లెవరునూ దిద్దలేరు. అందువలననే యీ మాట చెప్పితిని. ఈ ఘడియ నుండి పెద్దరాయలు నా సహోదరుడు కాడు, మీ కుమారుడు. అతనిని కనిపెట్టియుండు భారము మీది" అని చెప్పుచుండగనే కంఠము రుద్ధమై, కను లశ్రువులను వర్షించినవి.

సింహాసనమును గురించిన సమస్య యిప్పుడు పరిష్కృతమైనది. పెద్దరాయలు నాలుగవ విరూపాక్షుడను యభిదానముతో విజయనగర సింహాసన మధిష్ఠించినాడు.

సింహాసన మెక్కునపుడు రాజశేఖరుడు తమ్ముని ఏకాంతమునకు

బిలిపించి, ఆనంద బాష్పములను రాల్చుచూ, అతనితో తన హృదయాంతర్గతమైన భావనలను చెప్పినాడు :

"పెద్దరాయా! నీవు విజయనగర సామ్రాట్టునైనానని ఆనందించకుము. సింహాసనము నీ వనుకొన్నంతటి హాయినిచ్చు హంసతూలికా తల్పము కాదు. అది కంటకప్రాయమైనది. ఈ ఘడియనుండి నీ బాధ్యత హెచ్చగుచున్నది. నీ వీ సామ్రాజ్యమునకు చక్రవర్తివను విషయమును మరువకుము. ఆ ఘనత—గౌరవములకు తగిన రీతిని నీ పలుకు—ప్రవర్తన వుండనిమ్ము.

"సామ్రాజ్యము భద్రతరమై యుండవలెనన్న, దాని పాలనము ఉత్తములూ, శీలసంపన్నులూ, దక్షులూనైన అధికారుల చేతిలో నుండవలయుననుమాట జ్ఞప్తియందుంచుకొనుము. సామ్రాట్టులు రాజకీయ చతురులైననే చాలదు. వారు ఆదర్శవాదులూ, ఉదాత్తులూ కావలయును. నీవు సామ్రాజ్యమును నిష్ఠతో సేవించిన, ప్రజాకోటికూడ అదియే నిష్ఠతో నిన్ను గొలువగలదు. నీవు రాజకీయములను మాత్ర మెరింగిన చాలదు, ప్రజాహృదయము నెరుంగవలయును. అధికారుల మెప్పును బొందిన చాలదు. ప్రజాకోటి హృదయపీఠమున నీ సద్గుణములను నిలుపవలయును. అటువంటి వ్యక్తిచే లోకకళ్యాణము జరుగగలదు. నీవు అంతటి ప్రభువు కావలయునని నా కోరిక. నీపై తీర్థరూపులూ, సామ్రాజ్య ప్రజలూ పెట్టుకొనియున్న నమ్మికను వమ్ముజేయక జీవించుము. నీచే నీ వంశకీర్తి దిగంత విశ్రాంత మగుగాక!" అని హృదయము విప్పి చెప్పినాడు.

"అన్నగారూ! నేను సింహాసన మధిష్ఠించి సామ్రాట్టునైన నేమి? మీ సహోదరుడగు పెద్దరాయలనే గదా! మీ ప్రోత్సాహముపైననే నే నీ యధికారమును స్వీకరించితిని. మీరు నా వెనుక నిల్చి నన్నునూ, సామ్రాజ్యమునూ రక్షించవలయును. నేను తప్పిద మొనరించునపుడు దిద్ది బుద్ధి చెప్పవలయును" అని దైన్యముగా ప్రార్థించినాడు.

"సోదరా! ఆ విషయమై నీ వాలోచించకుము. నీ పెద్దల యాదర్శము నూతగా గొని, సార్వభౌమత్వమున్నది ప్రజా కళ్యాణమునకని

ఎరింగినచో, నీచే ఏ యన్యాయమునూ జరుగనేరదు!" అని పెద్దరాయలను సమాధానపరచినాడు రాజశేఖరుడు.

# 17. దుర్మంత్రి

విరూపాక్షరాయలను యభిదానముతో సింహాసన మెక్కిన పెద్ద రాయలు అతనిపై రాజశేఖరుడుంచిన నమ్మికను వమ్ము చేయలేదు. అతని రాజ్యపాలనమునందలి ప్రారంభదినములన్నియునూ రాజశేఖరుని కోరిక మేరకే గడచినవి.

పెద్దరాయలుకూడా రాజశేఖరుని తన పాలిటి దైవమని భావించి నాడు. అన్నగారి నడుగనిదే ఏ తీర్మానమునూ చేబూనువాడుకాడు. ఇటు రాజశేఖరునివంటి ఆదర్శవాది, అటు తిమ్మయామాత్యునివంటి రాజకీయ చతురుని శిక్షణలో అతడు బాగుగా పరిణతుడై, దక్షతగల పరిపాలకుడూ, సమర్థుడగు సామ్రాట్టూ అగుచూ వచ్చినాడు.

అదృష్టవశమున యీ కాలసమున బహమనీరాజ్యమునుండి విజయ నగరమునకే యాపదయునూ సంభవించలేదు. సామూహికముగనుండిన బహమనీ రాజ్యము 'షాహి' రాజ్యములుగా చీలి వారిలో వారికి అంతః కలహములు చెలరేగుటచే, వారెవరునూ విజయనగరముజోలికి రాలేదు.

అదేవిధముగ ఉత్కళగజపతినుండియునూ ఏ యాపదా రాలేదు. రాజశేఖర, తిమ్మయామాత్యులంతటి వ్యక్తుల చేతిలో సామ్రాజ్యమును సుభద్రముగా నున్నదని గ్రహించి, వారు దాని జోలికి వచ్చుటకు వెను కంజ వేసినారు.

సాంసారిక జీవనమందునూ—పెద్దరాయలు సౌఖ్యమును బొంది నాడు. రాజశేఖరుడే ముందు నిలచి అతనికి తగిన కన్యను జూచి వివా హము జేసినాడు.

తిమ్మయామాత్యునికి సర్వలక్షణ సంపన్నయైన కుమార్తె గలదు. అత డామెను సంతోషముతో పెద్దరాయల కొసంగి పెండ్లి గావించి

నాడు. వయసు మీరిపోపుటచే అతడు పదవీ విరమణను కోరినసూ అందులకు రాజశేఖరుడుగాని, పెద్దరాయలుగాని అనుమతించలేదు.

కాని తిమ్మయామాత్యులకు వయసు మీరినది. అతని ఇష్టదైవమగు యదుగిరి శ్రీ చలువనారాయణస్వామి మాటిమాటికి కలలో ప్రత్యక్షమై, అతనిని స్వగ్రామమునకు తిరిగిరమ్మని చెప్పసాగినాడు. ఈ పిలుపును మన్నించి, రాజ్యపాలనాభారమునంతటినీ రాజశేఖరుని కప్పగించి, తాను నెలమంగళమునకు వెనుదిరుగుట నిశ్చయించినాడు తిమ్మయామాత్యుడు.

అతని నిర్ణయమును విని రాజశేఖర, పెద్దరాయలు చకితులైనసూ అతనిని రాజధానిలో నిలుపుకొనుటకు వారు చేసిన ప్రయత్నము లన్నియునూ విఫలములై, చివరకు అతని ప్రయాణమునకు సమ్మతించక తప్పినదికాదు.

అమాత్యులకు వీడ్కోలిచ్చునపుడు వారి హృదయములలో చేయివైచి కలచినట్లయినది. రాజశేఖరుడు అమాత్యుల వియోగము నతికష్టముపై సహించి :

"అమాత్యులూ! మొదటినుండియూ మీరు మా కుటుంబములో గలసిపోయినారు. మీ జీవనము మా జీవనముతో గలసిపోయినది. మా కష్టసుఖములలో మీరు మాతో కలసియుంటిరి. మిమ్ములను దూరము చేసుకొనుట కష్టము. కాని మీ యారాధ్య దైవముయొక్క పిలుపునుత్రోసిపుచ్చుటకు వీలులేదు. మీరు వెళ్ళిరండు. భగవంతుడు మీకు మంగళమునూ, దీర్ఘాయువునూ చేకూర్చుగాక!" అని ప్రార్థించినాడు.

"ప్రభూ! తిమ్మయామాత్యు డెచ్చటనున్ననూ అతడు సామ్రాట్టులయొక్కయూ, సామ్రాజ్యము యొక్కయూ క్షేమమును కోరగలడు. ఆవశ్యకమైనపుడు సర్వదా నా సేవకు నేను సిద్ధుడను. కాని సామ్రాజ్యము మీ పర్యవేక్షణక్రింద సుభద్రముగా నున్నదను నమ్మికయునూ, ధైర్యమునూ వహించి నేను స్వగ్రామమునకు తిరిగి వెళ్లుచున్నాను" అని అతి కష్టముపై వారివద్ద సెలవు బుచ్చుకొని వెళ్ళినాడు.

తిమ్మయామాత్యుడు అధికార నివృత్తుడైన పిమ్మట విరూపాక్ష

రాయలు, అతని స్థానమున సింగనవండనాయకుని కుమారుడగు వెంకట నాయకుని నియమించినాడు. అతడు తన తండ్రివలె విద్రోహి గాక పెద్దరాయల క్షమను లభింపజేసుకొని, అతని ఆంతరంగిక మిత్రు లలో నొకడైనాడు. పెద్దరాయ లతనిని అమాత్యపదవి కెక్కించినపుడు రాజశేఖరునకు సమ్మతము కాకపోయిననూ తమ్ముని నిర్బంధమునకు కట్టువడి తన యంగీకారమును తెలియజేసినాడు.

అయిననూ అత డప్పుడప్పుడూ పెద్దరాయలను వెంకటనాయకుని విషయములో జాగ్రత్తగ నుండవలసినదని హెచ్చరించుచుండెడివాడు.

"తమ్ముడూ! నీవు వెంకట నాయకునిపట్ల కొంత జాగరూకుడై యుండుట మంచిది. అతనిని మిత్రునిగా దలచిన నాయభ్యంతరములేదు. కాని అతని సలహాలను పాటించునపుడు మాత్ర మతి జాగ్రత్తగ నుండుము. దీర్ఘముగ నాలోచించనిదే అతని సలహాలను కార్యరూపము లోనికి తీసికొనిరాకుము. శరీరమంతయునూ కనులుజేసుకొని నీమిత్రుల నెన్నుకొనుము. ఎవరిపై నీకు విశ్వాసముగలదో అటువంటి వారికి మాత్రమే మహత్తర కార్యముల నప్పగించుము. గొప్ప విషయములను తీర్మానించుటకు మునుపు ఎక్కుడుమందిచెప్పిన సలహాను పాటించుము" అని నీతిబోధ జేసెడివాడు.

ఈ మాటల నొక పర్యాయము పెద్దరాయలు వెంకటనాయకునకు చెప్పగా అతడు వ్యంగ్యముగా నవ్వినాడు.

"ప్రభూ! నేను సింగన మంత్రి కుమారుడ నగుట నా యపరాధమా? వారు స్వార్థపరుల మాట లాలించి ద్రోహము తలపెట్టి తమకూ, తమ వంశమునకూ కళంకమాపాదించినారు. కాని నేను వారివలె ద్రోహము చేయగలనని రాజశేఖరరాయలు భావించియుండుటను విని చాల విచార పడుచున్నాను." అని తన విచారమును వ్యక్తపరచినాడు.

"వేంకటనాయకా! రాజశేఖరుల మాటను నీవు అంతగా మనసున పట్టించుకొనకుము. వారు ఆదర్శవాదులు. ఈ లోకమునకు సంబంధించిన వ్యక్తులుకారు. వారి భావనప్రకారము జూచినచో, మన మెవరిని నమ్ముట కునూ వీలులేదు. అట్లగుచో నిక యీ రాజ్యపాలనాభారమును నిర్వ

హించుటెట్లు? ఎవరినీ నమ్మక, విశ్వాసముంచక జీవించుట సాధ్యమా? సన్యాసులవలె బ్రతుకుచున్న వారికీ వ్యవహార మెట్లు తెలియును?" అని వికటముగా నవ్వినాడు.

నిజమునకు రాజశేఖరుడు రాజపుత్రుడై జన్మించి, పుట్టుకతో సన్యాసివలె జీవించుచున్నాడు.

అతడు అంతఃపుర సమీపమునందలి రాజోద్యానవనములో తన 'శాంతికుటీరము'ను నిర్మించుకొని, పరివ్రాజకునివలె జీవించుచున్నాడు. అతని శాంతికుటీరము నానుకొని పరమపావనియైన తుంగభద్రామాత ప్రవహించుచున్నది. అది పంపాపతి దేవాలయమునకుగూడ సమీపముగ నున్నది. నగరమందలి కోలాహలమునకు దూరముగనున్న శాంతి కుటీరములో రాజశేఖరునికి కావలసిన ప్రశాంత వాతావరణము గలదు.

అచ్చట అతడు సర్వవేళలా ధార్మిక గ్రంథపఠనములోనూ, సజ్జనుల యొక్కయు, విద్వాంసుల యొక్కయూ సహవాసములోనూ సమయము బుచ్చెడివాడు. తనను చూడవచ్చెడు వారి కష్టకార్పణ్యములను విచారించి వారికి తనచేతనైన సాయము చేసెడివాడు. అవకాశమేర్పడి నపుడు పెద్దరాయలతో గలసి రాజ్యపాలనమునకు సంబంధించిన చర్చ సాగించెడివాడు. విశేష సందర్భములలోగాని అతడెచ్చటికినీ వెళ్ళెడి వాడుకాడు. అతడు ప్రాపంచిక విషయములలో దిగుబడికొనియూ సన్యాసి వలె జీవించుచూ తన జీవితమును పరహితకార్యములకై వినియోగించి నాడు.

తిమ్మరయామాత్యుడు పదవీ విరమణచేసి వెళ్ళిన తరువాత పెద్దరాయలు వెంకటనాయకుని ప్రభావమునకు ఎక్కువగా వశుడైనాడు. అతడు సాధ్యమైనంతవరకూ సార్వభౌముని రాజశేఖరునకు దూరముగ నుంచుటకై ప్రయత్నించసాగినాడు. సమయము చిక్కినపుడంతయూ పెద్దరాయల మనసును రాజశేఖరుని విషయములో విరువ బ్రయత్నించి నాడు.

ఏదియో ప్రసంగవశమున యీ మాట వచ్చి, వెంకటనాయకుడు ఒక దినము అనినాడు :

"ప్రభూ! తమరు నన్ను గడచిన అయిదారు వత్సరములనుండి ఎరుగుదురు. నా నిష్ఠ ఎటువంటిదని తమకు తెలియును. కాని యిప్పటికినీ నాపై మీ యన్నగారికి సందేహము తొలగలేదనిన అది నా దురదృష్టము!"

"నీవు యీ విషయమై విసుగుజెందకుము వెంకట నాయకా! అన్నగారి స్వభావమే అటువంటిది. వారు ఎవరినీ వెంటనే నమ్మరు. బాగుగా పరీక్షించనిదే అంతరంగవర్గములోనికి చేర్చుకొనరు" అని సమాధాన పరచినాడు పెద్దరాయలు.

"ప్రభూ! నా కొరకై నేను వ్యధజెందుచుండుటలేదు. నామూలమున మీరుకూడ రాజశేఖరాయల అనుమానమునకు పాత్రులగుచున్నారుకదాయని నా చింత."

"నీ నిష్ఠపట్ల నాకు నమ్మికగలదు. నీకు వ్యతిరేకముగ ఎవరెన్ని చెప్పిననూ నేను నమ్మువాడనుగాను వెంకటనాయకా! అందువలననే అన్నగారు సమ్మతించకపోయిననూ నిన్ను అమాత్యపదవి కెక్కించినాను. నీ తండ్రి ద్రోహియైనంతమాత్రమున నీవునూ ద్రోహివికావలయునని ఎచ్చటనున్నది? ఇదంతయునూ అన్నగారి పూర్వాగ్రహము! నీవు అందులకై చింతించకుము" అని పెద్దరాయ లన్నాడు.

"మీకు నాపైగల నమ్మికయందు శతాంశము మీ యన్నగారికున్ననూ నేను వ్యథజెందువాడనుకాను. రేపు మీరు వారినలహా నతిక్రమించి నడచినచో, వారు తప్పక నాపై యాగ్రహపడగలరు, వారి సందేహమునకు గురియైన పిమ్మట, నేనీ యధికారమున నుండుట మంచిది కాదు. ఈమాటనే నే నొకనాడు వారికి చెప్పి అధికారమునుండి నివృత్తి బొంచవలయుననుకొనుచున్నాను."

ఈ మాటలు విని పెద్దరాయలు చకితుడైనాడు.

"ఈ యల్ప విషయమును నీవింతగా మనసున నిడుకొనుటయా?" అని ఆశ్చర్యముతో ప్రశ్నించినాడు.

"ప్రభూ! వారు నా ప్రతి పలుకునందునూ, ప్రవర్తనయందునూ సందేహమును వ్యక్తపరచుచున్నారు. వారికి వ్యతిరేకముగ మీరు నన్నీ

యమాత్యపదవికెక్కించుటయే దీనికంతటికినీ కారణము. నా విషయములో ద్రోహులెవరో వారి మనసును విరచి యుండవచ్చునని దోచుచున్నది. గనుకనే వారు నాపట్ల ఆవిధముగ విముఖులై యున్నారు. బహుశః నాకు వారి హృదయాంతరాళపు కోర్కె తెలిసినదని వారు నాపై ద్వేషము వహించియున్నారని దెలియుచున్నది."

ఈ మాటలకు పెద్దరాయ లాశ్చర్యపడుచూ అన్నాడు:

"వెంకటనాయక, వారి హృదయంగలమైన కోర్కె ఏమిటో నీకు తెలియునా ?"

"మీ రన్యథా భావించనిచో విన్నవించగలను...."

"ఏమది? నిర్భయముగా జెప్పుము."

"ప్రభూ! దీనిని మీరు ఎవరికినీ తెలుపకుడు. ప్రజలు రాజశేఖర రాయలనుగురించి పలువిధములుగ అనుకొనుచున్నారు!"

"ఏమనుకొనుచున్నారు?"

"ఇపుడు వారికి సింహాసనముపై నాశ గలిగినది. దానిని తమ వశము జేసికొనుటకై నన్ను ద్వేషించుచున్నారట!"

"నిన్నెందులకు ద్వేషించవలయును?"

"నేను ప్రాణములతో నున్నంతవరకూ మీ సిగపూవు వాడకుండా చూచుకొనగలనని వారికినీ తెలియును. వారి విద్రోహాచరణ నే నున్నచో కార్యగతము కానేరదను విషయముకూడ వారికి బాగుగా దెలియును."

"ఇది అబద్ధము. అన్నగారికి సింహాసనముమీద ఆశయా? శుద్ధ అబద్ధము! అంతటి రాజ్యలోభముండినచో తమదిగా నుండిన యీ సింహాసనమును వారు నా కెందుల కప్పగించెడివారు? దాని నధివసించుటకు వారికే అడ్డంకియునూ లేదు. అటువంటి సమయముననే వారు దానిని నాకు దత్తముచేసి సన్యాసమును స్వీకరించినారు. అటువంటివా రిపుడు మరల దాని నభిలషించుచున్నారా? ఎవరెన్ని చెప్పిననూ యీ మాటను మాత్రము నేను నమ్మలేను."

"ఔను, ప్రభూ! ఈ మాట నమ్ముట కష్టమనియే నే నిదివరకూ యీ విషయమై మీతో ఏమియునూ ప్రస్తావించలేదు."

"అయినచో, సింహాసనముపై అన్నగారికి కన్నుగలదని చెప్పుచున్నావా?"

"ఔను, ప్రభూ! కావలయుననినచో నే నీ విషయమును నిరూపించగలను!"

"ఎట్లు నిరూపించగలవు?"

"కోశాధ్యక్షుల నడుగుడు."

"ఎవరిని, రాయన భాండాగారాధిపతినా?"

"ఔను. అతడు రాజశేఖరరాయల మాటలాలించి, భాండాగారమును ఖాళీచేయుచున్నాడు."

"అన్నగారు సర్వసంగపరిత్యాగులు — సన్యాసులు. వారికి ధనలోభమా? ధనావశ్యకత వారికేమిగలదు?"

"నేనునూ యట్లే అనుకొని మోసపోయితిని. కొద్దిదినములక్రిందట మీ యన్నగారి గోముఖవ్యాఘ్రత్వము బయటపడినది. వారికి తాము సింహాసనముపై కూర్చొనకపోయిననూ, సార్వభౌమునివలె పేరుగాంచవలయునను యాశ యున్నదని తెలిసినది."

"ఆ విషయమేదియో స్పష్టముగా వివరింపుము?" పెద్దరాయలు కుతూహలముగా అడిగినాడు.

"ప్రభూ! నా మాటను తమరన్యథా భావించకుడు. సామ్రాజ్యక్షేమదృష్ట్యా యీ మాటలు చెప్పుచున్నాను. సామ్రాజ్య భద్రత ఎపుడునూ దాని యార్థిక భద్రతమీదనే ఆధారపడియుండును. దీనికాధారము రాజబొక్కసము. రాజశేఖరరాయలీ బొక్కసమందలి ధనమును నీటివలె వెచ్చము చేయుచున్నారు. తమపై ప్రజా వాత్సల్యమును పెంపొందింపజేసికొనుటకై అడిగిన వారికందరకూ ధనమును పంచిపెట్టుచున్నారు. కావలయునన్న నా మాటను తా మిపుడే పరీక్షించవచ్చును. ఆ కోశాధ్యక్షుడునూ వారికి తగిన శిష్యుడే! లెఖ్ఖపత్రములను సరిగా నుంచలేదు. అతడు రాజశేఖరులతో గలసి, ఎపుడో ఒకనాడు మిమ్ములను దివాలా తీయించగలడు. సన్యాసియైన వానికింతటి ధనావశ్యకత ఏమిగలదు? ఇదంతయునూ ఏదియో స్వార్థమును సాధించుకొరకు కాదా?"

"అయినచో మనమీ రహస్యమును భేదించియే తీరవలయును!"

"ఆ పరీక్ష నేడే జరుగనిండు, ప్రభూ!"

"అట్లయిన, ఆ కోశాధ్యక్షుని సముఖమునకు రప్పింపుము."

"అక్కరలేదు ప్రభూ! మనమే అతని వద్దకువెళ్ళి, అతని లెఖ్ఖలను పరీక్షించుదము అతనిగుట్టు రట్టుకాగలదు."

ఈ సలహాకు పెద్దరాయలు సమ్మతించి, వెంకటరాయలతో రాజ బొక్కసమువద్దకు వచ్చినాడు.

అచ్చటి కోశాధికారి సార్వభౌమునీ, అమాత్యునీ అత్యంత గౌరవ ముతో ఆహ్వానించి, కూర్చొనుటకు ఆసనములనుజూపి, తాను చేతులు కట్టుకొని నిలచి, సార్వభౌముని ముఖమవలోకించినాడు.

వారు కారణము లేనిదే అట్లు హఠాత్తుగా వచ్చువారుకారని అతనికి తెలియును. అమాత్యుడుకూడా వెంట వచ్చియుండుటచే తనకేదియో గండము రానున్నదని భావించినాడు.

"కోశాధికారులూ! మీ లెక్కల వివరములనిటు తెండు" అని వెంకటనాయకు డాజ్ఞాపించినాడు.

కోశాధికారి లెఖ్ఖ పత్రములుగల కట్టలనుదెచ్చి పెద్దరాయలముందు బెట్టినాడు.

"ఇందులో రాజశేఖరరాయలకు యివ్వబడిన ఖర్చు ఏ మాత్రము?" అమాత్యు డడిగినాడు.

కోశాధ్యక్షుడా వివరములుగల చిట్టాను చేతబట్టుకొని, వణకుచూ నిలబడినాడు.

"ఎందులకు, విగ్రహమువలె నిలబడియున్నారు? అన్నగారి ఖర్చు క్రింద ఎంతధనము వ్యయమైనదో చెప్పుడు?" పెద్దరాయ లడిగినాడు.

"మూడువేల నాలుగువందలా ఏభై వరహాలు యిదివరకూ ఖర్చు అయినవి ప్రభూ!"

"ఈ ధనమంతయూ వారెందులకై తీసుకొనుచున్నారు?"

"దాన ధర్మముల కొరకై ప్రభూ!"

"ఈ మొత్తమును ఎవరిపేర ఖర్చు వ్రాసినారు?"

"రాజశేఖర ప్రభువుల స్వంత వెచ్చముల క్రింద వ్రాయబడినది ప్రభూ!"

"అట్లు చేయుటకు ఎవరాజ్ఞాపించినారు?"

"సింహాసనమును తమకు దత్తము చేసినపుడు తిమ్మయామాత్యులు వారికి వర్షాశనమును ఏర్పాటుజేసి, వారి ఖర్చు-వెచ్చములను రాజబొక్కసమునుండి చెల్లించుటకు కట్టుదిట్టము చేసినారు ప్రభూ!"

"దాని నిదివరకూ పాలించుకొనుచూ వచ్చినారా?"

"ఔను, ప్రభూ!"

"అయినచో,రాజశేఖరరాయలెంత ధనమును కోరిన అంత మొత్తమును వెనుకముందు జూడక రాజబొక్కసమునుండి తీసి యిచ్చుచున్నారా?" అమాత్య వెంకటనాయకు డడిగినాడు.

ఈ మాటలకు మారుపలుకక కోశాధికారి మౌనముగా నిలువబడినాడు.

"ఏమి, మౌనము దాల్చితిరి? మీరు అన్నగారి మాటలాలించి రాజబొక్కసమును ఖాళీ చేయదలచినారా?"

"ప్రభూ! రాజశేఖర ప్రభువులు........" అటుపై మాటలు రాక పోయినవి. అతడట్లే విగ్రహమువలె నిలబడిపోయినాడు.

ఈ మాటలువిని పెద్దరాయలకు కోపము వచ్చినది. అతడు అసహనముతో బిగ్గరగా గర్జించినాడు :

"సామ్రాజ్యమున కెందరు ప్రభువులున్నారు?"

"తా....తామొ.... తామొక్కరే ప్రభూ!" కోశాధికారి గ్రుక్కిళ్ళు మ్రింగుచూ అన్నాడు.

"మరొకసారి రాజశేఖరుని ప్రభువు, దొర, సామ్రాట్టు అని ఉచ్చరించిన మీ నాలుక తెగి పడగలదు, జాగ్రత్త! శరీరముపై ప్రజ్ఞ గలిగి మాటలాడుము."

"అట్లే ప్రభూ!"

"ఇప్పుడు చెప్పుడు, రాజశేఖరు డాజ్ఞాపించిన మీ బొక్కసమందలి ధనమును ఎవరికెంత కావలసిననూ యిచ్చెదరా?"

"లేదు ప్రభూ! రాజశేఖర ప్రభువుల లెఖ్ఖ...."

"మరల రాజశేఖర ప్రభువులు! ఎవరు ప్రభువైనదీ తెలిసి ప్రవర్తించుము, జాగ్రత్త! ఈ సామ్రాజ్యమునకు ఒక్కరే సామ్రాట్టులు. వారు విరూపాక్షరాయలు తెలిసినదా?"

"తె.... తె.... తెలిసినది, ప్రభూ!"

"ఇప్పుడు వివరింపుడు, మీరూ రాజశేఖరులూ కలసి ఏమి కుట్ర పన్నుచున్నారు?"

"ఏ కుట్రయునూ లేదు ప్రభూ!"

"నాకు మీ పన్నుగడ అంతయునూ దెలిసిపోయినది. ఇకపై నా యాజ్ఞ లేనిదే మీరు ఎవరికీ రాజబొక్కసమునుండి ఒక్క గద్యాణము సైతమివ్వరాదు, తెలియునా?"

"తెలిసినది ప్రభూ! కాని.... తిమ్మయామాత్యుల ఏర్పాటు?...."

"అదంతయునూ వారితోడనే పోయినది. ఇపుడు మంత్రిగారు తిమ్మన దండనాయకులు కారు. వెంకటనాయకులు."

"అట్లే కానిండు ప్రభూ!"

"మరొక పర్యాయము నా యనుమతి లేనిదే రాజభాండాగార మందలి ధనమును యీ విధముగా దుర్వ్యయము జేసినచో మీ రుద్యోగమును పోగొట్టుకొను టటుండనిచ్చి, ప్రాణములకుకూడ ముప్పు రాగలదు, జాగ్రత్త?" అని చెప్పి పెద్దరాయలు, వెంకటనాయకుడు లేచి వెళ్ళినారు. కోశాధికారిమాత్ర మచటనే భూతమును గన్నవానివలె భీతిల్లి నిలబడినాడు.

వేమన పంచాయత్ శ్రీ (గ్రంథాలయం, :: కృష్ణా జిల్లా.

# 18. ఏ కో ద ర సోదరులు

కోశాధికారి విచారణా ఘట్ట మంతటితో ముగియలేదు. సామ్రాజ్యమందలి ఒక సామాన్యోద్యోగి తన యెదుటనే రాజశేఖరుని ప్రభువని సంబోధించి తన నవమానపరచినందులకు పెద్దరాయలకు చాల కోపము కలిగినది, అంతియగాక తాను సామ్రాట్టునై యుండియునూ అధికార

మంతయునూ రాజశేఖరుని దనునట్లుగా తన యధికారి ప్రవర్తించినాడు. దీనిచే పెద్దరాయలకు మునుపెన్నడునూలేని సందేహము, అసమ్మతి రాజశేఖరునిపై ఏర్పడినవి. దీనిని వెంకటనాయకునితో చెప్పగా, అత డీ వైమనస్యపు టగ్నికి మరింత ఆజ్యమును బోసినాడు.

"ప్రభూ! ఇప్పుడైననూ తెలిసినదా? మీ రాజశేఖరరాయల గోముఖవ్యాఘ్రత్వము. మీరు మీ యన్నగారిని భువిపై నవతరించిన దేవతయని భావించినారు. మీ ఆరాధ్యదైవముయొక్క నిజస్వరూప మిప్పుడు తెలిసినదా?" అని కటువుగా అనినాడు.

"వెంకటనాయకా! నా కింకనూ రాజశేఖరుని ప్రవర్తన అర్థమగుట లేదు. సింహాసనముపై ఆశయుండినచో అత డెందులకు తనకు చెందిన సింహాసనమును నా కర్పించినాడు? అతనికి పదవీవ్యామోహ మున్నచో సార్వభౌమ పదవి నెందులకు వదలుకొనును?"

"అదియే, వింత ప్రభూ! అపుడు వారికి సింహాసన మక్కరలేక పోయినది. రాజ్యకోశములులేని సార్వభౌముని తనయుడై జన్మించిన వారికి సింహాసనముగాని, దాని వైభవముగాని అపు డతనికి ప్రలోభమును గలిగించలేకపోయినవి. ఏదియో ఆదర్శపు పిచ్చిలో దానిని తిరస్కరించి నారు మీకు దత్తము జేసినారు. కాని మీరు సామ్రాట్టులైన పిమ్మట మీకు లభించిన ప్రజాభిమానము, కీర్తిని గని వారి కసూయ గలిగినది. సార్వభౌమత్వముయొక్క విలాసవైభవము లతనిలో ప్రలోభమును బుట్టించినవి. ఇపుడు మించిన పనికై వగచుచూ కూర్చొన్న మిమ్ములను కీలుబొమ్మలనుగా జేసికొని, తామే నిజమైన సామ్రాట్టులవలె మెలగు చున్నారు."

"దీనివలన వారికి కలుగు లాభమేమి?"

"ఎంతటి ప్రశ్న ప్రభూ! చెడుపేరు వచ్చినయెడల దానిని మీకు అంటగట్టెదరు. మంచి పేరు వచ్చినచో తాము పంచుకొనెదరు."

"అయినచో విజయనగరమునకు నిజమైన సామ్రాట్టు లెవరు? నేనా? రాజశేఖరులా?"

"ఈ ప్రశ్నకు కోశాధికారి జవాబు చెప్పినాడు. అతనివంటి

వెయ్యారుమంది ప్రభుభక్తి పరాయణులు జవాబు చెప్పగలరు. మీ రేనా డైననూ రాజ్యపాలనమునకు సంబంధించిన గొప్ప నిర్ణయ మేదేనొకటి చేసినారా? ఏదైననూ పెద్ద యుద్యోగములకు మీ యిష్టమువచ్చినవారిని స్వతంత్రముగ నియమించినారా? వారి సలహా గైకొననిదే ఏ రాజశాసన మైననూ వెలువరించినారా?"

"లేదు.. అన్ని విషయములలోను అన్నగారిని హితైషియని భావించి, వారి సలహా మేరకు నడచుకొన్నాను."

"దాని పరిణామ మేమైనదో గమనించినారా? కోశాధికారి రాయన వంటివాడు మీ యెదుట రాజశేఖరులను ప్రభువని ఉచ్చరించుట మరచి నారా? సామ్రాజ్యమందలి పెద్ద-చిన్న అధికారు లందరిపాలిటికి నిజమైన సామ్రాట్టు రాజశేఖరులు—మీరు వారి చేతి కీలుబొమ్మలు! పేరునకు మాత్రము సింహాసనములో కూర్చొనియున్న సామ్రాట్టులు. పాలన మంతయునూ మీది. అధికారమంతయూ రాజశేఖరరాయలది."

"లేదు—ఇకపై నేను రాజ్యపాలనములో అన్నగారి సలహాను స్వీకరించుటలేదు. స్వతంత్ర సామ్రాట్టువలె స్వయముగా అన్నియూ నేనే చూచుకొనెదను. నిజమైనసార్వభౌము లెవరైనదీ తెలియజేసెదను."

"అందులకు రాజశేఖరరాయలు అవకాశ మీయగలరని యను కొనుచున్నారా? మీరు వారి యాజ్ఞ నుల్లంఘించి క్షణకాలము బ్రతుక గలరా? వారి కృపచే మీరు ప్రభువులైనారు. వారి పేరుతో పాలనము కూడ జరుగవలయునని వారి యిచ్ఛ! రేపు వారి మాట నతిక్రమించినచో యీ సింహాసనమును మీరు పోగొట్టుకొనుట ఖండితము. ఎందువల్లననగా సామ్రాజ్యమందలి ఉన్నతోద్యోగులందరూ రాజశేఖరరాయల పక్ష పాతులు. సైన్యాధిపతులందరూ వారి యభిమానులు. వారిపై కత్తిగట్టి మీరు క్షణకాలము అధికారములో నిలువలేరు. ఎందులకు వ్యర్థమైన పోరాటమునకు ప్రయత్నింతురు, ప్రభూ?"

"విజయనగరమునకు నిజమైన సార్వభౌము లెవరను విషయము తీర్మానము జరిగి తీరవలయును! ప్రభువు నేనైననూ లేక రాజశేఖరు లైననూ కావలయును. మే ముభయులమూ సింహాసనమున కధిపతులగు

టకు వలనుగాదు! సామ్రాజ్యలక్ష్మి యిద్దరికి ఊడిగము చేయుటకు సాధ్యముగాదు."

"ప్రభూ! వృధగా మాటలాడి యెందులకు శోషిల్లెదరు? మీలో అంతటి శక్తిసామర్థ్యములున్నచో మా కెందుల కీ దురవస్థ ప్రాప్తించెడిది? నేను మాత్ర మెందులకు పేరునకు మంత్రిగా నుందును? మీరు మాత్ర మెందులకు పేరునకు సార్వభౌములుగా నుందురు? ఇటువంటి వ్యర్థసాహస మొనరించకుడు, ప్రభూ!" అని వెంకటనాయకుడు పెద్ద రాయలను చులకనగా మాటలాడినాడు. పెద్దరాయ లీ అలసత్వమును సహించలేక కోపముతో మండిపడినాడు.

"కానిమ్ము, నీవు ఈ కనులతోనే చూచుచుండుము. నే నీ రాజశేఖరుని దుష్టప్రభావమునుండి బయటపడి, అతని యధికారమును మూలకు ద్రోసి, నిజమైన సామ్రాట్టునుగా ప్రకాశించనిచో నా పేరు విరూపాక్షరాయలు కాదు" అని ప్రతిజ్ఞచేసి అచటినుండి లేచినాడు.

అతని పలుకులు విని వెంకటనాయకుని ముఖములో సంతోషము ప్రకటితమైనది. అతడు తన రొట్టె విరిగి నేతిలో పడినదని ముదము జెందుచూ అచటినుండి వెళ్ళినాడు.

చివరకు వెంకటనాయకుని కోరికయే ఫలించినది. అతడు పెద్దరాయల ఆంతరంగికుడగుటకు కారణము గలదు. తన తండ్రి వినాశమునకు కారకుడైన రాజశేఖరుని నాశనమొనరించనిచో తాను సింగనదండనాయకుని తనయుడను గానని ప్రతిన బూనినాడు. స్వామిభక్తి పరాయణునివలె నటించి, పెద్దరాయల అనుగ్రహమునకు పాత్రుడై, కొంత కొంతగా పైకెక్కి, ఇప్పు డతని ఆప్తమిత్రుడూ, ఆంతరంగిక (నర్మ) సచివుడూ, సామ్రాజ్యామాత్యుడూ, దండనాయకుడూ అయినాడు.

అతని పలుకులను-ప్రవర్తనలను ఆదినుండియూ సందేహించుచూ వచ్చిన రాజశేఖరు డతనిని దూరముగా నుంచవలయునని చెప్పినను పెద్దరాయ లతని దుష్టప్రభావమునకు వశుడై, అతనిని తన మంత్రిగా జేసుకొన్నాడు. అయిననూ రాజశేఖరుడు వెంకట నాయకుని విషయమున జాగ్రత్తగా నుండవలసినదని పెద్దరాయలను హెచ్చరించుచునే వచ్చినాడు. ఇదియే అతని పతనమునకు నాందియైనది.

పెద్దరాయలు దుర్బలుడూ, భీరువూ అయినట్లే విషయాసక్తుడూ, భోగాకాంక్షియూ కూడాను. అతని నెట్లు వశపరచుకొనవలయునో గ్రహించిన వెంకటనాయకుడు సులభముగా అతనిని తన చేతి కీలుబొమ్మనుగా జేసికొన్నాడు. తొలుదొల్త దుశ్చర్యలకు భీతిల్లుచుండిన అతను మెల్ల మెల్లగా విషయాసక్తుడు, లోలుపజీవిగా మార్పుజెందినాడు. అతనిని మద్యపానముచేతనూ, సుందరీమణులగు కాంతాజనములచేతనూ వశపరచుకొని తన యిష్టమువచ్చినటులు ఆడించసాగినాడు.

కాని అతనికి తన ఆశయము నెరవేర్చుకొనుటకు రాజశేఖరుడు ఘటసర్పమువలె అడ్డుతగిలినాడు. ఎట్లయిననూ అతని ప్రతిబంధకమును తొలగించుకొనినచో, సామ్రాజ్యము తనది కాగలదని భావించినాడు. ఆపై ఎప్పుడో ఒకరోజు విరూపాక్షరాయలవలె పెద్దరాయలను సింహాసన చ్యుతునిగా జేసి, తా నధిష్ఠించవచ్చునని అతని హృదయాంతరాళపు కోర్కె. కాని రాజశేఖరుడు బ్రతికియున్నంతవరకు వెంకటనాయకుని ఏ విద్రోహమునూ నెరవేరునట్లు లేదు. అందువలననే అతని నెట్లయిననూ తొలగించుకొనవలచి వెంకటనాయకు డీ మార్గ మవలంభించినాడు. అన్నదమ్ముల నడుమ వైరత్వబీజమును నాటినాడు.

అది అతడు నిరీక్షించిన దానికంటెనూ శీఘ్రముగా పెరిగి, మహావృక్షమైనది. ఈ విషయము సూక్ష్మబుద్ధిగల రాజశేఖరునకు తెలియక పోలేదు.

ఈ నడుమ కొంతకాలమునుండీ పెద్దరాయలు తనకు దూరమారముగా తిరుగుచున్నాడని అతనికి తోచసాగినది. దీనికి కారకుడు వెంకటరాయలనియూ తెలిసినది. కాని అతని దుష్టప్రభావమునుండి పెద్దరాయలను తప్పించగల స్థితి రాజశేఖరునకు లేకపోయినది. పూర్వపు తన యధికారము నిప్పు డతడు పోగొట్టుకొనినాడు. వెంకటనాయకుని దుర్బోధకు చెవి యొగ్గి, రాజశేఖరునిపట్ల మనసు విరచుకొన్నాడు. అయిననూ రాజశేఖరుడు హతాశుడు కాలేదు. అవకాశము లభించినపుడు యీ విషయమై తన తమ్మునితో మాటలాడవలయునని అత డనుకొన్నాడు. ఆ సమయముకొరకై వేచి చూడసాగినాడు.

అత డెదురు చూచిన ఆ సుసమయము కోశాధికారి ప్రకరణమున సంభవించినది.

ఆనాడు రాజశేఖరుడు తన శాంతి కుటీరమునకు వచ్చిన బీద సాదల కిచ్చెడి దానధర్మములకొరకై, రాజబొక్కసమునుండి ధనమును గొనిరమ్మని ఉద్యానవన పోషకుడగు తోటమాలి మల్లయ్యను బంపినాడు.

మల్లయ్య మల్లికార్జునరాయల కాలమునుండియూ తోటమాలిగా నున్నాడు. పూలమొక్కలను పెంచడములోనే అతనికి ముదిమి ఏర్పడినది. రాజశేఖరుని రాజోద్యానవనమునందలి శాంతికుటీరములో నిలచిన పిమ్మట తనకు అన్నము బెట్టిన ప్రభువుల సేవ జేయుటకై అతని కవకాశము లభించినది. రాజశేఖరుని పూజను పూలకు తెచ్చియిచ్చుచూ, ఆశ్రమమును పరిశుభ్రముగానుంచి, వచ్చిపోయెడివారికి చేయు దాన ధర్మములలో సాయపడుట అతని దైనందిన కార్యక్రమము. అతడు రాజశేఖరుని యాజ్ఞ మేరకు ధనమును గొనివచ్చుటకై రాజబొక్కసమునకు వెళ్ళినాడు.

కాని పెద్దరాయలచే ఆజ్ఞాపితుడైన భాండాగారాధికారి రాయన జరిగిన విషయములను చెప్పి, ధనము నొసంగుటకు సామ్రాట్ విరూపాక్షరాయల యనుమతి వలయునని వినయపూర్వకముగా విన్నవించినాడు.

తోటమాలి మల్లయ్య వచ్చి యీ మాటలు చెప్పగా విని రాజశేఖరునికి కలిగిన ఆశ్చర్యములకు మేరలేకపోయినది.

ఈ విషయమున జరుగరాని సంఘటన ఏదియో జరిగినదని యూహించి, ఈ భేదాభిప్రాయములను తొలగించుకొనుటకై రాజశేఖరుడే స్వయముగా తమ్ముని సందర్శించుటకై అంతఃపురమునకు వెళ్ళినాడు.

ఎప్పుడు వెళ్ళిననూ తనను అంతఃపురద్వారముకడ కెదురు వచ్చి తోడ్కొని వెళ్ళుచూనుండిన పెద్దరాయ లానా డెందులకో తాను వచ్చిన విషయము నెరింగియునూ వెలుపలికి రాలేదు. అత డేదియో ముఖ్య రాజకీయ విషయములో నిమగ్నుడై యుండవచ్చునని భావించి, రాజశేఖరు డతడున్న చంద్రశాలకు వచ్చినాడు. అచట పెద్దరాయలు విలాసినుల నడుమ మద్యపానమత్తుడై యున్నాడు.

తన ఏకాంతమునకు రాజశేఖరరాయలచే భంగము వాటిల్లినదను భావనతో, విసుగుజెందుచూ పెద్దరాయలు అన్నగారిని లోపలి గదిలోనికి తీసుకొనివెళ్ళి అన్నాడు :

"అన్నగారూ! నన్ను చూడవచ్చెదరని తెలిసియుండినచో, నేనే శాంతికుటీరములో మిమ్ములను సందర్శించి యుండెడివాడను."

"సోదరా! నేను నిన్ను జూచి చాలదినములైనది. అందుల కనియే వచ్చినాను. నీవు మమ్ములను పూర్తిగా మరచిపోయినావు. కాని నిన్ను మేము మరువలేకున్నాము" అని నవ్వినాడు.

"అన్నగారూ! తాము ఊరక అంతఃపురమునకు వచ్చువారుకారు–ఏదియో విశేష ముండవలయును."

"ఔను, తమ్ముడూ! నీవు రాయన కోశాధికారికి నీ యనుమతి లేనిదే బొక్కసమునుండి ధన మివ్వరాదని ఆజ్ఞ చేసితివట, ఔనా?"

"ఔను!"

"ఎందులకో తెలియవచ్చునా?" ఆశ్చర్యపోతూ ప్రశ్నించినాడు రాజశేఖరుడు.

"అన్నగారూ! నన్ను మీ రన్యథా భావించకుడు. కోశాధికారి మన తండ్రికాలమునుండియూ వచ్చిన నిష్ఠావంతులగు ఉద్యోగు లను మాట నిజమే! ఈ నడుమ అతని నిష్ఠపట్ల సంశయవాక్కులను విన్నాను. అతడు మీ మంచితనమును దురుపయోగపరచుకొని, మీ పేరుతో తన కిష్టము వచ్చినంత ధనమును ఖర్చుజూపి, తన సంపదను హెచ్చించుకొను చున్నాడని విన్నాను. దాని నరికట్టుటకై యీ చర్య తీసుకొనవలసి వచ్చినది."

"కోశాధికారిపై నీకు సంశయ మేర్పడినదా?"

"ఔను! ధనము విషముతో సమానమని తెలిసినవారు చెప్పెదరు. అది ఎటువంటివారినైననూ తన వశము జేసుకొనగలదు."

"అయినచో సంతోషము. నాకీ వేతనమును నీవు నిలిపివేసితి వేమోనని యనుకొన్నాను. సరియే, యిపుడు ధనమును గైకొనుటకు నీ యాక్షేపణ ఏమియునూ లేదుకదా?" అని యడిగినాడు.

"లేదు...కాని....అన్నగారూ!...."

"ఏమి తమ్ముడూ!"

"మీ రింత ధనమును దానధర్మముల పేరున వెచ్చించుచున్నారు కదా, దీనివలన వచ్చు లాభమేమి?"

"తమ్ముడూ! మానవుడు చేయు ప్రతి కార్యమునూ ఐహిక లాభ నష్టముల దృష్టితో కొలువ సాధ్యమా? కొన్నిటిని మన మాముష్మికము కొరకై ఆచరించెదము. ఇంతకునూ యిది ఎవరి సంపద? అంతయునూ ఆ భగవంతునిది. మనము అతని యాజ్ఞానువర్తులము. లేనివారికి దాన మొసగుట మన కర్తవ్యము. ఇది నా కత దేర్పరచిన విధి!" అని నవ్వినాడు. కాని పెద్దరాయలు మాత్రము నవ్వలేదు.

"సోదరా! నీ వీ నడుమ ఎందులకో ఒకవిధముగా నున్నావు. నా వలన ఏమైననూ అపరాధము జరిగియుండిన క్షమింపుము."

ఈ మాట లనునపు డతని ధ్వని గాద్గదికమైనది.

"అన్నగారూ! నాకు శాంతి కుటీరమువైపునకు వచ్చుటకు వీలు చిక్కకపోయినది. విధివిరామములేని రాజకీయములు...."

అని విషయము మార్చ ప్రయత్నించినాడు.

"నాపై నీకు విసుగు జనింపలేదుకదా?"

"విసుగా? ఎందులకు విసుగు?"

"నేను రాజ్యపాలనమునందు ప్రతి విషయమునకూ నీకు అడ్డు వచ్చుచున్నానని!"

"ఏమైననూ యీ సింహాసనము మీరు దత్తమొనర్చినదియే కదా? నేను మీ కోరికమేరకు నడచుకొనక, నా యిష్టము వచ్చినట్లు నడచుకొనుటకు స్వతంత్రము గలదా?"

"నీ మాటలు విచిత్రములుగ నున్నవి. నీ కిపు డేమి జరిగినది చెప్పుము? నా విషయములో నీ మనసు నెవరు చెరపినారు?"

"ఎవరునూ చెరుపలేదు. ఉన్న సంగతిని నేనే వివరించితిని."

"నీవు అబద్ధమాడుటలేదు—కాని అది సత్యము కాదు. నా విషయములో నీ కెవరో అనుమానమును బుట్టించినారు. వారి పలుకు లాలించి నీవు మనసును పాడుచేసుకొన్నావు. ఎవరో నీకు దుర్బోధ

జేసి, నీచే యీ మాట లాడించుచున్నారు. లేనిచో నీ నోటివెంట యిటు వంటి మాటలు వచ్చెడివి కావు!"

"నేను చెప్పెడి మాట అబద్ధమా!"

"అబద్ధము. పూర్తిగా అబద్ధము!"

"అయినచో యీ సింహాసనము మీ రనుగ్రహించినది కాదా?"

"కాదు — అది దైవమనుగ్రహించినది!"

"కాదు, అది మీది — మీరు ఔదార్యముతో నా కొసగినారని ప్రజ లనుకొనుచున్నారు."

"అది వారి యూహ. ఈ సింహాసనమునకు నేనెంత హక్కుదారుడనో నీవునూ అంతియే హక్కుదారుడవు. కాని యిప్పుడా విషయ మెందులకు వచ్చినది? నేను నీ రాజ్యపాలనమునం దెక్కుడుగా జోక్యము కలుగ జేసుకొనుచున్నాననియా? అయినచో, ఆ మాట నిదివరకే నీ వెందులకు చెప్పరాదు? ఇదిగో తమ్ముడూ! నా మాట వినుము. సామ్రాజ్య భారమును వహించుటకు నీవు సమర్థుడవని తెలిసియున్నచో నే నిందులో ప్రవేశించువాడనుకాను. నేటినుండి నేను నీ కడ్డురాను. నామాట పంపాపతి సాక్షిగా సత్యము."

పెద్దరాయ లీ మాట విని ఆందోళన జెందినాడు.

"ఏమి, ఇంకనూ నీకు నమ్మిక కలుగలేదా? మీ యన్నగారి హృదయము నింకనూ నీవు అర్థము చేసుకొనలేదు, తమ్ముడూ! ఈ ప్రాపంచిక జీవనమందలి పదవీ వ్యామోహాలు నా కానాడునూలేవు — ఈనాడునూ లేవు. నీవు దక్షుడవు గాకపోవుటచే, సామ్రాజ్యమునకు చెల్లించవలసిన సేవను దలచుకొని, రాజ్యపాలనము జేయుటకు నేను నీతో సహకరించినాను. నీవు దానిని వహించుటకు సమర్థుడవైన పిమ్మట, నాకెందులకీ చిక్కు? నిజముగా నే నీ ఘడియనుండి స్వతంత్రుడను. నన్నీ రాజకీయ విషవలయమునుండి విడుదల చేసిన నీకు నేను చాలకృతజ్ఞుడను. నా ఎదుట బాలుడుగానుండిన నీవు సామ్రాజ్యమును పాలించునంతటి వాడవైనావు కదా! — ఇది నిజముగా సంతోషించవలసిన విషయము" అని ఆనందభాష్పములను రాల్చి, తమ్ముని కౌగలించుకొన్నాడు.

రః బాష్పములనుజూచి, పెద్దరాయల కేమని తోచినదో అన్నగారి పాదములపై బడి :

"అన్నగారూ! తెలియక నావలన అపరాధము జరిగినది. క్షమింపుడు" అని గద్గదకంఠుడైనాడు. అతనికికూడ ఆ ఘడియలో నిజముగా తన యకృత్యమునకై పశ్చాత్తాపము గలిగినది. అతని కనులెందుకో అశ్రుతప్తములైనవి. ఏమైననూ, వారు ఒక తల్లి బిడ్డలుకదా?

## 19. శీలాపహరణము

వెంకటనాయకుడు నాటిన బీజము విషవృక్షమై వేరూనుటకు ఎక్కువకాల మక్కరలేకపోయినది. అతడు పెద్దరాయల ఆంతరంగిక మిత్రుడై, అతని దురాలోచనములకు నర్మసచివుడై వెలసిన పిమ్మట రాజశేఖర, పెద్దరాయల నడుమగల ఆత్మీయత నశించి, వైషమ్యమునకు దారి తీసినది. ఇది పెరుగరాదని రాజశేఖరుడెంత జాగ్రత్త వహించిననూ విరూపాక్షరాయల మార్గమును త్రొక్కిన పెద్దరాయలను చక్కదిద్దుటకతని వలన సాధ్యము గాకపోయినది. అతడు వెంకటరాయల దుర్బోధనలతో ఆత్మవినాశమార్గమున అప్పటికే చాలదూరము పయనించినాడు.

అది రాజేశ్వరి ప్రకరణమున పరాకాష్ఠత నందినది—

ఒకనాటి సాయంకాలము రాజశేఖరుడు తనను చూడవచ్చిన వారి నందరినీ పంపివేసి, సంధ్యాకర్మలకు సంసిద్ధుడగుచున్నాడు. ఆ సమయములో ఒక ఆర్తురాలువచ్చి రాజశేఖరుని కుటీరము ముందు కూర్చొని రోదించసాగినది. ఆమె రోదనమునువిని రాజశేఖరుడు వెలుపలికివచ్చి, ఆమె దుఃఖమునకు కారణ మడిగినాడు :

"అమ్మా! ఎందులకు దుఃఖించుచున్నావు? నావలన నీకేమి సాయము కావలసియున్నది? ఎవరి వలన నీకు ఆపద సంభవించినది? నీ కష్టమేమి! ఏమియునూ సంకోచములేక వివరించుము. నా చేతనైన సాయము చేయుదును" అన్నాడు.

ఈ పలుకులు విని ఆ యభాగిని మరింత దుఃఖించినది. ఆమెను సమాధాన పరచుటెట్లో రాజశేఖరునికి తెలియకపోయినది.

"తల్లీ! నీకు కలిగిన కష్టమేమి? సర్వస్వమునూ పోగొట్టుకొన్న దానివలె నీ వెందులకు రోదించుచున్నావు?" అని మరల అడిగినాడు.

"ప్రభూ? నాకు తమరు న్యాయదానము నీయవలయును." చాలసేపు గడచిన పిమ్మట, ఆమె అతికష్టముపై యీమాట లనినది.

"న్యాయదానమా? నీకు జరిగిన యన్యాయమేమి?"

"దానిని నే నెట్లు చెప్పగలను?" మరల దుఃఖస్వరముతో అనినది.

"అటువంటి అనాహుతమేమి జరిగినది, తల్లీ?"

"నా సర్వస్వమైన నా కుమార్తె జీవితము మంటగలసినది."

"ఎవరి వలన?"

"ఆ నీచ సార్వభౌముని వలన...."

"ఏమీ, పెద్దరాయలచే నీ కుమార్తె జీవితము భగ్నమైనదా?"

"ఔను. మావంటి స్త్రీల జీవితమును ధ్వంసము జేయవలయుననియే యీ నీచులు జన్మ ధరించియున్నారు. ఈ రాజ్యమున మాన మర్యాదలు గలిగి జీవించుటకు మాకు స్థానములేదు. ఇచ్చట యీ విధముగా బ్రతుకుట కంటెనూ మరణించుట మంచిది!"

"అతని వలన నీ కుమార్తె కే మన్యాయము జరిగినది? అంతయునూ వివరముగా జెప్పుము."

"అన్యాయమా? నా ముద్దుల తనయ రాజేశ్వరి జీవితమునకు చిచ్చు పడినది. ఆమె యా నీచుని అత్యాచారమునకు బలియైనది! ఆమె శీల హరణము జరిగినది. ఇప్పుడామెగతి ఏమైనదో తెలియదు. నా జీవిత మెడారి యైనది" అని గొల్లున ఏడ్చినది.

"నీ పేరేమి, తల్లీ?"

"రుద్రాంబ."

"నీ నివాస మెచ్చట? నీ కుమార్తె బ్రతుకెందులకు భగ్నమైనది?"

"మేము రాజధానియందలి అగ్రహారమున నొకమూలలో నివసించుచున్నాము ప్రభూ! నా కుమార్తె-అల్లుడు వీరే నా సర్వస్వము.

వారికి మువ్వురు బిడ్డలున్నారు. వారి జీవితమును నాశనముజేసి, ఆ బిడ్డల ననాధులను గావించినాడా నీచుడు."

"జరిగిన విషయమేదియో వివరముగా చెప్పు, తల్లీ! నా వలన ఏమైననూ సహాయ మగునట్లయినచో తప్పక చేయగలను."

"ఆ విషయ మేమని చెప్పగలను ప్రభూ!...." అని తన దుఃఖ భారముపశమించుటకై, జరిగిన ఆ దురంతమును గాథగా వివరించి చెప్పినది—

రుద్రాంబ ఒక విధవ. తల్లిదండ్రులకామె ఒక్కతియే కుమార్తెగా ముద్దుగా పెరిగినది. ఆమె భర్త రాజేశ్వరి సంవత్సర ప్రాయముననుండగా, ఏదియో వ్యాధితో ఆమె ననాథనుగాజేసి మరణించినాడు.

పతి మరణానంతరము రుద్రాంబ మరల పుట్టిల్లు చేరినది. తల్లిదండ్రుల ఆస్తికంతటికీ ఆమెయే అధికారిణియైనది. కుమార్తెను ముద్దుగా పెంచి, పెద్దదానిని జేసినది. యుక్తవయసురాగానే తగిన వరుని కొనగి ఆమెకు పెండ్లి చేసినది. అల్లుడు-కుమార్తె విజయనగరములో నుండుటచే ఆమెకూడ అచ్చటికి చేరుకొనినది.

ఆమె యల్లుడు శ్రీకంఠదీక్షితుడు అంతఃపురములో కరణీకుడు. అతనికి పూర్వీకుల భూమి కానుకలు గలవు. అతడు ప్రశాంతముగా సుఖ జీవనము చేయుచుండెను. వారి దాంపత్యఫలముగా మువ్వురు బిడ్డలు పుట్టినారు. వారి జీవితము సుఖ సంతృప్తుల కాలవాలమైనది. వారి దాంపత్య జీవితాకాశములో పెద్దరాయలు ధూమకేతువువలె ఉదయించినాడు.

ముగ్గురు పిల్లల తల్లియైననూ రాజేశ్వరి చూచుటకు చాల యంద ముగ నుండును. ఆమెకిపు డిరువది రెండేండ్ల ప్రాయము. తల్లి కొక్క తెయే కుమార్తె యగుటచే ఆమె ఏ కష్టకార్పణ్యములునూలేక సుఖముగా పెరిగినది.

ఆమె చాల సౌందర్యవతి. పేరుకు తగినట్లు రాజేశ్వరియే! గౌరవర్ణ. విశాల నేత్రములు. సంపెంగపూవువంటి నాసిక. మెత్తటి గులాబీలవంటి యధరములు నిండు ముఖములో ఎప్పుడునూ దరహాసము ప్రతిఫలించు చుండును. దీని మాతృత్వము మరింత వన్నెదెచ్చినది. ఆమెను చూచినచో

ఎవరికినీ కామవాంఛలు చెలరేగవు. దేవివలె పూజించవలయునను భావన కలుగును. అటువంటి సద్గుణవంతురాలనుజూచి మోహితుడై పెద్దరాయలామెను తన కామమునకు బలిగావించినాడు.

ఒకనాడు పంపావిరూపాక్షస్వామి దీపోత్సవమునకు తల్లివెంట వచ్చిన రాజేశ్వరి సామ్రాట్ పెద్దరాయల కాముకదృష్టిలో పడినది. ఆమె ముగ్ధసౌందర్యమునకు మోహితుడై అతడు వెంకట నాయకుని చెవిలో ఏదియో చెప్పినాడు. అతడు పెద్దరాయల యభీష్టము నెరింగి, తన గూఢ చారుల నీ కార్యమునకు నియోగించినాడు. వారు తమకు కావలసిన విషయము నెరింగివచ్చి, వెంకటనాయకునకు తెలియజేసినాడు.

ఆమె పేరు రాజేశ్వరి యనియూ, ఆమె భర్త శ్రీకంఠదీక్షితుడు అంతఃపురమందలి కచేరీలో కరణీకుడుగా నున్నాడనియూ తెలిపినారు. ఈ వార్త తెలియగనే తమ రొట్టె విరిగి నేతిలోపడుట కాలస్యము లేదని గ్రహించినాడు, వెంకటనాయకుడు. అతడు కచేరీకి వెళ్ళి, శ్రీకంఠదీక్షితుని సందర్శించి, అతనితో పరిచయము జేసికొన్నాడు. అనంతరము సేవకులు వచ్చి శ్రీకంఠదీక్షితునికి అమాత్యులనుండి అత్యవసరపు పిలుపు వచ్చినదని తెలిపి, అతనిని మర్యాదతో వెంకటనాయకుని అంతఃపురమునకు తోడ్కొనివెళ్ళినారు.

దీక్షితులను వెంకటనాయకుడు విశ్వాసముతో పలుకరించి, మిత్రునివలె గౌరవించినాడు. అతనిని కుటుంబసమేతముగా ఒక పర్యాయము తన యింటికి రమ్మని ఆహ్వానించి, అనేక అమూల్యాభరణముల నిచ్చి పంపినాడు.

తనవంటి అజ్ఞాతవ్యక్తిపై హఠాత్తుగా అమాత్యుల అనుగ్రహ మెందులకు కలిగినదో ఎంత యాలోచించిననూ అతనికి తోచలేదు. ఇంటికి వచ్చి యీ విషయమంతయునూ తల్లిదండ్రుల కెరిగింపగా, వారు నమ్మలేదు. అతని భాగ్య భవనద్వారము తెరువబడినదని వారు భావించినారు. ఒక పర్యాయ మతడు కుటుంబసమేతముగా వెంకటనాయకుని అంతఃపురమునకు వచ్చి వెళ్ళినాడు.

ఈ విధముగా కొన్ని దినములు జరిగిన పిమ్మట వెంకటనాయకుడు చనువు వహించి, సూటిగా విషప్రస్తావనమునకు వచ్చినాడు.

"దీక్షితులూ! మీతో నే నొక ముఖ్యవిషయమును జెప్పవలయు ననుకొనుచున్నాను, మీకు సమయమున్నచో...."

"అమాత్యులూ! నాకు సమయమా? తమరు సామ్రాజ్యమునకు మంత్రులు. తమవంటివారి పాదధూళికి సరియైన యోగ్యత నాకు లేదు. తమ యనుగ్రహము నా పాలిటి భాగ్యవిశేషముగా భావించుచున్నాను. ఈ పామరునివలన ఏమి కార్యము కావలయునో దెలుపుడు, శిరసావహించి నెరవేర్చగలను" అని శ్రీకంఠదీక్షితు లన్నాడు.

"మీవద్ద దాపరిక మెందులకు దీక్షితులూ! మీ యింట నొక యపూర్వ సౌందర్య నిధి గలదు. మీరు సమ్మతించునట్లయినచో దానిని సార్వభౌములు క్రయమునకు తీసికొన నిశ్చయించినారు."

"నా గృహమున సౌందర్యనిధియా?" ఆశ్చర్యముతో అత డడిగినాడు.

"ఔను. అది తమకు తెలిసినట్లు లేదు. మొన్న పంపాపతి దేవాలయములో ఆమె సార్వభౌముని కంటబడినది. మీ భాగ్య భవనద్వారము తెరువబడినది."

"ఆమె....ఆమె....నా భార్య...."

"ఔను. మీ భార్య రాజేశ్వరి....నిజముగా రాజేశ్వరి యగుట కర్హురాలు."

"ఆమెను సామ్రాట్టులు...."

"కోరుచున్నారు."

"ఛీ! ఇటువంటి నీచ మెచ్చటైననూ గలదా? ఆమె గృహిణి. ముగ్గురుపిల్లల తల్లి. అటువంటి స్త్రీని సార్వభౌములు కోరుటయా? తమ రెచ్చటనో ఎవరినో చూచి పొరబడినట్లు దోచుచున్నది. దీనిలో నేదియో పొరబాటు జరిగియుండవలయును! మా రాజేశ్వరి సార్వభౌముల కృపకు తగినది కాదు...." అని ఏవగింపుగ అన్నాడు. అప్పటి కతనికి అమాత్యుడు తన మైత్రికై ఎందుల కంత ఆతురత వహించియుండెనో అర్థమైనది. తన యాశ్చర్యమును ప్రకటించక, వచ్చిన యాపదనుండి తప్పించుకొనుటకై యీ నాటకమాడినాడు.

"లేదు, దీక్షితులూ! మీ భార్యయైన రాజేశ్వరినే సార్వభౌములు కోరినది. మీరు సమ్మతించినచో, రేపుదయములోగా శ్రీమంతులు కావచ్చును!"

"నా భార్యను మీ కప్పగించియా?"

"ఔను! ఆమెకు మీరు కోరు మూల్యమెంతయో దెలుపుడు. ఆ మొత్తమును సామ్రాట్టులు చెల్లించగలరు."

"ధనమునకై ఆలి నమ్ముటయా? లేదు — అది సాధ్యముగాని కార్యము...."

"బాగుగా ఆలోచించి జవాబు చెప్పుడు, దీక్షితులుగారూ! ఇది అప్రుతత జెందు విషయముగాదు. అయాచితముగా మీపై లక్ష్మీకటాక్షము కలిగినది. దానిని త్రోసిపుచ్చకుడు...."

"ఆమె నా భార్య....అగ్నిసాక్షిగా చేబట్టిన ధర్మపత్ని."

"అయిన నేమి? ఆమెను సామ్రాట్టులు భోగకాంతగా స్వీకరించుటకు సిద్ధముగా నున్నారు...."

"ఆమెకు ముప్వురు బిడ్డలు గలరు."

"చింతలేదు. ఆమె యౌవనమునకు సామ్రాట్టులను మోహింపజేయు శక్తి గలదు!"

"ఆమె కీ విషయము తెలిసినచో...."

"ఆమె విషయ మటుండనిండు, ముందు మీ యభిప్రాయ మెరిగింపుడు!"

"నాకు సమ్మతి లేదు—ఆమెకూడ యిటువంటి హేయ కృత్యమున కొడంబడదు."

"ఎందులకని?"

"మా కేమి కొదువగానున్నదని యింతటి నీచకార్యమునకు పూనుకొనవలయును?"

"మీరు శ్రీమంతులు కావచ్చును, పదవులను బొందవచ్చును...."

"నా పాలిటి కామెయే భాగ్యలక్ష్మి. నా బీదకుటీరమే నా కంతఃపురము. నేను త్రాగెడి గంజియే మృష్టాన్నము. నా కింతకంటెనూ

ఎక్కడు అధికారసంపద లక్కరలేదు. అటువంటి వ్యామోహము నాకు లేదు."

"మీకు అవసరములేనిచో పోనిండు. రాజేశ్వరిని సామ్రాట్టులు కోరియున్నారు. ఆమెను నీవు వారికి కానుకగా సమర్పించవలయును."

"అది సాధ్యము కాదు!"

"నే నాజ్ఞాపించుచున్నాను!"

"ఆ యాజ్ఞను నే నుల్లంఘించుచున్నాను."

"మిమ్ములను నిర్బంధములోనుంచి, బలవంతముగా ఆమెను అంతఃపురమునకు చేర్చుకొనవలసియుండును. బాగుగా నాలోచించుడు."

"నేను ప్రాణములతో నున్నంతవరకూ అది సాధ్యము కాదు!"

"అట్లు చేయుటచే మీ జీవితము నాశమగుటయేగాక—మీ తల్లి దండ్రులుకూడ నాశము జెందగలరు."

"ఈ మాటలు సత్యమా?"

"ఔను. ఇపుడు మేము చెప్పినట్లు నడచిననే మీరు బ్రతకగలరు. మీకు సంపదాధికారములు లభించును...."

"ఆమె నా భార్య – నా బిడ్డలకు తల్లి...."

"చింతించకుము. నీవు వేరొక స్త్రీని వివాహమాడి బిడ్డలను పోషించుకొనుము. కాని, రాజేశ్వరిని మాత్రము మీరు మరచిపో వలయును."

"అది యీ జన్మలో సాధ్యము కాదు."

"ఎందులకు సాధ్యముగాదు?"

"ఆమె మహాసాధ్వి. ఈ విషయమును విన్నచో హృదయము బద్దలై మరణించునేకాని, శీలాపహరణకు సమ్మతించదు."

"ఆ విషయము సామ్రాట్టులు చూచుకొనగలరు. మీ యభిప్రాయ మును దెలుపుడు."

"నా కీ హేయకృత్యము సమ్మతము కాదు—"

"తెలిసి-తెలిసీ ఆపద తెచ్చుకొనగలరా?"

"అనిన?...."

"మీరు మా కోరికమేర కొక లేఖను వ్రాసి, యిప్పుడే రాజేశ్వరి నిచ్చుటకు రప్పించి సామ్రాట్టుల వశమొనర్చనిచో, మిమ్ములను బంధించి చెఱసాలలో వేయబడును—కఠినశిక్ష విధించబడును. మీ తల్లిదండ్రులు కూడ శిక్షింపబడుదురు. మీ బిడ్డలు ఘోరముగా హత్య గావింపబడుదురు. మీ యాస్తిపాస్తులను వశపరచుకొందుము."

"నేను చేసిన ఏ యపరాధమునకై యీ శిక్ష?"

"సార్వభౌముల కోరికకు వ్యతిరేకముగ ప్రవర్తించినందులకు."

దీక్షితులు తలమీద చేతు లిడుకొని ఆలోచించుచూ కూర్చొన్నాడు. ఇపుడీ దుష్టుల బారినుండి తప్పించుకొనుటెట్లు? ఈ విషయమును తన భార్యకును, తలిదండ్రులకును తెలియజేసి, వారిని నగరమువిడచి పారి పొమ్మని చెప్పవలయును. ఎచ్చటనైననూ దాగి యుండమని తెలుప వలయును. కాని, తెలుపుటెట్లు?

"అమాత్యులూ! ఒకవేళ నేను సమ్మతించిననూ నా భార్య యీ వార్తవిని గుండెబ్రద్దలై మరణించిన నెట్లు?"

"ఆమె విషయము మేము చూచుకొనెదము. మీ రిపుడు మీ భార్యను దోడ్కొని వచ్చుటకై ఒక లేఖ వ్రాసి యిండు. వెలుపల పల్లకీ సిద్ధముగా నున్నది."

"నేనే యింటికి వెళ్ళివచ్చిన యెడల, ఆమెను ఒప్పించి తీసికొని రావచ్చును."

"అట్లు చేయుటకు వీలులేదు — మీ భార్య సామ్రాట్టుల అంతః పురమునకు చేరువరకూ మీ రిచట నిర్బంధములో నుండవలయును. అనం తరమే మీకు విముక్తి!"

"నా మాటలలో నమ్మికలేదా?"

"ఈ విషయములో ఎవరిని నమ్ముటకునూ వలను పడదు...."

"అయినచో మీ యిష్టము వచ్చినట్లు జేయుడు —"

"మీరు లేఖవ్రాసి యివ్వరా?"

"ఇవ్వను — నా ప్రాణము పోయిననూ సరియే, ఈ హేయ కృత్యమునకు పాల్పడలేను. ఆ సాధ్వి బ్రతుకును మంటగలుపలేను."

"మీ మాటలు నిజమా?"

"ఔను."

"ఎవరక్కడ?——ఈ నీచుని తీసికొనివెళ్ళి, స్తంభమునకు బిగించి కట్టి, నాలుగు కమ్చీ దెబ్బలరుచి జూపుడు. అతడే దారికి రాగలడు," అని వెంకటరాయ లాజ్ఞాపించినాడు.

దైత్య సదృశులైన నల్వురు భటులువచ్చి దీక్షితుల నీడ్చుకొని వెళ్ళి అచటగల ఒక కంబమునకు బిగించి కట్టినారు. కమ్చీ తీసుకొని నాలుగు దెబ్బలను కొట్టినారు.

శ్రీకంఠదీక్షితుడీ దెబ్బలకు తాళలేక బొబ్బపెట్టినాడు. కాని ఆ పాపు లతనిపై కరుణ జూపలేదు. అతనిని చంపుటకై సిద్ధపడిన వారితో మొరబెట్టుకొనిన ప్రయోజనమేమి?

తను బ్రతుకవలయునన్న ఒకే మార్గము గలదు. అది తన భార్యకు లేఖవ్రాసి పంపుట....

కమ్చీ దెబ్బల కోర్వజాలక అతడు లేఖ వ్రాయుటకు సమ్మతించి నాడు.

వారు దీక్షితుల కట్లువిప్పి, అతడు వ్రాసియిచ్చిన లేఖను గైకొని, వారి యింటికివెళ్ళి లేఖ నందజేసినారు.

ఆ లేఖలో దీక్షితులు, తాను రాజవీధిలో వచ్చుచుండగా ఒక శకటము క్రింద పడి గాయములు తగిలి పడుకొనియున్నట్లూ, దారిలో తమను జూచిన అమాత్యులు వారి గృహమునకు దీసికొనివెళ్ళి వైద్యోపచారములు చేయుచున్నట్లూ, గాన వెంటనే అచ్చటికి రావలసినదనీ కోరుచూ తన భార్యకు తెలియజేసినాడు.

ఆ లేఖనుజూచి రాజేశ్వరికి భీతికలిగినది. తలపై పిడుగు పడినట్లుగా దోచినది. ఆమె వెంటనే మంత్రిగారి అంతఃపురమునకు వెళ్ళనుద్యుక్తురాలైనది. కాని ఆమె యత్తమామలు మాత్ర మీ విషయమును నమ్మక ఆమెను సమాధానపరచినారు.

కాని రాజేశ్వరి తన పట్టు విడువలేదు. చివరకు విధిలేక పిల్లలను వదలి, మామగారివెంట ఆమె అమాత్యుల అంతఃపురమునకు వెళ్ళుట నిశ్చయమైనది.

రాజేశ్వరి పల్లకీలో బయలుదేరినది. దానివెనుక ఆమె మామగారు నడచి వెళ్ళినారు. వారు అంతఃపురమునకు చేరిన పిమ్మట సేవకు లీ విష యమును వెంకటనాయకున కెరిగించి వెళ్ళిపోయినారు.

తన పన్నుగడ ఫలించి రాజేశ్వరి వచ్చినందులకు అతనికి చాల సంతోషము కలిగినది. ఆమె వెంట ఆమె మామగారు వచ్చియున్నారను వార్తవిని చేదు మ్రింగినవానివలెయైనాడు. అతని ప్రతిబంధకమును ఉపా యముగా నివారించుకొనవలయునని, భటుల చెవిలో ఏదియో చెప్పినాడు. చెప్పి, రాజేశ్వరికి స్వాగతమిచ్చుటకై వెళ్ళినాడు.

మంత్రియాజ్ఞమేరకు రాజేశ్వరి మామగారిని అంతఃపుర పరిచార కులు ఉపాయముగా వేరొకవైపునకు దోడ్కొని వెళ్ళినారు. అచ్చట అతనిపైబడి, బంధించి చెఱసాలలో వేసినారు.

ఇటు భర్తను జూచుటకై ఆతురత జెందుచున్న రాజేశ్వరిని స్వయముగా వెంకటనాయకుడేవచ్చి లోనికి గొనిపోయినాడు.

అచ్చట ఆమె కెదురైనది భర్తకాదు. ఆమెను కుతూహలదృష్టితో చూచుచూ, నవ్వుచూ నిలబడిన పరిచారికలు. వా రామెను దోడ్కొనివెళ్ళి అలంకరించి, రాజమందిరమునకు గొనిపోవచ్చిన వనితలు.

వారి వైఖరిని జూచియే రాజేశ్వరి భీతిల్లినది. ఆ క్షణమున ఆమెకు తాను మోసపోయినదేమోనను సందేహముకూడ కలిగినది. దానికి తోడామెతో వచ్చిన మామగారుకూడ అకస్మాత్తుగా కనుమరుగైనారు.

వా రెచ్చటికి వెళ్ళినారు? తన నెందులకు వీ రిచ్చటికి తోడ్కొని వచ్చినారు? తన భర్త ఎక్కడనున్నారు.

ఆమె దీనముగా వెంకటనాయకుని యీ విషయమై ప్రార్థించినది. అతడు చిరునవ్వు నవ్వుచూ :

"రాజేశ్వరీ! మీ మామగారు నీ భర్తను జూచుటకై వెళ్ళియున్నారు. నీవు ఆందోళన జెందనక్కరలేదు. నీ భర్త గుణముఖుడౌచున్నాడు.... చింతించకుము. మీ మామగారువచ్చి నిన్ను లోనికి గొనిపోయెదరు. అంతవరకునూ నీ విచటనే విశ్రమించుకొనుము" అని చెప్పి, అచ్చటనున్న పరిచారికకు కంటితో ఏదియో సంజ్ఞచేసి, అచటినుండి వెళ్ళిపోయినాడు.

కొంతసేపు గడచిన తరువాత అతడచటికివచ్చి చూడగా, యిష్టము లేకపోయిననూ ఆ దాసీదాని తియ్యటి మాటలకు మోసపోయి రాజేశ్వరి బాగుగా అలంకరించుకొని, భర్తను జూచుటకై త్వరపడుచున్నది.

తన భర్త క్షేమముతో నుండుటను తాను జూచునట్లయినచో, ఏ సాహసమునకైననూ ఆమె సిద్ధపడినది. గనుకనే ఆమె అలంకరించుకొని కూర్చొన్నది. కాని ఆమెకు లోలోపల తానీ వంచకునిచే మోసగింపబడి యున్నదేమో యను భీతి కలుగసాగినది.

వెంకటనాయకుడు రాగానే,

"స్వామీ! నా భర్త ఎచ్చటనున్నాడో అచ్చటికి దయయుంచి నన్ను గొనిపొండు, మీకు పుణ్యముండును" అని దైన్యముగా ప్రార్థించినది.

"అచ్చటికే యిప్పుడు పోవుచున్నది" అని సిద్ధముగానున్న పల్లకీలో నెక్కుమని చెప్పినాడు.

దానిలో నెక్కుట కామె వెనుక ముందాడినది.

"అనుమాన మెందులకు? నీ భర్తను రాజవైద్యులయింట విడచి వచ్చినాము. నీ మామగారుకూడ అచటికే వెళ్ళియున్నారు. అచ్చట నీ భర్త నీ కొరకై కాచుకొనియున్నాడు" అని చెప్పి, బలవంతముగా ఆమెను పల్లకీలో కూర్చుండజేసి, తలుపులను మూసినాడు.

ఆ పల్లకీ వెళ్ళినది రాజవైద్యుల గృహమునకుకాదు — వెంకట నాయకుని ఆజ్ఞమేరకు నేరుగా పెద్దరాయల అంతఃపురమునకు. అచ్చటికి వచ్చువరకూ రాజేశ్వరికి తా నెచ్చటికి చేరినదను విషయము తెలియలేదు. పల్లకీ అంతఃపురముముందువచ్చి నిలచినపుడే ఆమెకు అర్థమైనది. అచట పెద్దరాయలు వికటముగా నవ్వుచూ నిలబడియున్నాడు.

"స్వామీ: నన్నిచ్చటి కెందులకు తోడ్కొని వచ్చితిరి? నాపతి ఎచ్చట నున్నారు! నన్నచటికి గొనిపొండు" అని రాజేశ్వరి వేడుకొన్నది.

"నిన్నచటికే తీసుకొని వచ్చినాను."

"అయినచో నా పతి ఎచ్చట?"

"అదిగో! ఎదుట నిలబడియున్న ఆ సార్వభౌములే నీ స్వామి. ఈ ఘడియనుండి వారే నీ పతిదేవులు. నీ వా పేదబాపని మరచి. వీరి యంతః

పురములో,విలాసభోగములతో సుఖముగా నుండవలయుననియే నిన్నిచటికి తోడ్కొని వచ్చితిని. నీవు నీ భర్తను, బిడ్డలను గురించిన చింత వదలి, యిచ్చట నెమ్మదిగా నుండుము. నీకిచట ఏదియునూ కొరత ఏర్పడదు," అని చెప్పి, వెంకటనాయకు డామెను పెద్దరాయల కప్పగించి, వెళ్ళిపోయి నాడు.

ఈ మాటలు విన్న వెంటనే రాజేశ్వరికి పిడుగుపడినట్లయినది. ఆమె అట్లే నేలగూలి మూర్ఛపోయినది. మరల స్మృతికలుగునప్పటికి తల్పముపై అర్ధనగ్నముగా పడియున్నట్లు తోచినది. ఆమె అమూల్య సంపద యగు శీల మానాడు నీచుడగు పెద్దరాయలచే హరింపబడినది. ఆమె పతితయైనది.

ఆమె యిపుడు 'కుక్క ముట్టిన కుండ' యైనది. తన దుస్థితికై ఆమె ఆనాడంతయూ రోదించినది. ఆమెను సమాధానపరచుట కెవరివల ననూ సాధ్యము కాలేదు. ఏడ్చి ఏడ్చి అలసిపోయి ఆమె అట్లే నిద్ర పోయినది. వెలుగైనది – కాని ఆమె పాలిటికి మాత్రము కాళరాత్రియే మిగిలినది.

దీక్షితు లటు తన భార్యకు ఉత్తరమును వ్రాసి యిచ్చినపిమ్మట ఆమెను ఆ కాముకుడగు ప్రభువుకు బలిగావించినట్లుగా భావించి, అన్న పానీయములను వదలి కృంగి కృశించిపోసాగినాడు. అతనిని చీకటి గదిలో బంధించినారు. ఒకటి రెండు రోజులే విషయమునూ తెలియ లేదు. ఆ మరునాడు అచటికి వచ్చిన అతని తండ్రివలన అన్నియునూ తెలిసినవి.

జరిగిన విషయములన్నియునూ తండ్రిద్వారా ఎరింగి, అతడు పసి పిల్లవానివలె ఏడ్చినాడు. తన భార్యకు జరిగిన అన్యాయమునకై అతని రక్త ముడికిపోయినది. వెంకటనాయకుని నీచత్వమున కితనిని సంహరించవలయునన్నంత కోపము వచ్చినది.

సరిగా ఆ సమయముననే అచ్చటికి వెంకటనాయకుడు వచ్చినాడు. వారిని అనునయవాక్యములతో వశపరచుకొనుటకై వచ్చినాడు.

"దీక్షితులూ! గడచినదానిని మరచిపొండు. మీ భార్య మీ పాలిటి కిక బ్రతికియూ లేనిదానితో సమానము. మీరు వేరొక స్త్రీని వివాహమై సుఖముగా నుండుడు. ఈ సంచిలో వేయివరహా లున్నవి. సామ్రాట్టులు దీనిని మీకు కానుకగా బంపినారు" అని వరహాలమూటను అతని ముందుంచినాడు.

దీక్షితులకు భయంకరమైన కోపము కలిగినది. ఆ వరహాలసంచి నెత్తి వెంకటనాయకుని ముఖమునకు విసరికొట్టినాడు.

"నీచా! నన్నేమని భావించితివి? ఇన్ని దినములుగా యీ కుట్ర పన్ని ఆ సాధ్వి జీవితమునకు చిచ్చు బెట్టినావు. ఎంతమంది కులస్త్రీలను యీ విధముగ చెరచినావు? ఈ ధనము నీవు నీ పీనుగపై వేసుకొనుము!" అని యన్నాడు.

"దీక్షితులూ! మీ రెవరితో మాటలాడుచున్నారో తెలియునా?"

"నేను కుక్కతో మాటలాడుచున్నానని, నాకు తెలియును."

"మీ రింకనూ మీ గర్వము నణచుకొనలేదా? ఉండనిమ్ము, దాని నణచు మార్గము నాకు దెలియును. ఎవరక్కడ? ఈ నీచునికి ఎఱ్ఱగా కాలిన యినుపసలాకులచే వాతలుబెట్టి బుద్ధి జెప్పుడు!" అని ఆజ్ఞాపించినాడు.

"నన్ను ముట్టుకొను ధైర్యమున్నచో ముందునకు రండు!" అని తన చేతులకు వేసిన సంకెళ్ళను నేలకు తాటించినాడు. సమీపించిన సైనికునిమీద పడి, అతనిని నేలగూల్చినాడు.

దీనితో కోపించిన వెంకటనాయకుడు కత్తిబట్టుకొని అతని నచ్చటనే రెండుగా నరికివేసినాడు. అడ్డువచ్చిన అతని తండ్రికికూడ ఇదియే దుర్గతి ప్రాప్తమైనది. అంతటితో ఆ తండ్రీ కొడుకుల అవతారము పరిసమాప్తమైనది.

ఈ విషయము దెలియక దీక్షితుల తల్లి, అతని అత్త రుద్రాంబ నగరమంతయూ వారికొరకై శోధించినారు. ఎచ్చటయునూ వారిని గురించిన జాడ తెలియలేదు. తన యల్లుడు గాయపడిన విషయమును గురించి కాని, అతనిని అమాత్యుని అంతఃపురమునకు తీసికొని వెళ్ళినట్లుగాని ఎవరూ ఎచ్చటా అనుకొనలేదు. ఇది తమను మోసగించి, రాజేశ్వరి నపహరించుటకు ధూర్తుడగు ఆ వెంకటనాయకుడుపన్నిన కుట్రయని తెలియగనే వారు ఎదురైనవారి కందరకూ చెప్పి ఏడ్వసాగినారు.

ఇంతలో రాజేశ్వరి ఉపాయముగా, తాను పెద్దరాయలకు వశమైనట్లు నటించి, ఒక పరిచారికచేత తనకు సంభవించిన దుస్థితిని వ్రాసి పంపి, తన భర్తకు, అత్తమామలకు తెలియజేసినది. తన నిక యీ జన్మలో మఱచిపొమ్మని వారిని ప్రార్థించినది.

ఈ వార్త తెలియగనే శ్రీకంఠదీక్షితుని తల్లి యీ దుఃఖభారమును భరించలేక, హృదయము బ్రద్దలై మరణించినది. రుద్రాంబ మాత్రము కుమార్తెను చూడలేక పిచ్చిదానివలె వీధిలోబడి ఏడ్చుచూ, ఆమెకొరకై వెదుకసాగినది అటువంటి సమయములో ఎవరో ఆమెకు రాజశేఖరుడొక్కడు యీ విషయములో సాయపడవచ్చునని సూచించినారు. ఆమె శాంతికుటీరమునకు వచ్చి రాజశేఖరరాయలతో తన దారుణోదంతమును విన్నవించుకొనినది.

## 20. పరాక్రమము

రాజశేఖరుడా హతభాగినికి జరిగిన యన్యాయమును విని వ్యథ జెందినాడు. తన ప్రాణములను బలిగావించియైననూ యీ యన్యాయమును చక్కబరచగలనని చెప్పి, అచటినుండి లేచినాడు. ఇంతటి దుష్కృత్యములను తా నరికట్టింపనిచో, సామ్రాజ్యము మూడు దినములలో నాశము కాగలదని గ్రహించినాడు. పెద్దరాయ-వెంకటనాయకుల దుష్కృత్యముల కింకనూ ఎంతమంది సాధ్వీమణుల బ్రతుకు బలికాగలదోనని పరి

తపించినాడు. ఈ దుష్ప్రవర్తనమునకు పెద్దరాయలకు బుద్ధిజెప్ప నిశ్చయించినాడు. మున్ముందు జరుగబోవు పరిణామములను లక్ష్యపెట్టక, సింహాసనముపై కూర్చొనియున్న పెద్దరాయలనుండి యిటువంటి అత్యాచారములను తప్పించుటకై, తన ప్రాణములనే బలి యిచ్చుటకు నిశ్చయించినాడు. కాలభైరవునివలె అత డంతఃపురమును సమీపించి, పెద్దరాయలకు తన రాకనుగురించి చెప్పి పంపినాడు.

రాజభటు లీ వార్తను పెద్దరాయలకు దెలిపినపు డతడు స్త్రీల సాన్నిధ్యములో సరససల్లాపము లాడుచున్నాడు.

"ఇప్పు డెవరిని జూచుటకునూ వీలులేదు!" అని చెప్పి పంపివేసినాడు.

అతని నిప్పుడు చూచితీరవలయునని రాజశేఖరుడు పట్టుబట్టగా, వేరు దారిగానక, పెద్దరాయలు తనను పరివేష్టించియున్న వనితా జనములకు నిష్క్రమించుడని జెప్పి, రాజశేఖరుని జూచుటకై వచ్చినాడు.

అతని ముఖములో విసుగు కనబడుచున్నది. 'నా యిష్టము వచ్చినట్లుండుటకు నాకు స్వాతంత్ర్యము లేదు' అను భావ మచట ద్యోతకమగుచున్నది.

అతని వదనమును, వైఖరిని జూచి రాజశేఖరుడే పలుకరించినాడు :

"తమ్ముడూ! నా రాకవలన నీ కేమైననూ యిబ్బందికలిగియుండిన క్షమించుము. విషయ మటువంటిది. కనుక, నిన్ను జూచుటకై వెంటనే రావలసివచ్చినది."

"అన్నగారూ! రాచకార్యమునకుకూడ సమయాసమయములు లేవా? కాని సామ్రాట్టునైన నేను క్షణకాలము నా చిత్తమువచ్చినట్లుండుటకు వీలులేకున్నది" అని భారముగా నిట్టూర్చినాడు పెద్దరాయలు.

"ఈ విషయము వైయక్తికముగా నీకు సంబంధించినది గనుక నీ సమయాసమయములను జూడక నేను రావలసి వచ్చినది" రాజశేఖరుడు కఠినముగా అనినాడు.

"నావలన ఏమి కావలసియున్నదో తెలుపవచ్చును."

"ఈ నడుమ నీ దర్శన మపురూపమై పోవుచున్నది...."

"ఏమో, వచ్చుటకు వీలుగాకపోవుచున్నది...." అతని పలుకులలో నిర్లక్ష్యము, తిరస్కృతీ గలవు.

"ఎట్లు వీలగును? కాంతల వేటలో ఎంత సమయమైననూ నీకు చాలదు." రాజశేఖరుడుకూడ అదేవిధముగ అన్నాడు. ఇది విని పెద్దరాయలు నిప్పులు గ్రక్కుచున్నవానివలె చూచుచూ నిలబడినాడు.

"అన్నగారూ! నేను మీ సహోదరుడను గావచ్చును. కాని నేను విజయనగర సామ్రాట్టుననుమాట మీరు మరచినట్టున్నారు. నాలుకను కొంత అదుపులో పెట్టుకొనుడు."

"నేను నీచే చెప్పించుకొనుటకై రాలేదు. రాజేశ్వరి ఎచ్చటనున్నది? ఆమెను నీ వెచ్చట దాచియుంచినావు?"

ఈ మాటలు విని పెద్దరాయల వదనము వివర్ణమైనది. తాను రహస్యముగ అంతఃపురమునకు రప్పించుకొనిన రాజేశ్వరి విషయ మతనికెట్లు దెలిసినది?

"ఏ రాజేశ్వరి?"

"రుద్రాంబ పుత్రి రాజేశ్వరి! శ్రీకంఠదీక్షితుల భార్య రాజేశ్వరి!"

"ఆమె ఎవరో నాకు తెలియదు!"

"నీ కచేరీలో పనిచేయుచున్న కరణము శ్రీకంఠదీక్షితుని భార్య నీకు తెలియదా?"

"లేదు, మీరేదియో అపార్థము చేసుకొని యిచ్చటికి వచ్చినారు. ఆ పేరుగలవారు నా యంతఃపురములో ఎవరునూలేరు. ఆమెను నేను చూచియే యుండలేదు...."

"రాజశేఖరు డీ మాటలకు కోపించినాడు.

"పాపం! నీకెట్లు తెలియను? ఆ కులస్త్రీ మానభంగము, శీల భంగముజేసి, నీ కార్యమును గడపుకొనిన పిమ్మట సత్యనిష్ఠగల సామ్రాట్టు కామె జ్ఞాపకమైననూ ఎట్లు మిగులును!"

రాజశేఖరుని మాటలలో వ్యంగ్యము ధ్వనించినది.

ఈ మాటలు పెద్దరాయలకు బాణములవలె గ్రుచ్చుకొన్నది.

"అన్నగారూ! మీరు నిద్రించుచున్నారో లేక కలగాంచుచున్నారో తెలియకున్నది. నా మీద యింతటి భయంకరమైన ఆరోపణను మోపు చున్న మీరు నిక్కవముగా కలగాంచు చుండవలయును లేదా మీకు మతిభ్రమణమై యుండవలెను."

"రాజేశ్వరిని అంతఃపురమునకు గొనివచ్చి నీవు నీ కామమునకు బలిగావించలేదా?"

"లేదు....! లేదు....!! లేదు!!!"

"నూరబద్ధములుజెప్పి నీవు సత్యమును మరుగుపరచలేవు. నాకామె అపహరణ, అత్యాచారములను గురించిన కథ తెలిసినది. ఆమె తల్లి నాకంతయునూ జెప్పినది. నీవు నన్నంత సులభముగ మోసగించ లేవు. రాజేశ్వరి ఎచ్చటనున్నది? ఆమె భర్త నెచ్చట దాచినావు? ఆమె మామగారి నేమి చేసితివి? ఆ ద్రోహియగు వెంకటనాయకుని పిలువుము, నీ యత్యాచార గాథ అంతయునూ బయలు కాగలదు."

"అన్నగారూ! నా వైరులెవరో మీకు నాపై యబద్ధముచెప్పి మోసగించినారు. నీవు చెప్పుచున్న విషయము లొక్కటియునూ నాకు తెలియవు. నేనటువంటి వాడనుగాదు. అంతఃపురములో స్త్రీలకు కరవా?

ఇచట వేలకొలది వనితలు మా కృపాభిక్షకై పరితపించుచుండగా నేను పరదారను గోరునంతటి నీచుడను కాలేదు. నేను నిరపరాధిని. ఎవరో చేసిన దుష్కృత్యమునకు వృథగా మీరు నన్ను దండించుచున్నారు."

"నీవు నిరపరాధివా? అగ్రహారపు ఆ బ్రాహ్మణ వనిత బ్రతుకును మంటగలిపి, ఆ సంసారమును నాశనము జేసిన నీవు నిరపరాధివా? పెద్దరాయా! నేను నీ దుష్కృత్యములను తెలియని వాడననుకొన్నావా? నీవూ నీచుడగు ఆ వెంకటనాయకుడూ మీరుభయులూ కలసి చేసిన యీ హేయ కృత్యము నాకు తెలియకపోలేదు. ఇదివరకునూ నీవు కులస్త్రీల జోలికి రాలేదు. ఇపుడు వారినికూడ నీ కామపిపాసకు బలిగావించునంతటి పతితుడ వైనావా? ఇంతటి హేయకార్య మొనరించుటకు నీకు మనసెట్లు వచ్చినది? ఇందులకై తీర్థరూపులగు మల్లికార్జునరాయల గర్భమున జనించితివా? ఈ విధమైన నీచకార్యములు జేయుటకొరకే నీ వీ ధర్మసింహాసన మధిష్ఠించితివా!" అని బాధగా అన్నాడు.

ఈ మాటలు విని కోపించుటకు మారుగా నిరపరాధిత్వపు ముసుగు ధరించి అచటినుండి బయటపడుటకు ప్రయత్నించినాడు పెద్దరాయలు. అతని అంతరాత్మ అతనిని వెక్కిరింపసాగినది దానిని రాజశేఖరుని ఎదుట సమర్థించుకొనునంతటి నైతిక బలమతనికి లేకపోయినది. అపరాధి ముఖమును దాల్చి, నిరపరాధి మాటలను ఆడినాడు :

"అన్నగారూ! నే నటువంటి అపరాధమేదియునూ జేసి యుండ లేదు—ఏకులాంగననూ నేను నా కామమునకు బలిగావించలేదు. నేను విషయలంపటుడనుగాను. విలాస జీవనములో మునిగి యుండవచ్చును. కాని పరస్త్రీలను గోరునంతటి పతితుడను కాలేదు. ఎవరి మాటలనో విని మీరు నాపై లేని నిందను మోపుచున్నారు. నిష్కారణముగ నన్నవ మానించుచున్నారు. మీ సాక్షిగా నేను నిరపరాధిని. నా మాటలను నమ్ముడు." అతని వాక్కులలో దైన్యత గోచరించినది

కాని, నిజమెరిగిన రాజశేఖరుడు కఠిన హృదయుడైనాడు. అతడీ నీచులకు శిక్ష విధించవలయుననియే వచ్చినాడు.

"అయినచో, నీవు దీక్షితుల భార్యయగు రాజేశ్వరిని కామించ లేదా?"

"లేదు!"

"ఆమెను పతితనుగాజేసి, ఆమె భర్తను, మామగారిని ఘోరముగా హత్యచేయలేదా?"

"లేదు, ఇదంతయునూ అబద్ధము. నా వైరులెవరో నామీద మోపిన మిధ్యాపవాదు యిది."

"నీవు పూజనీయులగు ప్రౌఢదేవరాయల మనుమడవై! మల్లికార్జునరాయల పుణ్య సంతానమై, అబద్ధము లాడుచున్నావా? ధర్మ సామ్రాజ్యమునకు సామ్రాట్టువై అబద్ధము లాడెదవా?"

"మీ సాక్షిగా నేను చెప్పుచున్నది సత్యము. నా మాటలను నమ్ముడు."

"నీ మాటలను నమ్ముటకు ప్రమాణమేమి?"

"మీ యారోపణ సత్యమనుట కాధారమేమి?"

"ఆధారమా? ఆ హతభాగిని తల్లి రుద్రాంబ యింకనూ బ్రతికియే యున్నది. ఆ హుతాత్మురాలి బిడ్డలు అనాధలై యున్నారు. రమ్ము, వచ్చి చూతువుగాని, పాపీ!"

ఈ మాటలు పెద్దరాయలకు కోపమును కలిగించినవి.

"అన్నగారూ! మాటలాడునపుడు మర్యాద నతిక్రమించకుము. మాటలు వచ్చునని వదలకుడు. ఎవరితో మాటలాడుచున్నారో తెలియునా? జాగ్రత్త!"

"నీవు సార్వభౌముడవా! నీవంటి నీచునకు సింహాసనమును దత్తముజేసి నేను సామ్రాజ్యమున కన్యాయ మొనరించితిని. నీవు మానవుడవుకావు, రాక్షసుడవు—శునకమవు. నీవంటి శునకము లీ కనకపు సింహాసనముపై నుండరాదు." అని అతని కుత్తుకను పిసుక ప్రయత్నించినాడు.

రాజశేఖరుని వజ్రముష్టిలో చిక్కిన పెద్దరాయలు "అయ్యో, చచ్చితిని" అని బాధగా అరచినాడు.

"పాపి! ఇప్పుడు చెప్పుము? యథార్థమును. వివరింపుము. ఇకనైననూ నీ యపరాధమును ఒప్పుకొనెదవా?"

"అన్నగారూ! నన్ను చంపకుడు, సత్యమును చెప్పెదను" అని భీతిల్లుచూ అనినాడు.

రాజశేఖరుడు పెద్దరాయలను వదలి దూరముగా నిలబడి అతనిని తీక్షణముగా జూచినాడు. ఆ చూపులు నిప్పులు గ్రక్కుచున్నవి.

"అన్నగారూ! నాపై యీ యారోపణను మోపుచున్న మీరు పరిశుద్ధులేమో ముందు నా ప్రశ్నకు జవాబివ్వుడు. అనంతరము మీకు సమాధానము చెప్పెదను."

"నాపై నీ అభియోగమేమి?"

"మీరు విషయ లంపటులని యీ రాజధానియే చెప్పుచున్నది. సన్యాసివేషమున అవినీతి జీవనమును గడుపుచున్నారని ప్రజ లనుకొనుచున్నారు. రాత్రియైనచో మీ శాంతి కుటీరము 'వేశ్యావాటిక' యగునట. ఇంతటి హేయ కృత్యములు జేయుచున్న మీరు నన్ను దండించ వచ్చినారా? నా శీలమును గురించి ప్రశ్నించు అధికారము మీ కెక్కడిది?"

"ఏమీ, శాంతికుటీరము వేశ్యావాటికయా?"

"ఔను! ఇది ప్రజలనుకొను మాటకాదు. నేనే కనులారా జూచితిని.

కుటీరమున రాత్రంతయూ దీపములు వెలుగుటనూ, స్త్రీల నృత్యమునూ, సంగీతమునూ, అత్తరు-గంధముల సువాసననూ చూచి తెలుసుకొన్నాను."

"నీవు జూచినది వేశ్యాజనములనుగాదు. సహాయమునకై వచ్చి వేడు అభాగినులను. నీవు చూచిన నృత్య సంగీతములు నేను చేయు భజన. నీవు జూచిన మరిమళములు దైవమునకు దీసిన ధూపములు, మంగళ హారతి."

"అయినచో శాంతికుటీరములో రాత్రంతయూ ఏందులకు దీపములు వెలుగుచుండును?"

"నేను భువనేశ్వరీ మాతనుగురించి జపము చేయుచున్నాను."

"ఎందులకు?"

"దేశక్షేమమునకై!"

"మీరు భగవదారాధనా నెపమున చేయుచున్నది విలాస జీవన మెందులకు కాకూడదు?"

"ఆ మాటలను, నీ నాలుక తెగిపడగలదు, జాగ్రత్త!"

"నాపై లేనిపోని దోషారోపణలు మోపిన నాలుకకుకూడ అదియే దుర్గతి ప్రాప్తము కాగలదని తెలియుడు."

"నీవు చెప్పునది అబద్ధపు ఆరోపణ!" రాజశేఖరుడు అసహనముతో అన్నాడు.

"అట్లయిన, మీరు కోశాధికారితో గలసి రాజబొక్కసమును ఖాళీ చేయుచున్నదబద్ధమా? ఆ ధనమును నాపై తిరుగుబాటునకు సైన్యమును చేకూర్చుటకై ఉపయోగించుచుండలేదా?"

"అదియునూ అబద్ధమే! దీనిని నీవు నాపై ఆరోపించు చున్నట్టయితే, నిరూపించవలయును."

"మీరునూ అదియే విధముగా నామీది యారోపణనుకూడ నిరూపింపవలయును."

"అయినచో నీ యంతఃపురములో రాజేశ్వరి లేదా?"

"వలసినచో చూచుకొనుడు! నేను మీవలె అబద్ధమాడుచుండుట లేదు!"

"నేను అసత్యవాదినా?"

"ఔను. అంతియే కాదు. సామ్రాజ్య ద్రోహులుకూడ!"

ఈ మాటలకు రాజశేఖరునికి ఆవేశము కలిగినది.

"నీచా! ఏమనుచున్నావు?" అని అతనిమీదపడి గొంతుకను బిగించి పట్టుకొన్నాడు. రాజశేఖరుని పట్టును విడిపించుకొనలేక అతడు విలవిల తన్నుకొనినాడు.

ఇంతలో ఎవరో బిగ్గరగా అరచినట్లయినది. రాజశేఖరు డటు చూచినాడు. తనవైపున కెవరో ఒక స్త్రీ పరుగిడి వచ్చుచున్నది. ఆమెను వెంకటనాయకుడు చేయిపట్టి వేరొకవైపునకు తీసుకొని వెళ్ళుటకై ప్రయత్నించుచున్నాడు.

"ఆ నీచుని పట్టుకొనుడు!" అని రాజశేఖరుడు గర్జించినాడు.

వెంకటనాయకు డతని దైత్యావేశమును జూచి భీతిల్లి, అట్లే నిలబడిపోయినాడు.

ఆ వనిత పరుగున వచ్చి రాజశేఖరుని పాదములపై బడినది.

"తల్లీ! నీ వెవరవు?"

"ప్రభూ! ఆ నిర్భాగ్యురాలగు రాజేశ్వరిని నేనే!"

"ఇచ్చటి కెట్లు వచ్చితివమ్మా?"

"ఈ నీచుడు నన్నిచటికి తెచ్చి, శీలాపహరణము చేసినాడు."

ఈ మాటలకు జవాబుకొరకై రాజశేఖరుడు పెద్దరాయల ముఖమును జూచినాడు. అతని పెదవులు తడబడినవి.

"అన్న....గారూ!....నన్ను చంపకుడు. తెలియక అపరాధ మొనరించితిని. మీపాదములపైబడి ప్రార్థించుచున్నాను. నన్ను చంపకుడు." అని దీనముగా వేడుకొన్నాడు పెద్దరాయలు. రౌద్రమూర్తియై యున్న రాజశేఖరుని బారినుండి తప్పించుకొనుటకు అతని కంతకంటెనూ మార్గము గోచరించలేదు.

"నీచా! ఇప్పుడు చెప్పుము! ఈ యబలను చూడుము. ఈమె కేమి జవాబు చెప్పగలవు?"

పెద్దరాయలు తలవాల్చి నిలబడినాడు.

"అన్నగారూ! నావలన అపరాధము జరిగినది. దీనిలో నా తప్పేమియునూ లేదు. ఇదంతయునూ ఆ వెంకటనాయకుని దుర్బోధనలను వినుటవలన కలిగినది. అతని మాటలను విని నేను చెడితిని...." అన్నాడు.

రాజశేఖరుని కీ మాటలు విని శరీరము దహించుకొనిపోయినది. నిర్దయతో దుష్టమృగమును సంహరించు వేటగానివలె పెద్దరాయల కుత్తుక నులిమి చంపుటకై ముందునకు అడుగులు వేసినాడు. అతని అంగాంగములు ద్వేషపు దవానలములో దగ్ధమగుచున్నవి. ముఖము జేవురించి భీతిని గొలుపుచున్నది. అతని క్రౌర్యపూరితములైన నేత్రములను జూచి పెద్దరాయలకు తా నిక బ్రతుకజాలడని తోచినది. తప్పించుకొనుటకై తన చివరి ప్రయత్నము చేయుచున్నవానివలె, భీతిల్లి వెనుకకు అడుగులు వేయుచూ నడువసాగినాడు. పైశాచికపు నవ్వు నవ్వుచూ రాజశేఖరుడు అతనిపైబడి ముందునకు నడువసాగినాడు.

క్షణార్థములో రాజశేఖరుని వజ్రముష్టికి చిక్కి దుర్బలుడైన పెద్దరాయలకథ పూర్తికానుండగా, అటువంటి సమయమున రాజేశ్వరి యీ భీకరదృశ్యమును జూచి, పరుగునవచ్చి రాజశేఖరుని పాదములపై బడినది.

"ప్రభూ! ఈ పాపిని చంపకుడు. నాకొరకై యితనిని క్షమింపుడు. ఈ నీచుని–ఈ సామ్రాట్టును మీరు చంపకుడు. నా జీవనము మంట గలసినది—ఇకనైననూ యీ నీచుడు యింతటి పాపకృత్యములకు పాల్పడకయుండునట్లు బుద్ధి జెప్పి, వదలివేయుడు. అతనిపై పగ దీర్చుకొనినచో సామ్రాజ్యము నాయకుడు లేనిది కాగలదు. సామ్రాజ్యముకొరకు, మల్లికార్జునరాయలకొరకు అతనిని క్షమింపుడు. అతని సతులు మాంగల్యమును పోగొట్టుకొని నావలె అనాథయగుటను నేను కోరను. వారికొరకైననూ మీ రీ నీచుని విడచిపుచ్చుడు" అని మొర పెట్టుకొనినది.

ఈ మాటలు విని అంతటి కోపమున నైతము రాజశేఖరునికి దయ కలిగినది. ఆమెను దైన్యముతో నవలోకించి :

"నీచా, ఈ సాధ్విని జూచి నిన్ను చంపక వదలినాను. ఆమె ప్రసాదించిన పునర్జన్మను ఇకనైననూ సార్థకపరచుకొనుము. నీ వంశమునకు కీర్తిప్రతిష్ఠలు కలుగునట్లు జీవింపుము." అని అతనిని చంపుటకు ఉద్యుక్తమైన బాహువులను వెనుకకు తీసికొని, అచ్చట నిలువక వెళ్ళిపోయినాడు. రాజేశ్వరి అతనిని వెన్నంటి వెళ్ళినది. ఎవరునూ ఆమెను అడ్డుకొనలేకపోయినారు.

శాంతికుటీరమునకు చేరుకొనగనే రాజశేఖరుడు తప్పుజేసినవానివలె రుద్రాంబ ఎదుట నిలబడి :

"తల్లీ! నీ కుమార్తెను తెచ్చి నీ కప్పగించినాను. నా సహోదరునివలన జరిగిన యపరాధమును క్షమింపుడు" అని ప్రార్థించినాడు.

"అమ్మా! నేను నిన్ను స్పృశించను. నీవు నన్ను స్పృశింపకుము. నేనొక కుక్కముట్టిన కుండను — నా జీవనము మంటగలసినది. కాని, నా ఒడల నీ విధముగా నాశముగానిరీతిని జూచుకొనుడు. నాకు సెలవిమ్ము పోయివచ్చెదను." అని చెప్పి చేతులు జోడించినది.

"తల్లీ, రాజేశ్వరీ! ఎచ్చటికి పోయెదవు? ఏమి చేయుదువు?"

"ఈ జీవితమున కంత్యము దెచ్చుకొనుటకై వెళ్ళుచున్నాను. పతితయైన నన్ను మీ రడ్డుకొనకుడు" అని అపటినుండి కాలుతీసినది.

ఆమె తల్లియు, రాజశేఖరుడునూ ఆమె నడ్డుటకై చేసిన ప్రయత్నమంతయునూ విఫలమైనది. చివరకా అభాగిని ఎవరిమాటయునూ వినక, తుంగభద్రానదిలో దుమికి తన పాపపు శరీరమును బాసినది.

రాజశేఖరుని కానాడంతయునూ సహోదరిని పోగొట్టుకొనినంత దుఃఖము కలిగినది. ఈ సంఘటన జరిగిన మూడు, నాలుగు దినముల వరకూ అతడేదియో చింతలో మునిగిపోయినాడు. సామ్రాజ్యమునకు సంభవించిన దుస్థితిని జూచి అతనికి హృదయము బద్దలైనది.

ఈ సౌభాగ్యమునకై తాను సింహాసనమును త్యజించుకొనవలసియుండెనా?

ఈ ప్రశ్నకు జవాబు లభించక ఆత్మనిందయందునూ, విస్మృతి యందునూ అనేక దినములు గడపినాడు. పెద్దరాయలపై అతని కెంతటి జుగుప్స కలిగినదనగా, తన పాలిటికి తమ్ముడు లేడనుకొనునంతవరకూ కలిగినది. తమ్ముని యీ జన్మలో చూడరాదని శపథము చేసుకొన్నాడు.

విధికూడ రాజశేఖరుని యీ శపథమును వేరొక విధానమున నెరవేర్చినది.

ఆనాడు రాజశేఖరుడు అంతఃపురమును విడచి వెళ్ళినపిమ్మట పెద్దరాయలకు మరల ప్రాణము వచ్చినట్లయినది. అయిననూ అతనికి ఎదుగన్ననూ కోపోద్రిక్తుడైన రాజశేఖరుని తీక్షణనయనములే కనబడ సాగినవి. అతని వికటాట్టహాసమే వినబడసాగినది. ఇవి అతనిని సర్వ వేళలా పట్టి బాధించసాగినవి.

అతడీ విషయముల నన్నింటినీ వెంకటనాయకునకు జెప్పి, నీ వలననే యీ యనర్థములన్నియూ జరిగినవని తిట్టినాడు.

వేంకటనాయకు డందులకు :

"ప్రభూ ! ద్రోహియగు రాజశేఖరుడు బ్రతికియుండు నంత వరకునూ మన కతనిచే అపాయము తప్పదు. అందువలన మనమతని ప్రతిబంధకమును నివారించుకొనవలయును. లేనిచో అతడు మనలను జంపి సింహాసనము నాక్రమించుకొనగలడు" అన్నాడు.

"రాజశేఖరుని జంపుట సాధ్యమగునా ?" సంశయముతో ప్రశ్నించినాడు పెద్దరాయలు.

"ఈ కార్యభారమును నా కప్పగించి తాము నిశ్చింతగా నుండుడు" అని చెప్పి, అతనికి నమ్మక మేర్పరచి అచటినుండి నిష్క్రమించినాడు.

వెంకటనాయకుడు రాజశేఖరుని నివారించుకొను పెట్లని చాల దీర్ఘముగ నాలోచించి ఒక పన్నుగడ పన్నినాడు.

ఆనాటి అర్ధరాత్రి సమయమున శాంతికుటీరములో భువనేశ్వరి ముందు రాజశేఖరుడు పద్మాసనము వేసుకొని ధ్యానమగ్నుడై కూర్చొని యున్నాడు. నందాదీపముయొక్క మందప్రకాశము కుటీరములో ప్రతి

ఫలించుచున్నది. అప్పుట ఒక మూల తోటమాలి మల్లయ్య కంబళి కప్పుకొని పడుకొనియున్నాడు.

ఉన్నట్టుండి ఉద్యానవనమును కావలికాయుచున్న శునకములు మొరిగినవి. ఆ శబ్దముతో మెలకువకలిగిన మల్లయ్య కుక్కలను శపించుచూ వెలుపలికి వచ్చి చూచినాడు. ఎవరునూ కనబడలేదు. అతడు పదముల సవ్వడికొరకై నిరీక్షించి, విసుగుజెంది మరల కుటీరమునకు వెనుదిరుగనున్నంతలో ఎవరో వెనుకబాటుగా వచ్చి అతని తలపై బడితెతో బలముగా మోదినారు. మల్లయ్య ప్రజ్ఞాశూన్యుడై నేల గూలినాడు. అచట దాగియుండిన రాక్షసులవంటి వ్యక్తులతనిని మోసుకొనివెళ్ళి, సమీపములో నున్న గుబురుచెట్ల నీడలోదింపి, కాలు చేతులు కట్టి పడవేసినారు.

అనంతరము వారు శాంతికుటీరమును ప్రవేశించి రాజశేఖరునిపై హఠాత్తుగా పడి, అతనిని బంధించి కుటీరము ద్వారములను మూసి దానికి చిచ్చు పెట్టినారు.

పూరిగుడిసెయైన ఆ శాంతి కుటీరము లిప్తకాలములో జ్వాలావృతమైనది. చూచుచుండగనే జ్వాలలు మిన్నుముట్టినవి.

రాజశేఖరు డచటినుండి తప్పించుకొనజూచినాడు. కాని సాధ్యపడలేదు. జ్వాలలు నలువైపులా వ్యాపించిపోయినవి. వాటి బారినుండి తప్పించుకొనుటకు రాజశేఖరునకు సాధ్యము గాకపోయినది.

ఉదయ మగునంతలోగా శాంతికుటీరము సంపూర్ణముగా దగ్ధమైపోయినది. దానితోబాటు రాజశేఖరుని భౌతికకాయముకూడ మాడి మసియైపోయినది. ధ్యానమగ్నుడై కూర్చొనియుండగనే అతని ప్రాణవాయువులు అనంతవాయువులలో లీనమైనవి! అగ్నిజ్వాల లచ్చట సమస్త వస్తువులనూ మ్రింగినట్లే, అతనినికూడ సజీవముగా మ్రింగివేసినది!

# 21. భాష్పాంజలి

సూర్యోదయ మగునంతలో శాంతికుటీరము వెంకటనాయకుని విద్రో హమునకు ఫలితముగా కాలి భస్మమైనది. దానితోబాటు రాజ శేఖరుడూ భువనేశ్వరి విగ్రహమూకూడ బూదియైనవి. ఉదయ మగునప్పటికి అగ్నిజ్వాల లారిపోయిననూ, రాజశేఖరు డొనరించిన ఆత్మార్పణ జ్వాల మాత్రము ఆరిపోలేదు.

ప్రజలు రాజశేఖరునికి కలిగిన దుస్థితికై పరితపించినారు. ఈ యగ్నిప్రకరణ మాకస్మికముగా జరిగినదని వెంకటనాయకుడు, పెద్దరాయలు ప్రజలకు నచ్చజెప్పజూచి, రాజశేఖరుని మరణమునకై శోకించుచున్నట్లు నటించిననూ, సామ్రాజ్య నిష్ఠాసేవకులను మాత్రము వారు తమ మొసలికన్నీటితో మోసగించలేకపోయినారు. ఈ దహన ప్రకరణములో పెద్దరాయ - వెంకటనాయకుల ప్రవేశము గలదని భావించి, ప్రజలు వారిని ద్వేషించసాగినారు.

అందులకు తగినట్టు, రాత్రి బడితెదెబ్బతో ప్రజ్ఞాశూన్యుడై పడియున్న తోటమాలి మల్లయ్య అదృష్టవశమున శత్రువుల చేతికి చిక్కక పారిపోయి తప్పించుకొన్నాడు. జ్వాలలు బాగుగా లేచినపుడు దానిలో అతనిని వేయవలయునని భావించియుండిన ఆ వంచకుల కది సాధ్యము గాకపోయినది. అచ్చటనుండిన శునకములు మనుష్యుల వాసనను పసిగట్టి, మొరుగుటచే ఆ హంతకులు మల్లయ్యమాట మరచి పారిపోయినారు.

అగ్నిజ్వాలలను జూచి పరుగిడి వచ్చినవారిలో ఒకడు చెట్టు క్రింద నిశ్చేష్టితుడై పడియున్న మల్లయ్యను గుర్తించినాడు. అతనికి శైత్యోపచారములుచేసి, ప్రజ్ఞ కలిగించగా అతనిద్వారా ప్రజలకు యదార్థము తెలిసినది.

ఇక తానచట నున్నచో తన జీవితమునకు హాని కలుగవచ్చునని భావించి భీతిల్లిన మల్లయ్య, మారువేషముతో తప్పించుకొనిపోయి తల దాచుకొన్నాడు. అతడు తాను జూచిన రాజశేఖరుని దురంతగాథను ప్రజాసామాన్యులకు చాటి చెప్పుచూ, పిచ్చివానివలె పగకొరకై ప్రతీక్షించుచూ సామ్రాజ్యపు నలుమూలలా సంచరించసాగినాడు.

దీనితో పెద్దరాయలు దాచిపెట్టవలయు ననుకొనిన రహస్యము

ప్రజల చెవిలో పడినది. వారు పెద్దరాయల నీచత్వమునకు వ్యధ జెందినారు. అటువంటి నీచుడు సింహాసనములో నుండరాదని నిశ్చయించిన స్వామిభక్తి పరాయణులూ, రాజశేఖరుని అభిమానులూ, పెద్దరాయలను పదవీచ్యుతినిగా జేసి, అతనిపై పగదీర్చుకొనుట కుత్సుకులైనారు. ఈ రాజ్యక్రాంతి ప్రచండ మారుతమువలె సామ్రాజ్యపు నలుమూలలా వ్యాపించి, ప్రజలను ప్రక్షుబ్ధపరచినది. అందరూ రాజశేఖరునివంటి రాజర్షికి జరిగిన యన్యాయమునకై పరితపించుచూ, పెద్దరాయలపైన పగదీర్చుకొనవలయుననుకొన్నారు.

ఈ విధముగా రాజశేఖరుని బలిదానము వ్యర్థము కాలేదు. అతని మరణము అతడు బ్రతికినదానికంటెనూ ఘోరరూపమును దాల్చి, విద్రోహులను మ్రింగుటకై నిరీక్షించసాగినది.

ఇటువంటి సమయములో పెద్దరాయలు తన దుష్కృత్యములను దాచియుంచుటకై, తన కెదురుతిరిగినవారి నందరినీ సంహరించుచూ వచ్చినాడు. పలువిధములుగా అతడు ప్రజలను హింసించసాగినాడు. అతని హింసాకృత్యములతో విసుగుజెందిన ప్రజ లతనిపై తిరుగుబాటు చేయనారంభించినారు.

దీనిచే కోపించిన పెద్దరాయలు వారిని శిక్షించుటకై మరింత క్రూరుడైనాడు. ప్రజలతని పైశాచిక వర్తనమును జూచి 'పిచ్చి ప్రభు' వని అతనికి నామధేయమిడినారు.

రాజశేఖరుని హత్య జేయించినందులకతనికి మనశ్శాంతి లభించక, అతని ప్రేతము స్వప్నములో ప్రత్యక్షమై పీడించుచున్నట్లు తోచసాగినది. "పెద్దరాయా ! నీ పాపము పండినది అదిగో నీ సమాధిని సిద్ధపరచుచున్నాను," అని అతని ప్రేతము గుండెలపై గూర్చొని రక్తపానము జేయుచున్నట్లు తోచెడిది. అటువంటి సముయమున అతడు భయములో బిగ్గరగా కేకవేసెడివాడు, కాని కనులు తెరచి చూడగా ఎవరునూ కనబడువారు కారు. ఈ ప్రేతముయొక్క చిత్రహింసకు జిక్కి అతడు జర్జరితుడై, అతిత్వరలో మంచము పట్టినాడు,

చాలరోజులవరకూ అంతఃపురమును వీడి వెలుపలికి రాలేదు, ఈ సమయమున వెంకటనాయకుడే సామ్రాజ్యమునకు సర్వాధికారియై

తన పాలనను ప్రారంభించినాడు. ప్రజలు పెద్దరాయలు కనబడకపోగా వెంకటరాయలచే అతడు నిహతుడై యుండవచ్చునని భావించినారు.

కాని, మాసములమీద మాసములు గడచినవి. పెద్దరాయలు సజీవుడో, విగతజీవుడో అంతఃపుర సేవకులకుకూడ తెలియక పోయినది.

వెంకటనాయకుడు మాత్రము తానే సర్వాధికారియనునట్లు, పెద్ద రాయల పేరుతో పరిపాలనమును సాగించినాడు.

అతని క్రూర శాసనములకు ప్రజలు తల్లడిల్లినారు. పన్నుల భారముతో వాణిజ్య వ్యాపారములు దెబ్బతినినవి. శ్రీమంతులను దోచుకొని అతడు బొక్కసమును నింపుటకై నరవేటకు ప్రారంభించినాడు.

ఈ దుశ్చర్యలకు భీతిల్లిన ప్రజలు నగరమును విడచి అడవిని చేరినారు.

అందుచే ఊరు అడవియైనది. వ్యవసాయము చేయువారులేక భూములు బీడుపడినవి. వర్షములు లేక క్షామమేర్పడినది. ప్రజలీ పెద్ద రాయ, వెంకటనాయకులు దైత్య పరిపాలనమునుండి తమను రక్షింప వలసినదని సామ్రాజ్య నిషగల మండలేశ్వరుడైన సాళ్వనరసింహుని వేడుకొన ప్రారంభించినారు.

అహో! బిలస్వామి అంశములో సామ్రాజ్యమును విపత్సమయమున కాపాడుటకై జన్మించినవాడని భావించి, ప్రజలతనిని రాజధానిపై దండెత్తివచ్చి సింహాసనము నాక్రమించుకొనవలసినదని ప్రార్థించినారు.

ఇటువంటి సమయముకొరకే వేచియుండిన సాళ్వ నరసింహ నాయకుడు వెంటనే ప్రజల కభయమొసగి, తన సైన్యముతో వెళ్ళి విజయనగరమును ముట్టడించినాడు.

ప్రజలతడు వెళ్ళినచో టంతయునూ సంతోషసంభ్రమములతో ఆహ్వానించి, అతడే సార్వభౌముడనునట్లుగా గౌరవించినారు.

ఈ విధముగా ప్రజాబలమును పొంది, వారికి నాయకుడై వెళ్ళి విజయనగరమును ముట్టడించినాడు.

అతని నెదిరించుటకై వచ్చిన వెంకటనాయకుని సైన్యములు, యుద్ధమాడుటను వదలి, అతని పక్షముననే చేరుకొన్నవి.

నగరమందలి స్వామిభక్తి పరాయణులు విజృంభించి, చేతికందిన ఆయుధములను ధరించి, కోట ద్వారములను ఛేదించి నరసింహ నాయకునకు స్వాగతము పలికినారు.

ఈ పరిస్థితిని కనులారా జూచి యింకనూ రాజధానిలోనుండుటచో అపాయమని గ్రహించిన వెంకటనాయకుడు వెంటతీసుకొని వెళ్ళుటకు వీలైనంత సంపదను తీసుకొని మారువేషమున తప్పించుకొనుటకు ప్రయత్నించినాడు. కాని అతనిని గుర్తించిన ప్రజ లతనిపైబడి, ఆ నీచుని అవతారమును పరిసమాప్తి జేసినారు.

ఆపైన సాళ్వనరసింహుని నేతృత్వములో పెద్దరాయలనుకూడ యిదేవిధముగా హతమార్చవలయునని అంతఃపురములోనికి వెళ్ళినారు. అంతఃపురములో వారి నెవరూ అడ్డుకొనలేదు. పెద్దరాయలకొరకై వారంతఃపురమంతయునూ పరిశోధించినారు. కాని ఎచ్చటనూ అతని జాడ కనబడలేదు.

సాళ్వ నరసింహనాయకునకు నిరాశ కలిగినది. అయిననూ అతడు హతాశుడుగాక అంతఃపురమును స్వాధీనపరచుకొని, రాజ బొక్కసమునూ, ఆయుధాగారమునూ వశపరచుకొనుటకై ఈశ్వరనాయకుని బంపినాడు.

ఈశ్వరనాయకుడటు వెళ్ళినపిమ్మట, యిటు సాళ్వ నరసింహ నాయకుడు పెద్దరాయలు తన చరమ రోజులను గడపినాడను చెప్పబడు గదిని బాగుగా పరిశోధించినాడు. అప్పుడు ఒక రక్తసిక్తమైన లేఖ యొకటి ఖడ్గమునకు గ్రుచ్చుకొనియున్నది.

ఆ లేఖలో పెద్దరాయ లీ విధముగా వ్రాసియున్నాడు :

"సాళ్వ నరసింహనాయకుడా !

అహోబిల నరసింహస్వామి యాజ్ఞ మేరకు విజయనగర సింహాసనమును మీ కప్పగించి వెళ్ళుచున్నాను. మీ రిచ్చటికి వచ్చునంతలో నేను మీ నుండి దూరముగ - చాల దూరముగ వెళ్ళియుందును. మీరు నన్ను వెదకు ప్రయత్న మొనరించవలదు. అందువలన ప్రయోజనముండదు.

నేను నా జీవితపు చరమాంకమును పూర్తిజేయుటకు మునుపు

నా జీవితమును సింహావలోకనము జేసుకొని, దానిని మీ ముందుంచుటకు కోరుచున్నాను.

నేను పరమ పాపిని. నావంటి పాపి యిక జన్మించబోడు. నా పాలిటికి దైవమువలె నుండి, దేహమును, ఆత్మను పోషించిన భ్రాత యగు రాజశేఖరుని హత్యజేయించి ఆత్మద్రోహినైనాను. అందులకై నా కిపుడు చాల పశ్చాత్తాపము కలిగినది.

నావంటి పాపి సింహాసనముపై నుండరాదని యీ పవిత్రమైన సింహాసనమును మీ కప్పగించి వెళ్ళుచున్నాను.

దైవదత్తముగా లభించిన యీ సింహాసనమును మీ రలంకరించి, నా వలన సామ్రాజ్య ప్రజలకు జరిగిన అన్యాయములకు తగిన యుపకృతి కలిగించవలయునని ప్రార్థించుచున్నాను. అట్లే యీ సామ్రాజ్యమును బహిరంతశ్శత్రువుల బారినుండి రక్షింపవలయునని వేడుకోలు.

ఇది పురాతనమైన సింహాసనము. భువనేశ్వరీమాత అనుగ్రహముతో, పూజ్యులగు విద్యారణ్య మౌనీంద్రుల అమృతహస్తముతో నిర్మింపబడిన ధర్మసామ్రాజ్యమిది. దీనిని తాము స్వీకరించి, ధర్మ ప్రభువులై సామ్రాజ్య ప్రజలను పోషింపవలయునని నా విన్నపము.

భువనేశ్వరీమాత అనుగ్రహము తమకు చేకూరుగాక !

విద్యారణ్యుల తపఃప్రభావము, మిమ్ములనూ - సామ్రాజ్యమునూ సంరక్షించుగాక !"

చదువుచుండగనే సాళ్వ నరసింహుని నయనములనుండి రెండశ్రు బిందువులు రాలి ఆ లేఖమీద పడినవి, అది హుతాత్ములైన రాజశేఖర - పెద్దరాయలకు అతడర్పించుచున్న బాష్పాంజలియైనది.

సాళ్వనరసింహుడు పెద్దరాయల ఆదేశానుసారము, ప్రజల కోరిక మేరకు విజయనగర సింహాసన మధిష్ఠించినాడు.

విజయనగర సామ్రాజ్యేతిహాసములో సంగమవంశ పాలనము ముగిసి, సాళ్వవంశ పరిపాలనాధ్యాయము ప్రారంభమైనది.

తరువాతి కథకొఱకై "లోకవేశ్వరుడు" అను భాగమును జదువ గోరెదము.



## మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA122B137 |
| పుస్తకం పేరు | రాజ్యక్రాంతి |
| తారీఖు | 29/10/24 |
| ముందు అట్ట | n/o |
| వెనుక అట్ట | n/o |
| మొత్తం పేజీలు | 225 |
| పెద్ద సైజు పేజీలు | n/o |
| ఖాళీ పేజీలు | 4 |
| లేని పేజీలు | n/o |
| తయారు చేసినది | Triveni |
| పేజీలు విడదీసినది | Triveni |
| స్కాన్ చేసినది | Ch. Ramya |
| పరీక్ష చేసినది | pragathi |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | good |